# జగత్ప్రవక్త

హజ్రత్

# మహమ్మదు పైగంబరులవారి

# దివ్యచరిత్రము.

మొదటిభాగము.

---

గ్రంథకర్త

మౌల్వీ మున్షీ షాజిక్

## ముహమ్మద్ అబ్దుల్ గఫూర్.

(కర్నూలుజిల్లా కంబమునివాసి)

ఉర్దూమున్షీ, బోర్డుహైస్కూలు, చిత్తూరు.

ది॥ డిస్ట్రిక్టు ప్రింటింగు వర్క్సు, చిత్తూరు.

1935

వెల [1—0—0]

## సహాయులు.

---

ఆలీజనాబ్ ఖాన్ బహద్దరు ఎ. అబ్దుల్ కరీమ్ సాహెబ్, ప్రొప్రైటర్ కరీంబీడి

గుంటూరు. మదరాసు.

ఆలీజనాబ్ హాజీముహమ్మద్ అబ్దుల్ రవూఫ్ సాహెబ్ సౌదాగర్.

ఆలీజనాబ్ యస్. రహ్మతుల్లా సాహెబ్, మెకానిక్.

ఆలీజనాబ్ సులతానల్లీముహమ్మద్ హుస్సైన్ సాహెబ్.

ఆలీజనాబ్ ఆదంఖాన్ సాహెబ్ జౌహరీ.

ఆలీజనాబ్ (ఛోటే) అహ్మదుఖాన్ సాహెబ్, మెకానిక్

ఆలీజనాబ్ (బడే) అహ్మదుఖాన్ సాహెబ్, మెకానిక్

ఆలీజనాబ్ ముహమ్మద్ అబ్దుల్ నబీన్ సాహెబ్ B.A. L.T. డిప్యూటి ఇన్స్పెక్టరు.

ఆలీజనాబ్ ఎమ్. మహబూబ్ అలీ సాహెబ్ M.A. L.T, హెడ్ మాస్టరు, గవర్నమెంటు ముహమ్మడన్ హైస్కూలు.

ఆలీజనాబ్ ముతవల్లీ ముహమ్మదుయాఖూబ్ సాహెబ్.

ఆలీజనాబ్ ముహమ్మదు అబ్దుల్ గఫూరుసాహెబ్, మెకానిక్.

ఆలీజనాబ్ యిస్మాయిల్ ఖాన్ సాహెబ్, మునిసిపల్ కౌన్సిలర్.

ఆలీజనాబ్ ఖాజీహాజీఅబ్దుల్ కరీమ్ సాహెబ్, డాక్టరు.

ఆలీజనాబ్ సయ్యద్ అబ్దుల్ జబ్బార్ సాహెబ్, బుఖారీ.

ఆలీజనాబ్ అఫ్జలుల్ ఉలమామున్షీ ముహమ్మద్ అబ్దుల్ సత్తార్ సాహెబ్.

ఆలీజనాబ్ సయ్యద్ నిజాముద్దీన్ సాహెబ్, డాక్టరు. నొనకొండ

ఆలీజనాబ్ అబ్దుల్ వహ్హాబ్ సాహెబ్, పోలీసు సబ్ఇన్స్పెక్టరు. ,,

ఆలీజనాబ్ సయ్యద్ మహబూబ్ సాహెబ్, స్టేషన్ మాస్టరు. ,,

ఆలీజనాబ్ షేక్ఇమామ్ మిర్జామహబూబ్ బేగ్ సాహెబ్ మార్కాపురము.

ఆలీజనాబ్ షేక్ దీనాసాహెబ్, ఫారెస్టరు. ,,

ఆలీజనాబ్ ముహమ్మద్ ఖాసిమ్మియాసాహెబ్ సరాఫ్ కంబము.

ఆలీజనాబ్ ముహమ్మద్ అక్బరుసాహెబ్, సబ్ఇన్స్పెక్టరు. ,,

ఆలీజనాబ్ షేక్ ఇమామ్ సాహెబ్, కంట్రాక్టరు, కాళహస్తి.

ఆలీజనాబ్ ముహమ్మద్ ఖాన్ సాహెబ్, కమర్షియల్ ఇన్స్పెక్టరు, చిత్తూరు.

ఆలీజనాబ్ పీర్ ముహమ్మద్ గౌస్ సాహెబ్ షరఫ్, బళ్లారి.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్ నహమదుహూ వనుసల్లీ.

# మనవి.

దేవుడు మానవులకు ధర్మమార్గము చూపుటకై యనేక ప్రవక్తలను పంపెను. వారిలో కడపటివారు హజరత్ ముహమ్మదువారు. వారికి నొసగ బడిన కంతయు ఖురానమూలమున ధర్మోపదేశము గావించెను. కావున పైగం బరులవారు ప్రపంచమున కెంతేని మహోపకారులు. హజరత్ వారు పదేశించిన ధర్మము లన్నియు ననుసరించెదరు. హజరత్ గారివారి నడవడికయు గ్రహించి యాచరించవలసినది. ప్రజలకు పెద్దల యుపదేశ ముకన్న పెద్దలాచరించిన క్రియలే ముఖ్యముగా నుండును గదా! అందుచే పెద్దల చరిత్రములు వ్రాయబడుచున్నవి. వారిలో హజరత్ ముహమ్మదు పైగంబరులవారి చరిత్రము మానవకోటికెంతయు నావశ్యకము ను ఆచరణీయమును. వారి చరిత్ర సంపూర్ణముగా తెనుగుభాషలో వ్రాయ బడినది. అట్టి భాగ్యము మన తెనుగువారికి యింకను లభించినది. సంపూర్ణ ముగా లేదు. ఆ కొరతను తీర్చుటకై నేను హజరత్ పైగంబరుల వారి దివ్యచరిత్రమును అరబ్బీ పారసీ ఉర్దూ మొదలైన భాషలగ్రంథ ములనుండి విషయముల గ్రహించి తెనుగున వ్రాసితిని. నాయత్న మెంతవరకు సఫలమాయెనో చదువరులే నిర్ణయింపవలయు. హిందూ క్రైస్త ముహమ్మదీయ సహోదరులందరును సావధానముగ హజరత్ పైగంబరుల వారి చరిత్రమును పఠించి యందలి భావములను గ్రహించి యుభయ లోక ములలోను మేలుపొందుటకు పాటుపడుదురని నా యాశ్య. ఇందు నెట్టి లో పములు కానిపించిన అవి నాయవియని తలంచి నన్ను చదువరులు మన్నింతు రుగాక! బోర్డుహైస్కూలు ఆంధ్రపండితులును బహుగ్రంథరచయితలును సహజ కవులును అగు పూజ్యులగు శ్రీ రాముల పెద్దగారు గ్రంథ సవరణ గావించి మహోపకారము నొనర్చినందులకు వారికి కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాడను. ఈ చరిత్రము ముద్రించుటకు సాహాయ్యమొనర్చిన పెద్దలయెడ సదాకృతజ్ఞుడనై వారి పవిత్రనామముల నందు లిఖించు చున్నాను.

చిత్తూరు.
1—5—1935.

ఇట్లు విన్నవించు,
ముహమ్మద్ అబ్దుల్ గఫూర్.

# విషయసూచిక.

పుట.





# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 21 | అదాను | అద్నాను. |
| 51 | 9 | నిజసంగతి | నిజమైనసంగతి |
| 54 | 1 | ను [illegible] | నుండి |
| 80 | ౫ | నౌకరులు | నౌకరుటు |
| 85 | 1 | ముసల్మానులు చేయునట్లు | ముసల్మానులు నమాజు చేయునట్లు |
| 88 | 4 | సర్వాధికారుడు | సర్వాధికుడు. |
| డిటో | 13 | డిటో | డిటో |
| 96 | 1 | ఖాబా | కాబా |
| 105 | 2 | [illegible] దేవా | ఓ దేవా |
| 142 | 3 | వెడలకలేను | వెడలకలేననియు |
| 160 | 21 | సుహైలు | సుహైలు |
| 189 | 3 | ఖురైఖులు | ఖురైషులు. |

# జగత్ప్రవక్త.

రెండవభాగము అచ్చగుచున్నది

అందు హజ్రత్ పైగంబరులవారి రూపవర్ణనము, ఆచారములు, సుగుణముల వివరము, వారుచూపిన అమానుషము (మోజిజా)లు, ఖురానెషరీఫు దేవుని గ్రంథమనియు, హజ్రత్ ముహమ్మదురసూలువారు దేవుని ప్రవక్తలనియు రుజువుపఱచుట, పైగంబరులవారినిగూర్చి పూర్వగ్రంథమగు బైబిలులోనున్న వాక్యములు, పైగంబరువారుపదేశించిన భవిష్యద్విషయములు, వారిధర్మపత్నుల విషయము, వారి సంతానముసంగతి, ఇస్లాముధర్మములు,(జరూరుల్ ముస్లిమీన్) ఈమానువిషయము, వజూ, గుసులు, నమాజుచేయుపద్ధతులు, రోజా(ఉపవాసము), జకాతు(దానము), హజ్(కాబాయాత్ర) హలాల్, హరామ్, మొదలైన విషయములు వివరముగా వ్రాయబడినది.




# జగత్ప్రవక్త

## హజ్రత్ ముహమ్మదు రసూలువారి దివ్యచరిత్రము.

---

### అరేబియా దేశము.

హజ్రత్ ముహమ్మదు రసూలువారు అరేబియా దేశమందున్న మక్కాపురమునందు జననమొందిరి. కావున అరేబియా దేశమును గూర్చియు అందు నివసించు అరబ్బులను గూర్చియు తెలిసికొనుట చాల అవశ్యకమైనది.

అరేబియా దేశమొక ద్వీపకల్పము. దానికిచుట్టు ఎఱ్ఱసముద్రమును హిందూమహాసముద్రమును ఉమ్మాను ఖాతము నున్నవి. అరేబియాదేశము భూస్వభావమునుబట్టి యైదుభాగములుగ విభజింపఁబడినది.

(1) తెహామా:—ఎఱ్ఱ సముద్రతీరమునుండి సరాతు పర్వతముల వఱకు.

(2) హిజాజ్:—సరాతు పర్వతముల మధ్య ప్రదేశము. అది యమను దేశమునుండి సిరియా (షామ్) వఱకు వ్యాపించియున్నది.

(3) నజదు:—సరాతు పర్వతముల పడమటి దిక్కున నున్న భాగము. అదియమను దేశమునుండి ఇరాఖు దేశము వఱకు వ్యాపించియున్నది.

(4) యమను:— నజదు దేశమునకు ఉత్తరదిక్కున హిందూమహాసముద్రతీరమువఱకును, పడమటిదిశను హాజర్ మాతు ఉమ్మానును వఱకు వ్యాపించియున్నది.

(5) అహాజు:—యమామా పురములును, బహ్రైను మొదలైన పురములు.

అరేబియా దేశములో వానలు మిక్కిలి తక్కువ. అచ్చట భూమి యెక్కువగా నిసుకతో నిండియున్నది. అందు భయంకరమైన యెడారులు గలవు. నల్లనికొండలు పెక్కులు గలవు. నీళ్ళవసతిలేదు. అచ్చటచ్చట నీటియూటలుగలవు. అట్టి చోట్ల పచ్చిక కనబడును. అట్టి ప్రదేశములందే మనుష్యులు వసింతురు. మిగిలిన ప్రదేశములన్నియు నీళ్ళ వసతి లేనందున మానవులు వసించుటకు తగినవికావు. ఊట నీళ్ళుకూడ కొంతదూరము ప్రవహించి యిసుకలోనే యింకిపోవును. కావున ప్రజలట్టిచోట్ల గుంటలు త్రవ్వుకొనుదురు. అవికూడ కొంతకాలములోనే యెండిపోవును. కావున వర్షము కురియకున్నచో చాల కష్టము గలుగుచుండును.

యమను ప్రాంతములోని భూమి యితర ప్రాంతముల నేలకంటె సేద్యమునకు చాల ననుకూలమైనది. అచ్చట ఖర్జూరపు తోటలును పైరు పొలములును గలవు. అచ్చటి పురములలోఁగూడ జనసంఖ్య యెక్కువగా నుండును. నీళ్ళ వసతి లేనందున అరబ్బుల బిడారములు ఒకచోటినుండి మఱొక

చోటునకు ప్రయాణము చేయుచు నీళ్లు పచ్చిక వసతులున్న చోట్ల బసచేయుచుందురు. సరియైన త్రోవలు లేనందున ప్రయాణములందు గలుగు కష్టములు సహించు సామర్థ్యము అరబ్బులకు చాల గలదు.

సేద్యము లేనందున వారి జీవనోపాయమునకు ఒంటెలు, పశువులు, గొఱ్ఱెలు ముఖ్యమైన యాధారములు. వాని పాలు, మాంసము, అరబ్బులకు ముఖ్యమైన యాహారము. వారు వాని రోమములచేత వస్త్రములు నేసికొందురు. గుడారములు వేసికొందురు. ఒంటెలు అరబ్బులకు ప్రయాణమందు నెక్కుడు సహాకారులు. మేలైన గుఱ్ఱములు కూడా గలవు. అచటి గుఱ్ఱములు చాల ప్రసిద్ధికెక్కినవి. అరబ్బులలో కొందఱు వ్యాపారముకూడ చేయుచుండిరి.

—: అరబ్బులు :—

అరబ్బులు హజరత్ నూహు (నోహు) ప్రవక్తగారి కుమారుడగు సాము (షేము) సంతతివారు. అరబ్బులు 1. అరబె బాయిదా. 2. అరబె ఆరిబా 3. అరబె ముస్తారిబా అను మూడు విధములుగా నున్నారు.

—: అరబె బాయిదా :—

అరబెబాయిదావారు పూర్వమునుండియే అరేబియా దేశములో నివసించుచుండినవారు. కాని వారు ఇస్లామునకు చాల పూర్వమే నశించిరి. వారికుటుంబములు అనేకశాఖలుగ చీలిపోయినవి. అందు ఆదు, సమూదు, అమాలిఖా, తసము, జుదైసు, అమము, జుర్హుము, హాజర్ మౌతు అనునవి చాల ప్రసిద్ధికెక్కినవి. అవి యన్నియు తుదముట్ట నశించినవి.

వారు ఇరాఖునుండి సిరియా, ఐగుప్త (మిసరు) దేశముల వఱకు తమ రాజ్యము స్థాపించిరి. వారే బాబలు అషోరు రాజ్యములను స్థాపించినవారు. వారి చరిత్రములు పూర్వమునుండి వివరముగా లేకున్నను ప్రస్తుతము భూగర్భ శోధనముచే బయలుపడుచున్న శాసనములవలన వారి చరిత్రములు వ్రాయఁబడుచున్నవి.

—: అరబె ఆరిబా :—

ఖహతాను సంతతి వారిని అరబె ఆరిబా యందురు. వారి జన్మభూమి యమను దేశము. వారిలో హిమ్యరు, కహలాను ఉజ్ద అను శాఖల వారు ప్రసిద్ధి కెక్కిన వారు. హిమ్యరు వంశము అనేక శాఖలు, ఉపశాఖలుగా చీలినది. అందు సకాసికు, జైదెజమ్హూరు అనునవి ముఖ్యమైనవి. కహలాను వంశము పెక్కు శాఖోపశాఖలుగా చీలినది. అందు, హమ్దాను, అన్మారు, కిన్దా, త్రై, ముజ్ హజ్, లఖము, జుజాము, అను కుటుంబములు ముఖ్యమైనవి. ఉజ్ద వంశము యొక్క శాఖలు పెక్కులైనవి. ఆ వంశములోనే తబాబియా రాజులు గడచిరి. ఆ శాఖలోనే జన్మించిన బిల్ఖీసురాణి సబా నగరమందు రాజ్యము చేసెను. ఆవంశము వారు దేశాభివృద్ధికై చెఱువులు నిర్మించి పైరు చేయుచుండిరి. మారిబు నగరమందు ఒక గొప్ప చెఱువుండెను. ఒకతూరి దాని కట్ట తెగి యమనునకు జలోపద్రవము గలిగి యనేకులు నశించిరి. పెక్కు కుటుంబముల వారు యమను దేశమును విడిచి దూర దూర దేశములకుఁబోయి నివసింప సాగిరి. ఉజ్ద వంశము వారిలో సాలబా అను నతఁడు తన కుటుంబమును దీసికొని

మదీనా పురమునకుఁ బోయి వసింపసాగెను. వారు అచ్చట పూర్వమునుండి కాపురమున్న కొన్ని ఇస్రాయీలియుల కుటుంబముల వారిని లోఁబఱచుకొని యచట కోటలు గట్టుకొనిరి. వారచట ఖర్జూరపుతోఁటలు నాటిరి. వారి సంతతిలో ఔసు, ఖజ్రజు అను వంశములు చాల ముఖ్యమైనవి. ఆ వంశములవారే ఇస్లాములోఁ జేరి అన్సారులు అను బిరుదు పొందినవారు.

ఉజ్జా సంతతివాఁడగు ఖుజాఆ మక్కానగరమును జయించి యచట పూర్వమునుండి కాపురమున్న బనీజుర్హుము వంశమువారిని వెడలఁగొట్టి మక్కాపురములో తన నివాసము ఏర్పఱచుకొనెను. ఉజ్జా సంతతివాఁడగు నసరు తెహామా దేశమునకుఁ బోయి యచ్చట తన నివాసము ఏర్పఱచుకొనెను. అచట నతని సంతతి చాల వృద్ధిపొందెను.

అనరె ఉజ్జాయొక్క కుమారులలో ఇమ్రాను అను నతఁడు యమను దేశమునుండి ఉమ్మాను దేశమునకుఁబోయి యచట తన నివాసస్థానము ఏర్పఱచుకొనెను.

అనరె అజ్జాయొక్క రెండవ కుమారుఁడగు జఫ్నా అను నతఁడు సిరియా (షాము) దేశమునకు వెళ్లి యచటి సరిహద్దులలో తన రాజ్యము స్థాపించుకొనెను. అతని వంశమువారు చాల కాలమువఱకు నచటి రాజ్యమును పాలించుచుండిరి. కహలాను సంతతిలోని లఖము కుటుంబములవారు, ఇరాఖు దేశమునకుఁ బోయి వసింపసాగిరి. ఆవంశమువారే "హీరా" అనురాజులైరి.

తై అనువాని సంతతివారు మదీనా పట్టణమునకు ఈశాన్యదిశకు వచ్చి నివసింపసాగిరి.

కల్బుయొక్క వంశమువారు నజదు దేశమునకుంబోయి దానికి ఉత్తర దిక్కునందున్న సరిహద్దులలో తమ నివాసము ఏర్పఱచుకొనిరి.

హిమ్యరు, కిన్దా, మజ్హా అను వంశములవారు యమను దేశమును వీడక యచటనే కాపురముండిరి. పైనుదహరిం పఁబడిన తీరున యమను దేశములవారు జలోపద్రవముచే పలు దేశములలో తమతమ నివాసము లేర్పఱచుకొనిరి.

—: అర బెము స్తారి బా :—

హజ్రత్ ఇస్మాయీలు ప్రవక్తగారి సంతతివారిని అర బెముస్తారిబా అందురు. హజ్రత్ ఇస్మాయీలు ప్రవక్త గారి పితరులదేశము సిరియా (షామ్) దేశము. హజ్రత్ ఇస్మాయీలుగారి తండ్రిగారగు హజ్రత్ ఇబ్రాహీముగారు ఇస్మాయీలును సిరియాదేశమునుండి కొనివచ్చి అరేబియా దేశ ములో నిపుడు మక్కాపురమున్నచోటున వదలిపోయిరి. అచట ఇస్మాయీలుగారి సంతానము చాలవృద్ధిపొందెను. వారి సంతానమునే అరబెముస్తారిబా (అనఁగా క్రొత్తగా అరేబియా దేశములోవచ్చి నివాసము ఏర్పఱచుకొన్నవారు) అనుదురు. ఇస్మాయీలుగారి సంతతిలో కొన్ని తరములపిదప అద్నాను అను నతఁడు పుట్టెను. అతనివంశము చాల వృద్ధిపొంది గొప్ప ప్రఖ్యాతి గాంచినది. ఆయన వంశము శాఖోప శాఖలుగా చీలిపోయి గొప్ప జనసంఖ్య గలది యాయెను. ఆ యన వంశములోనే జగత్ప్రవక్త యగు హజ్రత్ ముహమ్మ దు రసూలువారు పుట్టిరి. కావున అద్నాను వంశశాఖలను గూర్చి కొంతవ్రాయుదుము.

అద్నాను జన్మభూమి మక్కానగరము. అతని కుమారుఁడగు ముఅదు యొక్కయు, అద్నాను మనుమఁడగు నిజారు యొక్కయు సంతతిలో ముజరు, అయాదు, రబీయా అను శాఖవారు ముఖ్యులు. రబీయా శాఖవారు చాల ప్రసిద్ధి కెక్కినవారు. అరేబియా చరిత్రములో వారి విషయమును గూర్చి చాల చర్చయున్నది. వారి యుపశాఖలలో బకరు తగ్లిబు అను శాఖలవారు చాలప్రముఖులు. ముజరు అను నతనికి ఇల్యాసు, ఖైసు అను నిద్దఱు కుమారులు. ఖైసు వంశములో హవాజను, గత్ఫాను కుటుంబములు చాల ముఖ్యమైనవి. గత్ఫాను వంశము జుబ్యాను, అబుసు అను శాఖలుగా చీలి గొప్పది యయ్యెను. ముజరు కుమారుఁడగు ఇల్యాసు యొక్క సంతానములో కినానా, తమము, హుజైలు, అసదు, అను వారి సంతతులు చాలప్రసిద్ధి చెందినవి. కినానా సంతానములో ఫిహరు అను నతఁడు పుట్టెను. అతనినే ఖురైషు అనుదురు. అతని సంతతినే ఖురైషులు అని పిలుతురు. అతని సంతానము పెక్కు శాఖోపశాఖలుగా చీలినది. ఆ శాఖలలో బనీహాజ్మా, బనీ సహాము, బనీ మఖ్జూము, బనీ తీము, బనీ అదీ, బనీ జహరా, బనీ అబ్దెదారు, బనీఅబ్దెమనాఫు, అను కుటుంబములు చాల ప్రసిద్ధి కెక్కి వృద్ధిపొందినవి. అబ్దెమనాఫునకు, అబ్దెషమ్సు, నౌఫిలు, ముత్తలబు, హాషిము, అను నలుగురు కుమారులు. వారిలో హాషిము సంతతిలోనే మహమ్మదు రసూలు వారు పుట్టినది. అనఁగా హాషిముయొక్క కుమారుఁడు అబ్దుల్ ముత్తలబు. అబ్దుల్ ముత్తలబుయొక్క పుత్రుఁడు అబ్దుల్లా. అబ్దుల్లాయొక్క పుత్రులు

ముహమ్మదు రసూలువారు. పై నుదహరింపఁబడిన ఇస్లామియాలు ప్రవక్తగారి సంతానమునే అరబె ముస్తారిబా అందురు. ఇఁక హజ్రత్ ముహమ్మదు రసూలువారి వంశమును, మూల పురుషుఁడగు ఆదము ప్రవక్త గారినుండి ముహమ్మదు వారి వఱకు వ్రాయుదుము. మధ్య మధ్య వారి పితరుల విషయమును గూర్చి కూడ కొంత వ్రాయుదుము.

—: హజ్రత్ ముహమ్మదు రసూలువారి వంశావళి :—

మూలపురుషుఁడగు ఆదము ప్రవక్తగారికి బీబీహావ్వాయందు షీసు (షేతు) అను కుమారుఁడు జన్మించెను. ఆదముగారు మొట్టమొదటి దేవుని ప్రవక్త. ఆయనయే మూల పురుషుఁడు. ఆయన సంతానమే లోకమంతయు వ్యాపించినది. ఆదముగారిని గూర్చి ఖురానె షరీఫులోఁ గలదు. దేవుఁడు ఆదామును తన సర్వశక్తిచే సృజించెను. షీసునకు యానిషు (ఎనోషు) అను కుమారుఁడు పుట్టెను. యానిషునకు ఖైనను (కేయినా) అను పుత్రుఁడు గలిగెను. ఖైనను, మహాలేలు (మహాలలేలు) ను గనియె. మహాలేలునకు యెరెదు అను పుత్రుఁడు గలిగెను. యెరెదునకు అఖ్నోకు (హనోకు) అను కుమారుఁడు జన్మించెను. అఖ్నోకు ముతవష్షలఖు (మతూషెలహు) ను గాంచెను. అతనికి లామకు (లెమకు) పుట్టెను. లామకునకు నూహు (నోవహు) అను పుత్రుఁడు గలిగెను. నూహు గొప్ప ప్రవక్త. అతని కాలమున గొప్ప జలప్రళయము గలిగెను. దుష్టులు జలములో మునిగి నశించిరి. అతఁడొక యోడచేసి దానివలన జలప్రళయమునుండి దేవుని యనుగ్రహమువలన రక్షింపఁబడియె. అతని సంతానమే

లోకమంతటను వ్యాపించెను. నూహు ప్రవక్తనుగూర్చి ఖురానెషరీఫులో నున్నది. నూహుగారి పుత్రులలో సాము, (షేము) హాము, యాఫిసు (యాపెతు) అను ముగ్గురు పుత్రుల సంతానమె లోకమంతటను వ్యాపించినవి. నూహు కుమారుడైన సాము (షేము) నకు అర్ఫఖ్షదు (అర్పక్షదు) అను పుత్రుడు జన్మించెను. అర్ఫఖ్షదునకు షాలహు (షెలహు) అను కుమారుడు గలిగెను. షాలహునకు ఏబెరు అను పుత్రుడు పుట్టెను. ఏబెరు పాలగు (పెలుగు) ను కనెను. పాలగునకు రాఊ (రయూ) అను కుమారుడు గలిగెను. రాఊనకు శారూఖు (సెరూగు) అను పుత్రుడు జన్మించెను.

శారూఖునకు నాహోరు అను కుమారుడు గలిగెను. నాహోరునకు తారహు (తెరహు) అను కుమారుడు జన్మించెను. అతనికి ఆజరు అను పేరుకూడ గలదు. తారహునకు ఇబ్రాహీము (అబ్రాము) అను పుత్రుడు జనియించెను. హాజరత్ ఇబ్రాహీముగారు గొప్ప ప్రవక్తలు. వారికి ఖలీలుల్లా (దేవుని ప్రియుడు) అను పేరు దేవునిచే లభించెను. వారు బీబీసారాను వివాహమాడిరి. చాల కాలము వఱకు వారికి బీబీసారాయందు బిడ్డలుకలుగలేదు. హాజ్రత్ ఇబ్రాహీముగారు ప్రవక్తగానున్న కాలమున బాబలు దేశపురాజు తన రాజ్యగర్వముచే తన విగ్రహముచేసి ప్రజలచే పూజింపఁజేయుచుండెను. హాజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తగారు రాజునకును ప్రజలకును విగ్రహారాధన చేయకూడదని బోధించిరి. అప్పుడు రాజు హాజ్రత్ ఇబ్రాహీము గారికి చాల బాధలు కలిగించెను. అందుచే వారు తమ జన్మభూమి వదలి కనానునకు

వెళ్లిరి. అపుడు వారికి 75 సంవత్సరముల వయస్సుండెను. వారి వెంబడి వారి భార్యయగు బీబీసారాయు అన్న కుమారుఁడగు లూతు (లోతు) నుండిరి. వారు తమ జీవనమునకై గొఱ్ఱెలు, మేఁకలు మేపుకొను చుండిరి. కనాను దేశములో వానలేక కఱవు కలిగినందున సమీపములో నున్న ఐగుప్త (మిసరు) దేశమునకు హజ్రత్ ఇబ్రాహీము గారు బీబీసారాను దీసికొని వెళ్లిరి. ఆ కాలమున ఐగుప్త దేశమును రఖ్యూను అను రాజు పాలించు చుండెను. ఆ రాజు బీబీసారాగారి మహిమను ఎఱిఁగి తన కుమార్తెను వారి శుశ్రూష కొఱకు నొసంగి బీబీసారాగారిని చాల గౌరవించెను. ఆ రాజు కుమార్తె పేరు బీబీ హాజరా (హాగరు). వారు మరల కనాను దేశమునకు వచ్చిరి. హజ్రత్ ఇబ్రాహీము గారికి బీబీసారా యందు బిడ్డలు కలుగకుండుటచే బీబీసారా హజ్రత్ ఇబ్రాహీము గారిని ప్రోత్సాహపఱచి బీబీ హాజరాను వారికిచ్చి వివాహము గావించిరి. దాని పిదప హజ్రత్ ఇబ్రాహీము గారికి బీబీ హాజరా (హాగరు) యందొక కుమారుఁడు కలిగెను. అపుడు వారికి 86 సంవత్సరముల వయస్సుండెను. ఇబ్రాహీముగారు తమ జ్యేష్ఠ కుమారునికి ఇస్మాయీలు (ఇస్మాయేలు) అను పేరు పెట్టిరి. బీబీ హాజరాగారు ఐగుప్త రాజు కుమార్తె. ఆమెతో దేవదూతలు మాటలాడు చుండిరి. ఆమె దేవుని సన్నిధిని చాల గౌరవముగలయామె. అందుచే దేవుఁడు ఆమెను, ఆమె సంతానమును కష్టకాలమందు రక్షించి విస్తరింపఁ జేసెను. చూడుఁడు (బైబిలు ఆది కాండము 16 వ అధ్యాయము 10 వ వాక్యము)—

యెహోవా (దేవుని) దూత నీ సంతానము నిశ్చయముగా విస్తరింప చేసెదను. అది లెక్కింప వీలు లేనంతగా విస్తార మవునని యామె (హాజరా) తో చెప్పెను.

హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తగారికి బీబీ సారాయందు (100) నూఱేండ్ల వయస్సులో రెండవ కుమారుడు పుట్టెను. అతనికి ఇస్హాఖ్ (ఇస్సాకు) అని ఇబ్రాహీముగారు పేరుపెట్టిరి. ఇస్సాకుగారికి యాకూబు ప్రవక్తగారు పుట్టిరి. యాకూబు గారి సంతానములో ననేక ప్రవక్తలు గడచిరి. వారి సంతానమునే బనీ ఇస్రాయీలు అని చెప్పుదురు. ఇబ్రాహీము గారి జ్యేష్ఠకుమారుడగు ఇస్మాయీలు సంతతిలోనే హజ్రత్ ముహమ్మదు రసూలు వారు జన్మించిరి. కావున ఇస్మాయీలుగారిని గూర్చి కొంత వ్రాయుచున్నాము.

—: హజ్రత్ ఇస్మాయీలు ప్రవక్త :—

ఇబ్రాహీము ప్రవక్తగారికి బీబీ హాజరా యందు పుత్రుడు గలిగినందున బీబీసారా గారికి నామెపై నసూయ పుట్టెను. అందుచే బీబీ హాజరాను జ్యేష్ఠ కుమారుడగు ఇస్మాయీలును, అరణ్యమున వదలి రమ్మని హజ్రత్ ఇబ్రాహీము గారిని బీబీసారా నిర్బంధించెను. అందుచే హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్తగారు బీబీ హాజరాను తమ జ్యేష్ఠ కుమారుని తీసికొని సిరియా దేశము నుండి పారాను (మక్కా) అరణ్యమునకు వచ్చి యచట వదలి పోయిరి. అట్లు వారు వదలి పోవు నపుడు బీబీ హాజరాగారు ఇబ్రాహీము గారిని వెంబడించి మమ్ము అరణ్యములో వదలి పోవుచున్నారేమి అని యడుగగా దేవుని యనుగ్రహము మీకుగలుగును అని చెప్పిరి.

అట్లైన చింతలేదు అని బీబీహాజరాగారు పలికిరి. తమ తో నున్న యన్నము నీళ్లు ముగిసిపోఁగా బిడ్డకును ఆమెకును దాహబాధ గలిగెను. బీబీ హాజరా బిడ్డను ఒకతిప్ప (కాబా మసీదుచోటు) యొద్దనుంచి నీళ్లు వెతకుటకు సఫామర్వా కొం డలమధ్య యేడుతూర్లు తిరిగెను. కాని నీళ్లుండు చోటు కనఁ బడలేదు. ఇస్మాయీలుగారు దాహబాధచే నేడ్చుచు నేలపై తమ పాదములను కొట్టుచుండిరి. దేవుని మహిమచే నచట నీళ్లయూట పుట్టెను. దానిగూర్చి దేవుని దూత బీబీ హాజరాగారికిఁ దెలుపగా ఆమె వచ్చి నీళ్లు ఇంకిపోవునేమో అను భీతిచే చుట్టు కట్టకట్టి నీళ్లను నిలిపికొనియెను. దానినే జమ్ జమ్ బావి అనుగురు. ఆ విషయమును గూర్చి ఆదికాం డము 21-వ అధ్యాయము 15-21 వాక్యములలోనిట్లున్నది. "ఆతిత్తినీళ్లు అయిపోయిన తరువాత ఆమె ఒకపొదకింద ఆచిన్న వాని (ఇస్మాయీలును) పడవేసి ఈపిల్లవాని చావు నేను చూడలేను అని యనుకొని వింటివేత దూరముగ వెళ్లి అతని కెదురుగా కూర్చుండెను. అట్లెదురుగా కూర్చుండి యెలుగెత్తి యేడ్చెను. దేవుఁడు ఆ చిన్నవాని మొఱను వినినపుడు దేవుని దూత ఆకాశమునుండి హాగరును పిలిచి హాగరూ భయపడ కుము. ఆ చిన్నవాడున్న చోట దేవుడు వాని స్వరము విని యున్నాడు. నీవు లేచి ఆ చిన్నవాని లేవనెత్తి నీచేత పట్టు కొనుము. వాని వంశము ప్రసిద్ధ వంశముగా చేసెదనని ఆమె తో ననెను. మఱియు దేవుడు ఆమె కన్నులు తెఱచినందున ఆమె నీళ్ల ఊటనుచూచి వెళ్లి ఆతిత్తిని నీళ్లతో నింపి చిన్నవానికి త్రాగనిచ్చెను. దేవుఁడు ఆ చిన్నవానికి తోడై యుండెను.

అతడు పెరిగి పెద్దవాడై ఆ యరణ్యము (అరేబియా) లో
కాపురముండి విలుకాడాయెను. అతడు పారాను (మక్కా-
పురములోని కొండలపేరు) అరణ్యములో నుండెను."

బీబీ హాజరాగారును ఇస్మాయీలుగారును ఆ నీళ్లతో
జీవనము గడుపుకొనుచుండిరి. జుర్హాము వంశమువారు అచట
నీళ్లవసతిని చూచి కాపురముండసాగిరి. ఇస్మాయీలుగారు
పెద్దవారైన పిదప జుర్హాము సర్దారు కుమార్తెను వివాహ
మాడిరి. హజ్రత్ ఇబ్రాహీముగారు బీబీ సారాగారి యనుజ్ఞ
పడసి యప్పుడప్పుడు తమ జ్యేష్ఠకుమారుని బీబీ హాజరాగారిని
చూచుటకు వచ్చుచుండిరి.

దేవుడు హజ్రత్ ఇబ్రాహీము గారిని పరిశోధించు
టకై వారి ముద్దుల కుమారుడైన ఇస్మాయీలును దేవుని
ప్రీతి కొఱకు ఖుర్బానీ (అర్పణము) చేయుమని స్వప్నమూల
మున సెల విచ్చెను. అట్లు వారు తమకు నొక్కడై యున్న
ముద్దుల కుమారుని మోరియా (మర్వా మక్కా-పురమునందు
కాబా మసీదు చేరువనుండు కొండపేరు) అను ప్రదేశమున
దేవునికొఱకు ఖుర్బానీ (అర్పణము) చేయుటకై సిద్ధమైరి. దేవు
నికి విధేయుడై యున్న యిస్మాయీలు కూడ దానికి మహా
సంతోషముతో సమ్మతించి సిద్ధమాయెను. అట్లు తండ్రి తనకు
నొక్కడై యున్న ముద్దుల కుమారుని దేవుని కొఱకు ఖుర్బానీ
చేయుటకై పరుండబెట్టి సిద్ధము కాగానే దేవుడు "ఓయిబ్రా
హీము! నీవు స్వప్నమును సత్యపఱచితివి." అని వారిద్దఱి భక్తికి
మెచ్చి వారి ననుగ్రహించెను. హజ్రత్ ఇస్మాయీలు

గారికి జబీహుల్లా (దేవునికొఱకు కర్పింపఁబడినవాఁడు) అను బిరుదు గలిగెను. వారికి బదులుగ నొక పొట్టేలును దేవుని కొఱకు ఖుర్బానీ చేయఁబడెను. ఆ యాచారము ఇస్మాయిలు గారి సంతతివారనుసరించు చుండిరి. ఇప్పటికిఁ గూడ ముసల్మానులు అట్లు ఖుర్బానీ ప్రతి సంవత్సరము చేయుదురు.

దాని గూర్చి యాదికాండము 22 వ అధ్యాయములో నిట్లున్నది.

10. "అబ్రహాము తన కుమారుని వధించుటకు తన చెయ్యిచాపి కత్తి పట్టుకొనగా యెహోవాదూత పరలోకము నుండి అబ్రహామూ, అబ్రహామూ అని యతని పిలిచెను.

అందుల కతడు చిత్తము ప్రభువా! అనెను. అపుడాయన ఆచిన్నవానిమీద చెయ్యి వేయకుము. అతనినేమియు చేయకుము. నీకు ఒక్కడైయున్న నీ కుమారుని నాకీయ వెనుదీయ లేదుగనుక నీవు దేవునికి భయపడువాడవని యిందువలన నాకు తెలియుచున్న దనెను.

15. యెహోవాదూత రెండవమారు పరలోకము నుండి అబ్రహామును పిలిచి యిట్లనెను. నీవు నీకు ఒక్కడే అయియున్న నీ కుమారుని ఇయ్య వెనుకదీయక యీ కార్యము (ఖుర్బానీ) చేసినందున నేను నిన్నాశీర్వదించి ఆకాశ నక్షత్రములవలెను సముద్ర తీరమందలి యిసుకవలెను నీ సంతానమును నిశ్చయముగా విస్తరింప చేసెదను. నీ సంతతివారు తమ శత్రువుల గవనినిస్వాధీన పఱచుకొందురు. మఱియు నీవు నామాట వినినందున భూలోకములోని జనము నీ సంతానము వలన ఆశీర్వదింపబడును. నాతోడు! అని ప్రమాణముచేసి

యున్నానని యెహోవా (దేవుఁడు) సెలవిచ్చెను".

పై వాక్యములను బట్టిచూచిన దేవుఁడు హాజ్రత్ ఇబ్రాహీము గారికినుండు ఒక్క కుమారుని తనకొఱకు ఖుర్బానీ (అర్పణము) చేయుటకై సెలవిచ్చినట్లు నిశ్చయ మగుచున్నది. హాజ్రత్ ఇబ్రాహీము గారికి మొట్ట మొదట పుట్టిన కుమారుఁడు ఇస్మాయీలు. ఇస్మాయీలు పుట్టిన 14 యేండ్ల పిదప ఇస్సాకు (ఇస్హాఖు) పుట్టెను. కావున హాజ్రత్ ఇబ్రాహీము గారికి "ఒకడైయున్న కుమారుడు" ఇస్మాయిలు కాని ఇస్సాకు కాదు. అదియును గాక ఖుర్బానీ (అర్పణ) చేయఁబడిన స్థలము మోరియా (మర్వా) దేశమని ఆదికాండములో 22 వ అధ్యాయము 2 వ వాక్యములో చెప్పఁబడినది.

మర్వా మక్కా పురములోనుండు నొకకొండకుపేరు. కావున దేవునికొఱకు ఖుర్బానీ (అర్పణ) చేయఁబడిన వారు హాజ్రత్ ఇస్మాయీలు గారని నిశ్చయ మగుచున్నది.

అట్లు ఇస్మాయీలుగారు పెరిగి పెద్దవారైన పిదప దేవుని సెలవుచే ఇబ్రాహీము ప్రవక్తగారు వచ్చి ఇస్మాయీలు గారు నివసించుచున్న ప్రదేశమున దేవుని ప్రార్థన కొఱకు నొక మసీదు కట్టిరి. ఆ కట్టడములో ఇస్మాయీలుగారును తమ తండ్రిగారికి తోడుపడిరి. ఆ మసీదునకే కాబా మసీదు అని పేరు. వారిద్దఱి దివ్యహస్తములచే ఆమసీదు కట్టఁబడెను. కొంతకాలములోనే యచట నొక పురము ఏర్పడెను. అదియే మక్కాపురము.

హాజ్రత్ ఇస్మాయీలు గారికి పండ్రెండుమంది కుమారులుగలిగిరి. వారిసంతానము చాలవృద్ధిపొందెను. అందుచేవారి

సంతానమువారు అరేబియాదేశమును విభజించుకొని నివ
సించసాగిరి. హజ్రత్ ఇస్మాయీలుగారి పండ్రెండుగురు కుమా
రులలో రెండవ కుమారుఁడగు కెదారు (ఖైదారు) అను
నతఁడు మక్కాపురములోనే నివసించుచు చాల ప్రసిద్ధి
కెక్కెను. కెదారు సంతతిలో కొన్ని తరములపిదప "అద్నాను"
అను నతఁడు పుట్టెను. అద్నాను తన వంశములో చాల ప్రసి
ద్ధికెక్కినవాఁడు. అతని తమ్ముఁడగు "అక్" అను నతఁడు యె
మను దేశములో రాజ్యము స్థాపించెను. అద్నాను తరువాత
జుర్హాము వంశమువారు అద్నాను సంతతివారిని లోఁబఱచు
కొని వారిని మక్కాపురమునుండి తఱిమివేసిరి. కాని అద్నాను
సంతతిలోఁ బుట్టిన ఖుసై అను నతఁడు తిరిగి మక్కాపురమును
స్వాధీనపఱచుకొనెను. ఖుసై పిదప నతని కుమారుఁడగు అబ్దె
మనాఫు మక్కాపురమునకు సర్దారుగానుండెను. అతని తరువాత
అతని కుమారుఁడగు హాషిము మక్కాపురమునకు పెద్దగా
నుండెను. అతని తరువాత నతని కుమారుఁడగు అబ్దుల్ ముత్త
లబు మక్కాపురమునకు సర్దారుగానుండెను. అబ్దుల్ ముత్త
లబునకు పదుగురు కుమారులు. వారిలో అబ్దుల్లా అను వారి
పుత్రులే హజ్రత్ ముహమ్మద రసూలువారు.

"అద్నాను" నుండి హజ్రత్ ముహమ్మదు రసూలు
వారి వఱకు వంశావళి యిట్లున్నది.

"అదాను" నకు 'ముఅద్' అను పుత్రుఁడు పుట్టెను.
ముఅదునకు నిజారు అను కుమారుఁడు జన్మించెను. నిజారు
నకు ముజరు అను కొమరుఁడు గలిగెను. ముజరునకు ఇల్యాసు
అను పుత్రుఁడు జన్మించెను. ఇల్యాసు నకు ముద్రికా అను

కొడుకు పుట్టెను. ముద్రికా ఖుజైమా అను నతని కనెను. ఖుజైమాకు కినానా అను కుమారుఁడు గలిగెను. కినానాకు నజరు అనుపుత్రుఁడు జన్మించెను. నజరునకు మాలికు అను కొడుకు పుట్టెను. మాలికునకు ఫిహారు అను పుత్రుఁడు జన్మించెను. ఫిహారునకు గాలిబు అను కొమరుఁడు గలిగెను. గాలిబు "లువై" అను పుత్రునికనెను. లువై కాబు అనుపుత్రుని గాంచెను. కాబునకు ముర్రా అను కొడుకు జన్మించెను. ముర్రాకు కిలాబు అను కుమారుఁడు పుట్టెను. కిలాబునకు ఖుసై అను పుత్రుఁడు గలిగెను. ఖుసై అబ్దెమనాఫు అను పుత్రుని కనెను. అబ్దెమనాఫునకు హాషీము అను పుత్రుఁడు పుట్టెను. హాషీమునకు అబ్దుల్ ముత్తలబు అను కొమరుఁడు జన్మించెను. అబ్దుల్ ముత్తలబునకు అబ్దుల్లా అను పుత్రుఁడు గలిగెను. అబ్దుల్లాగారికి బీబీ ఆమినాయందు మహమ్మదువారు పుట్టిరి.

—: అబ్దుల్లాగారు ఖుర్బానీనుండి రక్షింపఁబడుట :—

అబ్దుల్ ముత్తలబు "దేవుఁడు తనకు పదుగురు కుమారులనొసగివారందఱి యౌవనము చూచునంతటి భాగ్యములభింపఁజేసినచో నొక కుమారుని దేవుని కొఱకు ఖుర్బానీ (అర్పణము) చేయుదు"నని మొక్కుబడి చేసికొని యుండెను. దేవుఁడట్లె యతని ప్రార్థన పూర్తిచేసెను. అతనికి పదుగురు కుమారులు గలిగి యందఱును యౌవనులైరి. అపుడతఁడు తన మొక్కుబడి చెల్లించుటకై తన పదుగురు కుమారులను దీసికొని కాబా మసీదునకు వచ్చి వారి పేర్లతో ఖురా (చీటి) వేసెను. అపుడు దైవ విధిగా అబ్దుల్లాగారి పేరు వచ్చెను. అబ్దుల్లాగారిని ఖుర్బానీ చేయుటకై అబ్దుల్ ముత్తలబు తీసి

కొని పోవుచుండఁగా అబ్దుల్లాగారి చెల్లెండ్రు ఏడ్వసాగిరి. అబ్దుల్లాకు బదులుగ పది ఒంటెలను ఖుర్బానీ చేయుము అని తండ్రితో విన్నవించిరి. దానికి సమ్మతించి అబ్దుల్ ముత్తలబు తిరిగి కాబా మసీదునకువచ్చి అబ్దుల్లాకు బదులుగ 10 ఒంటెలను ఖుర్బానీ చేయుదునని నిశ్చయించి ఖురా (చీటి) వేయగా తిరిగి అబ్దుల్లాపేరు వచ్చెను. మరల అబ్దుల్లాకు బదులుగ 20 యొంటెలను ఖుర్బానీ చేయుదునని ఖురా వేయగా తిరిగి అబ్దుల్లాపేరే వచ్చెను. అట్లే ఒంటెల సంఖ్య హెచ్చించుచు వంద యొంటెలవఱకు ఖురా వేసెను. వంద యొంటెల ఖురా వేసినపుడు అబ్దుల్లాకు బదులుగ వంద యొంటెల ఖుర్బానీ చేయవచ్చును. అని ఖురాలో ఏర్పడెను. అపుడు అబ్దుల్ ముత్తలబు తన కుమారునికి బదులుగ వంద యొంటెలను ఖుర్బానీ చేసెను. అట్లు అబ్దుల్లాగారు ఖుర్బానీనుండి రక్షింపఁబడిరి.

—: అబ్దుల్లాగారి వివాహము :—

అబ్దుల్ ముత్తలబుగారు అబ్దుల్లాగారికి వివాహము చేయఁదలఁచి బీబీ ఆమినాగారి తండ్రియగు వహాబునొద్దకు పోయి పెండ్లి విషయము మాటలాడిరి. అతఁడు సమ్మతించి బీబీ ఆమినాగారిని అబ్దుల్లాగారికిచ్చి వివాహము సలిపెను. బీబీ ఆమినా బాల్యమునుండియు గుణవతియని వన్నెకెక్కిన యామె. వివాహమైన సంవత్సరము భార్యాభర్తలు సుఖముగానుండిరి. తరువాత దేవుని యనుగ్రహమువలన అబ్దుల్లాగారికి బీబీ ఆమినాయందు పుత్రుఁడు పుట్టెను. ఆబిడ్డయే ముహమ్మదు రసూలువారు.

ముహమ్మదువారు పుట్టిన సంవత్సరమును ఆమ్ముల్ ఫీల్ * అనుదురు. పైగంబరులవారి జన్మ దినమునకు నలువదియైదు దినములకు ముందు యమనుదేశముయొక్క రాజైన "అబ్రహా" కాబామసీదును నాశము చేయవలెనని యుద్దేశించి యేనుఁగుల సైన్యమును తీసికొని దాడి వెడలెను. ఆ రాజు క్రైస్తవుఁడు. కాబామసీదు నుద్దేశించి దూర దూర దేశములనుండి యాత్రికులు వచ్చుచుండిరి. ఆ యాత్రికులను కాబామసీదునుండి మరలించుటకుగాను యమనులో నొక గుడి కట్టించి ప్రజలందఱు దానిని దర్శించుటకు రావలెను అని అతఁడు ప్రకటించెను. కాని యెవరును దాని దర్శించుటకుఁ బోలేదు. ఆ యసూయచే నతఁడు గొప్ప సైన్యము తీసికొని దాడి వెడలివచ్చి మక్కాపురమును సమీపించెను. మక్కాపురవాసులు శత్రువులను మాఱ్కొనలేక పురమును వదలి దేవుఁడే తన మసీదును రక్షించుకొనునుగాక ! శత్రువులను నాశము చేయునుగాక ! అని తలఁచి విడిచిపోయిరి. దేవుని శక్తిచే చిన్న చిన్న పక్షులు చిన్న చిన్న రాళ్లను దెచ్చి యా యేనుఁగులపై వేయసాగెను. ఆ రాళ్లు తుపాకి గుండ్లకన్న ఎక్కువ పని చేసినవి. ఆ సైనికులు తత్క్షణమే నేలఁగూలి నాశనమైరి. దేవుని గృహము రక్షింపఁబడెను. అట్లు దేవుని శక్తిచే శత్రువులు నాశమొందినందున ఏదో యొక దేవుని మహిమ మక్కాపురములో గలుగఁగలదని ప్రజలు నిశ్చయించిరి. ఆ యద్భుతమైన విషయము సంభవించిన 45 దినముల తరువాత హజ్రత్ ముహమ్మదు రసూలువారు జన్మించిరి. ఆ విషయము ఖురాను షరీఫులో నున్నది. ( * ఏనుఁగుల సైనికులు వచ్చిన యేఁడు)

—: జననము :—

హాజ్రత్ ముహమ్మదు పైగంబరువారు సోమవారము 9 వ తారీకు రబీవుల్ అవ్వల్, (క్రీ. శ. 571 ఏప్రిల్ 20 వ తేది విక్రమాదిత్య శకము 628 జ్యేష్ఠశుద్ధ ప్రథమ) తెల్లవారునపుడు సూర్యోదయమునకు పూర్వము మక్కాపురమునందు పుట్టిరి.

—: తండ్రి మరణము :—

వారి తండ్రియగు అబ్దుల్లాగారు అపుడు వ్యాపారముకొఱకు సిరియా (షామ్) దేశమునకు వెడలియుండిరి. తిరిగి వచ్చునపుడు దారిలో నే వ్యాధిగ్రస్తులై తమయవ్వగారియూరగు మదీనాలో నిలిచిపోయిరి. దైవవిధి యెవ్వరెఱుఁగుదురు! తమకు పుట్టఁబోవు లోకోద్ధారకుఁడగు బాలకునిచూచి సంతోషించునట్టి భాగ్యము వారికి లభింపక పోయెను. వారు ఆవ్యాధితో నే మదీనాలో 24 సం॥ వయస్సులో నే చనిపోయిరి. వారు మరణించిన రెండు నెలలకు తరువాత పైగంబరులవారుజన్మించిరి.

—: ఆస్తి :—

5 ఒంటెలును కొన్ని గొఱ్ఱెలును సువైబాయను బానిసయు మాత్రము పైగంబరులవారికి తండ్రి విడిచినయాస్తి.

—: నామకరణము :—

తాతయగు అబ్దుల్ ముత్తలబ్ తనకు మనుమఁడు పుట్టిన వార్తవినినంతనే మహాసంతోషముతో నింటికివచ్చి యాబిడ్డను కాబామసీదునకు కొనిపోయి దేవుని ప్రార్థించి తిరిగి యింటికి తీసికొనివచ్చెను. ఏడు దినములైన తరువాత ఖురైషులంద

శిశికి విందుచేసి ముహమ్మదు (పొగడఁదగినవాఁడు) అను పేరు పెట్టెను. ఖురైషులు ఆ పేరు విని యాశ్చర్యముతో నేమి క్రొత్తపేరు పెట్టితిరి? అని అబ్దుల్ ముత్తలబు నడిగిరి. నాముద్దుల మనుమని ప్రపంచమంతయు స్తుతించునుగాక! యని యిట్టిపేరు పెట్టితినని యతఁడు బదులు చెప్పెను.

తల్లియగు బీబీ ఆమినా తనకు కలిగిన కుమారునిపేరు "అహామదు" అని పెట్టెను. ఈపేరుపెట్టునట్లు స్వప్నములో నొకదేవదూత యామెకు చెప్పెను.

—: దా ది :—

ఏడు దినములవఱకు ముహమ్మదువారు తమతల్లిపాలు త్రాగిరి. పిదప కొన్ని దినములు పినతండ్రియగు అబూలహాబ్ యొక్క బానిసయగు సువైబా పాలుత్రాగిరి. పిదప అరబ్బుల పురాతన పద్ధతి ప్రకారము ముహమ్మదువారికి పాలకై 'హలీమాసాదియా' యను దాది నియమింపఁబడెను. ఆదాది 'తాయెఫు' అను గ్రామనివాసిని. పల్లెటూళ్లలో బిడ్డల దేహారోగ్యము పెంపొందుననియే ముహమ్మదువారికికూడ పల్లెటూరిలో నుండు దాది నియమింపఁబడెను.

తండ్రిలేని బిడ్డగావున పెక్కుమంది దాదులు వచ్చిచూచి పాలు త్రాపించుటకు నొప్పుకొనక పోవుచుండిరి. హలీమాయొక్క సొంతబిడ్డయే పాలులేక ఏడ్చుచుండెను. కావున నామె నెవ్వరును దాదిగా నియమించుకొనకపోయిరి. ఇట్టిస్థితిలో దాది హలీమా తన భర్తతో ఆలోచించి యూరికి బిడ్డలేకుండ మరలిపోవుట మంచిదిగాదు, అని యాతండ్రిలేని బిడ్డనే తీసికొందుమని వచ్చి ముహమ్మదువారికి పాలిచ్చుటకై

యొప్పుకొనెను. దాది హాలీమా కుటుంబమువారు వానలేక కఱవువల్ల చాలబాధపడుచుండిరి. వారు సవారిచేయు ఒంటె యు గాడిదయు ఒక్క చిక్కి నడువలేకుండెను. పాపము! వారట్టి నిఱుపేదస్థితిలోనుండిరి. పైగంబరులవారి మహిమ వలన తనకును ఆమె కుమారునకును వలసినంతపాలు ఆమెకు కలిగెను. తిరిగి గ్రామమునకు పోవునపుడు వారి సవారి వేగము గా నడువసాగెను. ఆ శుభ చిహ్నములు చూచి దాది హాలీమా చాల సంతసించి గొప్ప యాదరముతోను చాల ప్రేమతోను ముహమ్మదువారిని పోషించుచుండెను. ఆఱు నెలల కొకతూరి దాది హాలీమా ముహమ్మదువారిని మక్కాపురమునకు తీసికొనివచ్చి తల్లిగారికిని బంధువులకును చూపి మరల తన యూరికిఁ దీసికొనిపోవుచుండెను. దాది హాలీమా రెండవయేఁట ముహమ్మదువారికి పాలు మఱపించి తల్లియొద్దకు తీసికొనివచ్చెను. పల్లెటూరిలో దేహారోగ్య ము చక్కగా నుండునని తలంచి బీబి ఆమినాగారు ముహమ్మదువారిని దాది హాలీమా వెంటనే పంపివేసిరి.

—: హృదయశుద్ధి :—

వారు నాలుగు సంవత్సరముల వయస్సువఱకు దాదిహాలీమా యూరిలోనేయుండిరి. ఆమధ్యనొక గొప్పవిషయము సంభ వించెను. అందుచే దాది హాలీమా భయపడి ముహమ్మదువారిని మక్కాపురమునకు తీసికొనివచ్చి తల్లిగారికి నొప్పగించుచు ఆవృత్తాంత మిట్లు విన్నవించెను. "నా కుమారుఁడును మీకొమారుడును మేఁకలను మేపుచుండిరి. మే మింటిలో నుంటిమి. నా కుమారుఁడు భయమునొంది మాయొద్దకు పరుగెత్తుకొనివచ్చి

ఖురైషు పోదరుని (ముహమ్మదువారిని) ఇద్దఱు మనుష్యులు బలవంతముగా వెల్లకిలపరుండఁబెట్టి కడుపుచీల్చినారు. అని చెప్పెను. మే మదివిని తొందఱపాటుతోఁబోయి చూచితిమి. మాకుమారుఁడు భయమునొంది నిలువఁబడియుండెను. శీఘ్రముగా కౌఁగిలించుకొని యేమివృత్తాంతమని యడిగితిమి. 'ఇద్దఱు తెల్లని వస్త్రములు ధరించినవారు వచ్చి 'ఆయన ఈతఁడేనా' అని ఒకఁడు అడిగెను. రెండవవాఁడు 'అవును' అని చెప్పెను. ఆయిద్దఱును నాయొద్దకువచ్చి నన్ను పరుండఁబెట్టి కడుపును చీల్చి యేదోయొక వస్తువును తీసివేసి మఱల యెప్పటివలె సరిచేసి పోయిరి' అని మాకుమారుఁడు పలికెను." ఆ యిద్దఱు దేవదూతలు. దేవునాజ్ఞచే వారట్లు ముహమ్మదువారి హృదయ శుద్ధిగావించిరి. అందుచే వారు పాపరహితులైరి. అప్పటి నుండి ముహమ్మదువారు తమ తల్లియొద్దనే ఆఱు సంవత్సరముల వయసునకు నుండిరి.

## —: తల్లిమరణము :—

ముహమ్మదువారు ఆఱవయేఁట తల్లితోఁగూడి మదీనా పట్టణమునకుఁబోయి యుండిరి. తిరిగి మదీనానుండి మక్కా-పురమునకు వచ్చునపుడు "అబవా" అను చోటునందు తల్లిగారగు 'బీబీ ఆమినా' గారు జబ్బుచే మరణించిరి. అట్లు పిన్నతనముననే ప్రేమతో పెంచుచున్న తల్లినికూడ ముహమ్మదువారు గోలుపోయిరి. తల్లిదండ్రులులేని బిడ్డను తాతగారగు అబ్దుల్ ముత్తలబును మేనత్తయగు 'ఉమ్మెఅయిమను'ను సంరక్షించుచుండిరి.

—: తాత మరణము :—

అట్లు ఒకటి రెండు సంవత్సరములు గడచెను. ముహమ్మదువారి యెనిమిదవ యేఁట తన్నుప్రేమతో పోషించుచున్న తాత అబ్దుల్ ముత్తలబు మృతినొందెను. అబ్దుల్ ముత్తలబు తన జీవితకాలములో మక్కాపురమునకు పెద్దగానుండెను. తాత చనిపోయినపిదప ముహమ్మదువారి పినతండ్రియగు 'అబూతాలిబు' వారిని సంరక్షించుచుండెను.

—: ముహమ్మదువారి బాల్యము :—

ముహమ్మదువారికి విద్య నేర్పుటయందు ఎవ్వరును శ్రద్ధ పుచ్చుకొనలేదు. అదియే దేవుని యిష్టము కాఁబోలు. కావున వారు చదువను వ్రాయను నేర్వకుండిరి. చదువను వ్రాయను తెలియనివారిని అరబీభాషలో 'ఉమ్మీ' యాందురు. అందుచే ముహమ్మదువారిని 'ఉమ్మీ' యనుదురు. ముహమ్మదువారు తమ బాల్యమునందు పిల్లలతోఁగూడి యాడి యెఱుంగరు. ఒకటి రెండు పర్యాయములు రాత్రులందు పుక్కిటికథలు వినుటకై పయనమై పోవుచుండగా మధ్యలో నొక వివాహము జరుగుచుండెను. దానిని చూచుటకు నిలిచి అచటనే దైవవిధిగా సూర్యోదయమువఱకు నిద్రపోయిరి. మక్కానివాసులు కాబానుసీదును మరమ్మతు చేయుచుండిరి. ఆ పనికి బాలురుకూడ రాళ్ల నెత్తుకొని వచ్చుచుండిరి. ముహమ్మదువారుకూడ రాళ్ల నెత్తుకొని వచ్చుచుండగా వారి భుజములు నొప్పియెత్తసాగెను. అదిచూచి వారి పినతండ్రి ముహమ్మదువారు కట్టుకొనియున్న లుంగీనిదీసి భుజముపై వేయగా దిగంబరుఁడనైతినని సిగ్గుచే సొమ్మసిల్లి

పడిపోయిరి. అప్పుడు వారి పినతండ్రి మొలబట్టను తిరిగి కట్టెను. పిదప ముహమ్మదువారు తెలివినొందిరి. అప్పుడుతప్ప మఱెప్పుడును వారు దిగంబరులై యుండి యెఱుగరు.

—: సిరియా ప్రయాణము. :—

అబూతాలిబు వ్యాపారము కొఱకు సిరియాదేశము నకు ప్రయాణమాయెను. ముహమ్మదువారును వారివెంట ప్రయాణమైరి. అప్పుడు వారికి పండ్రెండు సంవత్సరముల వయస్సు. వారు ప్రయాణమార్గమున బుస్రాయను గ్రామమున నిలిచిరి. అచట బుహైరా అను క్రైస్తవ విద్వాంసుడు ముహమ్మదు వారిని చూచెను. తౌరాతు ఇంజీలు (క్రొత్త ప్రాత నిబంధనలు) అనుగ్రంథములలో రాబోవుఆఖరుప్రవక్త ను గూర్చియుండిన గుర్తులు ముహమ్మదువారియందు కనిపెట్టి ఇతడేరాబోవు ప్రవక్తయనినిశ్చయించి అబూతాలిబుతో నిట్లు చెప్పెను. 'మీరీబాలకుని జాగ్రత్తగా కాపాడవలెను. ఈతని వలన లోకమునకు చాల మేలుకలుగవలసియున్నది.' అచ్చట నుండి మరలి ముహమ్మదువారు మక్కాపట్టణమునకు వచ్చిరి.

—: ముహమ్మదువారి వివాహము :—

మక్కాపట్టణమున గొప్పవంశస్థురాలును భాగ్యవంతు రాలును నగు ఒక వితంతువుండెను. ఆమెపేరు ఖదీజా. ఆమె తన డబ్బుచే వ్యాపారముచేయుచుండెను. అమె ముహమ్మ దువారి మంచినడవడినిగూర్చి విని తన డబ్బుతో వ్యాపారము చేయవలెననియు లాభములో భాగము ఇచ్చెదను అనియు ముహమ్మదువారికి తెలిపెను. ముహమ్మదువారుకూడ వ్యాపారము చేయవలెనని యాలోచించుచుండిరి. ఆమెమాట

కొన్నుకొని వ్యాపారము కొఱకు 25 సం॥ వయస్సులో సిరియా దేశమునకు వెడలిరి. వారివెంట ఖదీజాయొక్క బానిసయైన మైసరా యుండెను. ఆవ్యాపారములో వారికి గొప్పలాభము కలిగెను. వారు సిరియానుండి తిరిగి మక్కాపురమునకు వచ్చిరి. ఆ ప్రయాణములోగూడ నస్తూరా యను ఒక క్రైస్తవ విద్వాంసుడు ముహామ్మదువారిని చూచి గుర్తించి వీరే రాఁబోవు జగత్ ప్రవక్తయని నిశ్చయించె. మైసరా తన ప్రయాణములో కనిపెట్టిన ముహామ్మదువారి సుగుణములను మహిమలను ఖదీజాతో విన్నవించెను. ఆమె ముహామ్మదు వారి సుగుణములను సత్యప్రవర్తనమును గుర్తెఱింగి ఆయనను పెండ్లి చేసికొనుటకు నిశ్చయించెను. అపుడామెకు 40 సం॥ వయస్సుండెను. ఆమెను పెండ్లియాడ ననేక ధనవంతులు కోరిరి. కాని యామె దాని కొప్పుకొనలేదు. ముహామ్మదువారు ధనవంతులుకాకపోయినను వారియందున్న సుగుణములకు మెచ్చుకొని తానే స్వయముగా పెండ్లి సందేశము పంపెను. ముహామ్మదువారు తమ పినతండ్రియైన అబూతాలిబుతో నాలోచించి యా సందేశము నంగీకరించిరి. మహా వైభవముతో వివాహమాయెను. పెండ్లిసమయమున అబూతాలిబు పైగంబరులవారిని గూర్చియు వారి సుగుణముల గూర్చియు వారి గొప్ప తనమును గూర్చియు గొప్ప ఉపన్యాసమిచ్చెను.

—: శాంతి నెలకొల్పుట. :—

పెండ్లియైనపిదప ముహామ్మదువారు దేశక్షేమమునకై చాలపాటుపడుచుండిరి. దేశములో శాంతిలేక దోపిడులు హత్య

లుజరుగుటయు, మానములు పోవుటయు, బలవంతులు బలహీనులపై దౌర్జన్యము చేయుటయు వారుచూచి ప్రజలందఱిలో పెద్దగానున్న వారితో కలిసి దానినిగూర్చి చర్చించిరి. వారు చేసిన ప్రయత్నమునవలన ఒక సంఘమేర్పడెను. ఆ సంఘము లో 'బనూహాషిమ్' 'బనుల్ ముత్తలబ్,' 'బనూ అసద్,' 'బనూజహారా' 'బనూతమీామ్' అనువారు చేరిరి. దేశమున నుండిన యూందోళమును తొలగించగొట్టుదుమనియు ప్రయాణికులకు నెమ్మది కలిగింతుమనియు నిఱుపేదలకు తోడుపడుదుమనియు బలహీనులపై దౌర్జన్యము చేయువారిని అడ్డగింతుమనియు ఆసంఘములోని ప్రతి సభ్యుఁడు శపథముచేసెను. ఆ సంఘమువలన మానవకోటికి చాల మేలుకలిగెను. అట్టి ప్రజాసేవ చేయుచుండినందువలననే ప్రజలందఱును ఏకగ్రీవముగా గొప్ప యాదరముతో ముహమ్మదువారిని పేరుతో పిలువక అమీన్ (అమానత్ దారుఁడు) అనియు సాదిఖ్ (సత్యవాది) యనియు బిరుదు పేరులతో పిల్చుచుండిరి.

—: కాబామసీదు పునర్నిర్మాణము :—

ముహమ్మదువారు 35 వ యేఁట ఒక గొప్ప తీర్మానముచేసి ప్రజలలో యుద్ధముకాకుండ చేసిరి. అదియేమన కాబామసీదుయొక్క గోడలు నీటి ప్రవాహము వలన శిథిలములయియుండెను. కావున మక్కాపుర నివాసులు దానిని తిరిగి కట్టించి 'హజరె అస్వదు' అను ఱాతిని కాబా గోడలో పెట్టుసమయమున ఎవరు పెట్టుట యని వారిలో వారికి కలతలు పుట్టెను. ప్రతివాఁడును నేను పెట్టుదును నేను పెట్టుదునని కలహింపసాగెను. తుదకు జగడము పెరిగి నాలుగు

దినములవఱకు ముగియకపోయెను. అపుడు వారిలో 'అబూ ఉమయ్యా' అను వృద్ధుఁడు "అందఱుచేరి యొకనిని పెద్దగాఁజేసి అతనిమాటప్రకారము చేయుదము" అని యాలోచన చెప్పెను. అటులే రేపు ఎవ్వరు ముందుగా ప్రాతఃకాలమున కాబా మసీదులో ప్రవేశించునో అతని మాటప్రకారము చేయుదమని వారంగీకరించిరి. దైవవిధిచే అందఱికంటె ముందుగా ముహమ్మదువారు కాబాలో ప్రవేశించి యుండిరి. అందఱును వారిని చూచి చాల సంతసించి పెద్దగా నొప్పుకొనిరి. అంత ముహమ్మదువారు తమ దుప్పటిపఱచి యాఱాతిని తమ చేతులార దానిలోనుంచి ప్రతిశాఖలో నుండు పెద్దను పిలిచి దుప్పటి యంచులను పట్టి యెత్తుఁడీ యని పలికిరి. అప్పుడు అందఱును అటులే ఱాయి పెట్టు స్థలమువఱకు దుప్పటినెత్తి తెచ్చిరి. ముహమ్మదువారు తమ చేతులార నాఱాతిని ఆ స్థలములో ప్రతిష్ఠించిరి. అందుచే నందఱు సంతసించిరి. జగడములు తగ్గెను. అట్టి మహాత్ములు లేనిచో చిన్నచిన్న విషయములను బట్టి ఘోరయుద్ధములుచేయు అరబ్బులు ఇట్టి సమయములందు శాంతితో నుందురా!

—: జైదును సంరక్షించుట :—

ఆ తీర్మానమైన కొన్నిదినములకు పిదప జనులకు మార్గదర్శకమగునట్టి మఱియొక గొప్ప కార్యముచేసిరి. హారిసు కుమారుఁడగు జైదు ఏదో యొక యుద్ధములో పట్టువడెను. అతని విరోధులు అతనిని బీబీ ఖదీజాయొక్క అన్నకుమారునికి అమ్మివేసిరి. అతఁడు జైదు ను తన మేనత్తకు బహుమానముగా నొసంగెను. ముహమ్మదువారు జైదు

యొక్క బానిసస్థితినిచూచి కనికరించి బీబీ ఖదీజానుండి యతని పుచ్చుకొని విడుదలచేసిరి. కొన్నిదినములపిదప జైదు యొక్క తండ్రి తన కుమారుని విషయము తెలిసికొని కొన్నిరూపాయలు తీసికొని విడిపించుకొని పోవుటకు ముహమ్మదువారి సముఖమునకు వచ్చెను. అప్పుడు "మీకుమారుఁడు స్వేచ్ఛాపరుఁడుగా నున్నాఁడు. మీరు డబ్బియ్య నక్కఱలేదు. పిలుచుకొని పోవచ్చును." అని ముహమ్మదువారు పలికిరి. కాని జైదు ముహమ్మదువారి ప్రేమను వారి సంరక్షణనుచూచి తండ్రివెంటఁబోవుట కిష్టపడక ముహమ్మదువారి యొద్దనే యుండెను. ముహమ్మదు రసూలువారు జైదును దత్తుకుమారునిగాఁ జేసికొనిరి. అందుచే ప్రజలందఱును జైదును (ముహమ్మదువారి కుమారుఁడు) జైదుబిన్ ముహమ్మదు అని పిలుచుచుండిరి. తుదకు ముహమ్మదువారు తమ మేనత్తకుమార్తె యగు బీబీ జైనబునిచ్చి యతనికి పెండ్లిచేయించిరి.

### —: ప్రవక్తపదవి లభించుట. :—

ముహమ్మదువారు నలువదిసంవత్సరముల వయస్సు రాకమునుపే యేకాంతవాస ప్రియులై కొన్నిమైళ్ళదూరములోనున్న హిరాయను కొండగుహలో రాత్రింబవ లుండసాగిరి. అచ్చటికి రెండు మూఁడు దినముల ఆహారము తీసికొని పోవుచుండిరి. అచ్చట వారు ప్రపంచ సృష్టినిగూర్చి విచారించుచు సృష్టికర్తనుగూర్చి విచారించు చుండిరి. దేశములోనున్న దురాచారములను చూచి వారి మనస్సు చాల కష్టపడుచుండెను. అట్లు విచారించుచున్న కాలమున వారు సత్యస్వప్నములు కాంచుచుండిరి. తేజస్సులు కనఁబడుచుండెను. వారు ఏ స్వప్న

మును కాంచుచుండికో యదే మఱుసటిదినము సంభవించు చుండెను. అట్లు హిరా గుహాలో ఏకాంతవాసమున దేవుని ధ్యానించుచు నలువది సంవత్సరముల వయస్సు పూర్తియగు నప్పటికి ఒకదినము దేవుని దూతయగు జిబ్రయీలు దేవుని సందేశము (వహీ) ముహమ్మదు వారియొద్దకు తీసికొనివచ్చి 'ఓ ముహమ్మదు! సంతసించుము. దేవుఁడు నిన్ను ప్రవక్తగా నియమించినాఁడు. నేను దేవునిదూతను. అతఁడు నన్ను నీ యొద్దకు పంపినాఁడు, అని చెప్పి చదువుము' అని పలికెను. అప్పుడు ముహమ్మదువారు 'నేను చదివినవాఁడను కాను' అని పలికిరి. అప్పుడు దూత వారిని తన ఱొమ్ముతో నదిమికొని విడిచి చదువుమని పలికెను. 'నేను చదువలేను' అని ముహమ్మదువారు చెప్పిరి. మఱల దూత వారిని తన ఱొమ్ముతో నదిమికొని చదువుమని చెప్పెను. 'నేను చదివినవాఁడనుకాను' అని ముహమ్మదు రసూలువారు చెప్పిరి. మూఁడవతూరి ఱొమ్ముతో నదిమి "ఇఖ్రా, బిస్మి, అబ్బి, కల్లజీ, ఖలఖ, ఖలఖల్, ఇన్సాన మిన్, అలఖ్. ఇఖ్రా, వఱబ్బుకల్, అక్ర ముల్లజీ, అల్లమ బిల్ ఖలమ్. అల్లమల్ ఇన్సాన, మాలమ్ యాలమ్ (సృష్టించిన ప్రభువునామముతో చదువుము. అతఁడు మానవుని చిక్కని నెత్తురుతో సృజించెను. కలముద్వారా (వ్రాతమూలకముగ) నేర్పిన పరమదాతయగు ప్రభువు నామముతో చదువుము. అతఁడు తెలియనిదానిని మానవునకు నేర్పించెను) అని చదువుమని చెప్పిపోయెను. దైవసందేశము (వహీ) వినినపిదప ముహమ్మదువారు భయమునొంది తొంద

ఆపాటుతో నింటికివచ్చి దుప్పటికప్పుకొని శాంతించినపిదప జరిగిన వృత్తాంతమంతయు భార్యయగు బీబీఖదీజాకు తెలిపిరి. బీబిఖదీజా యావృత్తాంతమువిని "మీరు భయపడనక్కఱలేదు. మీకు దేవుడు దుఃఖము నొసంగడు. ఎందుకనగా మీరు నిరుపేదలకు, తండ్రిలేని బిడ్డలకు, ఆధారములేని వితంతువులకు తోడుపడుచున్నారు. మీ రెల్లప్పుడు సత్యమే పలుకుదురు. అతిథులకు ఆతిథ్యము చేయుచున్నారు. సర్వ సుగుణములు మీయందున్నవి. కావున మిమ్ము దేవుడు దుఃఖపెట్టడు. మీరు దేవుని ప్రవక్తలని నేను విశ్వసించుచున్నాను." అని ముహమ్మదువారిని శాంతపఱచెను. మఱియు బీబి ఖదీజా తన పిన తండ్రి కుమారుడైన వర్ఖాబిన్ నౌఫిల్ యొద్దకు ముహమ్మదువారిని తీసికొనిపోయెను. వర్ఖా పూర్వగ్రంథముల విషయము నెఱింగినవాడు. ముహమ్మదువారి వృత్తాంతము విని యాక్షణమే యతడిట్లు చెప్పసాగెను. "ఆదూత జిబ్రయీలు. పూర్వము మూస (మోషె) ప్రవక్తవారి యొద్దకు వచ్చుచుండెడివాడు. మిమ్ము మీకులస్థులు పట్టణమునుండి తఱిమి వేయుదురు. ఆవేళవఱకు నేను బ్రతికియుండిన మీకు తోడుపడుదును" అదివిని "ఏమి నాకులమువారు నన్ను వెడలఁగొట్టుదురా!" అని ముహమ్మదువారు అడిగిరి. "అవును పూర్వమునుండియే యిట్లు జరుగుచు వచ్చెను. ధర్మప్రచారకులైన ప్రవక్తలతో జనులు విరోధించుచుందురు. మీరు మక్కాపట్టణము విడిచిపోవునప్పుడు నేను బ్రతికియున్నచో మీసేవ చేయుదును." అని వర్ఖా ముహమ్మదువారితో చెప్పెను. కాని

యతఁడు దానికి పిదప కొద్దికాలములోనే మృతినొందెను.

—: ఇస్లాము మత ప్రచారము చేయుట :—

పైగంబరువారికి హిరాగుహాలో ప్రవక్తపదవి లభించిన పిదప మూఁడు సంవత్సరములవఱకు దైవసందేశము (వహీ) రాలేదు. ఆమధ్య దేవుని సందేశమును సహించునట్టి బలిమి పైగంబరువారి మనస్సున కలిగెను. ప్రవక్తపదవి లభించిన మూఁడవయేట ఒక దినము ముహమ్మదువారు పురమునకు బయట మైదానములో పోవుచుండఁగా "ఓముహమ్మదు! ఓముహమ్మదు!" అను పిలుపు వినఁబడెను. వారు తలనెత్తి ఆకాశమువైపుచూడఁగా హిరాగుహాలో ప్రత్యక్షమైన జిబ్రీలు దూత కనఁబడెను. అతని దర్శించి భయమునొంది తొందఱపాటుతో వారింటికివచ్చి దుప్పటికప్పుకొని పరుండిరి. అపుడు దైవదూతయగు జిబ్రీలు దైవసందేశమిట్లు వినిపించెను. "ఓ దుప్పటి కప్పుకొన్నవాఁడా లెమ్ము. ప్రజలకు పాపభీతిని కలిగింపుము. నీవు ప్రభువు మహిమనుగొనియాడుము. పరిశుద్ధుఁడవుగమ్ము. అపవిత్రతను విడనాడుము. లాభముకోరి ప్రజలకు మేలుచేయకుము. మఱియు నీ ప్రభువు కొఱకు ఓర్పు వహింపుము." ఆదైవ సందేశము వచ్చిన పిదప పైగంబరులవారు ఇస్లాము మతప్రచారము చేయసాగిరి. ముందు ముందు రహస్యముగా ప్రచారము చేయుచుండిరి. పిదప బహిరంగముగా ఇస్లాము బోధచేయుచు "సృష్టికర్తయగు దేవునివిడిచి జనులు కల్పించిన విగ్రహములను సూర్యచంద్రులను, నక్షత్రములను చెట్టుచేమలను పూజింపకూడదు. అధర్మములను విడనాడవలెను." అని బోధ చేయసాగిరి.

మొట్టమొదట స్త్రీలలో బీబీఖదీజాయును పురుషులలో 'అబూబకరును' బాలురలో 'అలీ'యును ఇస్లాము మతము నవలంబించిరి. బీబీఖదీజా ఇస్లాము అవలంబించిన పిదప స్త్రీలలో 'ఉమ్మల్ ఫజల్' (అబ్బాసుయొక్క భార్య) అస్మాబిన్త ఉమైస్, అస్మాబిన్త అబూబకర్, ఫాతిమా (ఉమర్ యొక్క చెల్లెలు) అనువారు ఇస్లామును స్వీకరించిరి. హజరత్ అబూబకర్ వ్యాపారము చేయువారు. మక్కా పట్టణములో వారి గుడ్డల దుకాణము ఉండెను. వారియొద్దకు జనులు ఎక్కువగా వచ్చుచుండిరి. వారుకూడ మతప్రచారము చేయుచుండిరి. వారిప్రచారమువలన 'ఉస్మానుగని', 'జుబైరు', 'అబ్దుర్రహమాన్ బిన్ ఔఫ్', 'తలహా', 'సాదిబిన్ అబీవఖాస్' 'అబూఉబైదా', 'అబ్దుల్ అసద్', 'ఉస్మాన్ బిన్ మజ్ఊన్', ఆమిరుబిన్ఫుహైరా, అబూహుజైఫా మొదలైనవారు ఇస్లాము మతము నవలంబించిరి.

ఒకదినము జిబ్రయీలుదూత వచ్చి వజూచేయు పద్ధతిని ముహమ్మదువారికి నేర్పి నమాజుచేయించెను. ముహమ్మదు రసూలువారును వారిశిష్యులును రహస్యముగా నమాజు (ప్రార్థన) చేయుచుండిరి. కొందఱు దుష్టులు ధర్మప్రచారమునకు విరోధులై ముహమ్మదువారికిని వారి శిష్యులకును పెక్కుకష్టములు కల్పింపసాగిరి. ఆ విరోధులలో ముఖ్యముగా 'అబూలహబ్' 'అబూజెహల్' మఱియు వారిద్దఱితోఁ గలిసిన వారు కొందఱు.

—: లోకస్థితి :—

ముహమ్మదు రసూలు వారికి ప్రవక్తపదవి లభించిన

కాలములో లోకములోని స్థితిగతులెట్లుండెనో విచారించవలెను. మఱియు ముహమ్మదువారు తమ ప్రచారోద్యమమెట్లు సాధించిరో, మఱియు దానివలన వారికెట్టికష్టములు సంభవించినవో విచారింతము.

ముహమ్మదువారికి ప్రవక్తపదవి లభించినకాలమందు లోకమంతయు అజ్ఞానాంధకారములో మునిఁగియుండెను. క్రూరమును, మృగత్వమును, పశుత్వమును లోకమంతయు క్రమ్ముకొని యుండెను. మనుష్యత్వమును, పరిశుద్ధత్వమును, ధర్మములును, గ్రంథములలో మాత్రముండెను. మానవులలో నవి శూన్యమైయుండెను. యూదులు ఏసుక్రీస్తునకు పూర్వమే మత భ్రష్టులై పాములు పాములపిల్లలు అనుబిరుదులకు అర్హులైయుండిరి. ఏసుక్రీస్తు యూదులకిచ్చిన శాపముచే వారు పేరునకుమాత్రము మనుష్యులైయుండిరి. ఇరుగు పొరుగుననుండువారి స్నేహముచే విగ్రహారాధనము చేయుచుండిరి.

యూరోపుదేశములో మూఢత్వము అతిశయించి యుండెను. ఇంగ్లండులో బ్రిటన్ సాక్సన్ అను అనాగరిక జనులుండిరి. నార్తంబర్లాండు మొదలైన ఆంగ్లేయ జిల్లాలలో నుండువారు వర్జిను అనువిగ్రహమును ఆరాధించుచుండిరి.

ఫ్రాన్సుదేశములోకూడ అనేక దురాచారములు చెలరేఁగియుండెను. ఫ్రాన్సు సాక్సన్ అనువారిలో నెల్లప్పుడు యుద్ధములు జరుగుచుండెను. ఆయుద్ధము క్రీ॥శ 782 వఱకు జరుగుచుండెను. అప్పుడు ఫ్రాన్సు 4500 సాక్సన్ ఖైదీలను చాలక్రూరముతో వర్దూను పట్టణములో హింసించి చంపెను.

ఆకాలమున ఈజిప్టు దేశములో క్రైస్తవమతము ప్రబలియుండెను. క్రైస్తవులు యేసుక్రీస్తు విషయమై పలువిధములుగా నమ్మకముంచి వారిలోనే పలు తెగలై పోయి ఒకరి నొకరు హింసించుకొనుచుండిరి. కొందఱు క్రీస్తుయొక్క విగ్రహము చేసి పూజించుచుండిరి. మఱికొందఱు అతని దేవుని కుమారుడని విశ్వసించుచుండిరి.

ఆకాలమున అరేబియాదేశములో పలువిధములైన దురాచారములు ప్రబలియుండెను. దానికితోడు దేశము అరాజకముగా నుండెను. విగ్రహారాధన మెండు. కాబామసీదులో 360 విగ్రహములుండెను. మత్తు అరబ్బులకు ఉగ్గుపాలుతో వారుకయైనది. ఆడుబిడ్డలను కొందఱు ప్రాణముతోనే పూడ్చుచుండిరి. చిన్న చిన్న విషయములలో ఘోరయుద్ధములు జరుగుచుండెను. సృష్టికర్త లేడని తిరస్కరించు నాస్తికులుకూడ నుండిరి. కొందఱు క్రైస్తవ మతస్థులుండిరి. మూఢత్వము చాలనుండెను. పేరునకు మాత్రము మనుష్యులై యుండిరి. వారు కవిత్వమందు ఒకరినొకరు మించిపోవుటకు యత్నించుచుండిరి. పద్యములలో తమగొప్పతనము చెప్పుకొనుచు ఇతరులను దూషించుచుండిరి. వారిసాంఘికస్థితి చాలహీనముగా నుండెను. కావున దేవుని అనుగ్రహము కలిగి వారిని ఇతరదేశముల వారిని ఉద్ధరించుటకుగాను ముహమ్మదువారికి దేవుడు ఖురానుగ్రంథము నొసంగి ప్రవక్తగా పంపెను.

—: మతప్రచార మెట్లు చేసిరి. :—

ముహమ్మదురసూలువారు దేవునిఆజ్ఞప్రకారము అందఱికిని బోధించుచుండిరి. ఒకదినము ముహమ్మదువారు

తమబంధువులకు బోధింపవలెనని తలంచి విందుచేసిరి. నలువది మంది కూడిరి. కాని 'అబూలహబ్' ఆసభలో కావించిన గలబగలన ముహమ్మదువారు బోధింపలేకపోయిరి. అందుచే మఱునాటిరాత్రి మఱల విందుచేసి అందఱు భుజించినపిదప పైగంబరులవారు ఇట్లు బోధించిరి. "నేను మీకొఱకు ఇహపర లోకములలో మేలుకలుగునట్టి విషయము తెచ్చియున్నాను. ఎవ్వడును దీనికంటె మేలైనది తనబంధువులకొఱకు తేసికొని రాలేదు. మిమ్ము ప్రబోధించుటకై దేవుడు నాకు ఆజ్ఞనిచ్చి యున్నాడు. ఈ కార్యమందు మీలోనెవ్వడు నాకుతోడు పడును" అని ముహమ్మదు వారు అడిగిరి. అదివిని అచటనుండిన వారందఱును బదులుపలుకక ఊరకుండిరి. అప్పుడు హజ్రత్ అలీ లేచి "నేను మీకు తోడుపడుదును" అని పలికెను. వారు వయస్సులో చిన్నవారైనను అట్టి ధైర్యపుమాట పలికినందుకు అచట నున్నవారు పరిహసించి బాలుడు తోడుపడుట ఏమి? ఈ ప్రచారము నెఱవేఱుట ఏమి? అనిచెప్పుచు లేచిపోయిరి.

ఒకదినమున ముహమ్మదువారు 'సఫా' అనుకొండ తిప్పపై నిలిచి ప్రజలను పిలువసాగిరి. వారిపిలుపుచే అందఱు కూడిరి. అప్పుడు "మీరు నావిషయమై ఏమి చెప్పుకొందురు? నేను సత్యముచెప్పువాడనా? లేక అబద్ధములు పలుకువాడ నా? అనివారిని ప్రశ్నింపగా నందఱు ఏకగ్రీవముగా నీవు సత్యవాదివి అబద్ధముచెప్పవు అని నమ్ముచున్నాము అని బదు లిచ్చిరి. అపుడు ముహమ్మదువారు "వినుడు నేను కొండపై నిలిచియున్నాను. మీరు పల్లములో నిలిచియున్నారు. నేను కొండ అవతలను ఇవతలను చూచుచున్నాను. కొండ వెనుకటి

సైన్యమొకటి ఈకొండకు వెనుకనుండి మక్కాపై యుద్ధము చేయుటకై దూరమున నుండి వచ్చుచున్నది. అని నేను చెప్పిన మీరు నమ్మగలరా” అని ప్రశ్నించిరి. అప్పుడు వారు “నీమాట మేము నమ్మెదము. నీవు సత్యవాదివి. కావున తిరస్కరించుటకు కారణము అగపడదు. అదియునుగాక నీవు కొండపై నిలిచి యున్నావు. కావున కొండకవతలి రెండువైపులును నీకు కనబడుచున్నవి” అని బదులుచెప్పిరి. అప్పుడు ముహామ్మదు వారిట్లుచెప్పిరి “అది మీకు బోధించుటకై ఉదాహరణముగా గొంటిని. ఎల్లరొక దినము చావవలసియున్నది. అప్పుడు దేవుని సమ్ముఖమున నిలువవలసియున్నది. మీరు ఇహలోకమును చూచినట్లు నేను పరలోకమును కూడ చూచుచున్నాను. కావున ఇస్లామును స్వీకరించుడు” అదివిని పైగంబరువారి పినతండ్రియైన అబూలహబ్ ‘ఇందుకేనా పిలిచినది’ అని దూషింపసాగెను. దానినిబట్టి ముహామ్మదువారు ప్రతిసభలోను ప్రతివీథిలోను నలుగురు కూడియున్న చోటులందును నిర్భయముగా దేవుని ఏకత్వము (తౌహీదు) ను గూర్చి బోధించు చు విగ్రహారాధాన నిషేధించుచుండిరి. ఆడుబిడ్డలను చంపు వారిని అడ్డగించుచుండిరి. వ్యభిచారము చేయకూడదనియు జూదమాడకూడదనియు ప్రజలకు బోధించుచుండిరి. ప్రజలు త్రికరణశుద్ధికలిగి యుండవలెననియు ఆడినమాట తప్పరాదనియు వ్యాపారములలో మోసగింపరాదనియు బోధించుచుండిరి.

సూర్యచంద్రాదులను భూమ్యాకాశములను సర్వ జగత్తును దేవుడే సృష్టించెను. సమస్తము దేవునికి లోబడియున్నది. దేవుడు మనప్రార్థనలను వినుచున్నాడు. అతడే రోగులను

కాఁడు, దేవునియొద్ద వంశఘనత పనికిరాదు. ఎవ్వఁడు భక్తిలో శ్రేష్ఠుఁడో వాఁడే దేవునియొద్ద గొప్పవాఁడు. అను ఇస్లాముధర్మము ఖురైషులకు చాలకష్టముగా తోఁచెను. ఖురైషులకును హాసిమ్ (పైగంబరువారిముత్తాత) సంతతి వారికిని పూర్వమునుండి విరోధముండెను. అట్టివిరోధముచే పైగంబరువారి బోధనకు అంగీకరింపక విరోధులైరి.

ఖురైషులు విగ్రహారాధనమును గొప్పయాచారముగా తలఁచియుండిరి. దానిని విడనాడుట కిష్టపడక ముహమ్మదు వారికి విరోధులైరి.

ఖురైషులు వ్యభిచారము, జూదము, దోపుడు, ఖూనీ సంధిధర్మములను చెడఁగొట్టుట, మితములేకుండ స్త్రీలను ఇంటిలో నుంచుకొనుట మొదలైన దురాచారములకు లోఁబడి యుండిరి. అట్టి అధర్మములను తుదముట్ట విడనాడవలెనని ఇస్లాముబోధించును కాన ఖురైషులకు కంటకప్రాయముగా తోఁచి దానిని నాశనము చేయవలెనని పూని విరోధులైరి.

—:ఖురైషులు ముసల్మానులను హింసించుట.:—

ఖురైషులు ఇస్లామును నాశనము చేయవలెనని పలు విధములైన యత్నములు చేసిరి. మొట్టమొదట ఇస్లాము మతము స్వీకరించినవారు ఆమతము విడనాడవలెనని వారిని హింసించి అనేకకష్టములు పెట్టిరి. ఖురైషులు ముసల్మానులకు పెట్టిన కష్టములు వివరముగా వ్రాయవలెనన్న గ్రంథము పెరుగును. కావున సంగ్రహించి కొందటి విషయము మాత్రము వ్రాయుదుము.

బిలాల్ అబిసీనియాదేశస్థుఁడు. అతఁడు ఉమయ్యాబిన్

బిలాల్ యొక్క బానిస. ఇతఁడు ఇస్లాము మతమును స్వీకరించెను. ఈ విషయము అతని యజమానుఁడు (ఉమయ్యా) విని మతమును విడువుమని యతనితో చెప్పెను. కాని బిలాల్ అట్లుచేయ లేదు. అందుచేత వాఁడు బిలాల్ యొక్క మెడకు త్రాడుగట్టి బాలుర చేతికిచ్చెను. బాలురు అతనిని మక్కావీధులలోను కొండలలోను త్రాడుపట్టి లాగుచు త్రిప్పుచుండిరి. ఆ త్రాడు లాగు బవలన అతనికి చాల కష్టముగా నుండెను. బిలాలును కాలుచు న్న ఇసుకలో దుస్తులుతీసి పరుండబెట్టి అతని రొమ్ముపై కాలు చున్న బండను పెట్టి 'ఉమయ్యా' (యజమానుఁడు) హింసించు చుండెను. అతని కాళ్లు చేతులుకట్టి కఱ్ఱలతో కొట్టుచుండెను. మండుచున్న యెండలో కూర్చుండఁబెట్టుచుండెను. అతని యజ మానుఁడు అన్నముపెట్టక ఆఁకలిబాధ నిచ్చుచుండెను. కాని ఆభక్తుఁడు ఆకష్టములను సహించుచు అహద్ అహద్ (దేవుఁడు ఒక్కఁడే ఒక్కఁడే) అని పలుకుచుండెను. ఏమి యాభక్తుని స్థిరబుద్ధి! ఏమి యాదుష్టులకఠినత్వము! హజ్రత్ అబూబకరు కష్టములను చూచి కనికరించి బిలాలుని అతనియజమా నునినుండి విక్రయించుకొని దేవునికొఱకు విడుదలచేసెను. (బిలాలు గారిని పైగంబరులవారు చాల ప్రేమించుచుండిరి. వారు నమాజుకొఱకు (అజాఁ) పిలుపు నిచ్చుచుండిరి. పిదప వారు 63 సం॥ వయస్సులో 20 సం॥రం (హిజ్రి) దిమష్కు పట్టణములో మరణించిరి.)

'అమ్మారును' అతనితల్లిదండ్రులును ముసల్మాను లైరి. అదివిని అబూజెహల్ వారిని పలువిధములైన కష్టములు పెట్టసాగెను. ఒకదినము పైగంబరులవారు అమ్మారును

అతని తల్లిదండ్రులును పడుచున్న కష్టములు చూచి ఓర్పు కలిగియుండుఁడి. దేవుఁడు మీకు స్వర్గమొసఁగును. అనియూరడించిరి. దుర్మార్గుఁడైన అబూజెహాల్ అమ్మారుతల్లినిబల్లెముతో పొడిచి చంపెను. ఆభక్తులు అట్టిదుస్సహమైన విపరీత కష్టములను ఓర్చుకొనిరి. కాని ఇస్లాము విడనాడలేదు. దానికి కారణము ఇస్లామునందున్న ఆకర్షణమహిమయేగదా?

అబూఫకీముసల్మానుఁడాయెను. అతని కాళ్లకు త్రాడుకట్టి కాలినేలలో పడవేసి ఖురైషులు ఈడ్చుచు హింసించుచుండిరి.

'ఖబాబ్‌బిన్ ఇర్సు' అను ముసల్మాను భక్తుని తల వెంట్రుకలు పట్టి ఈడ్చుచు మెడపట్టి త్రిప్పుచు తపించుచున్న రాళ్లపై పరుండబెట్టుచు ఖురైషులు హింసించుచుండిరి.

'యుమైనా' 'జునైరా' 'నహాదియా' అనుబానిస స్త్రీలను ఖురైషులు కూడ పలువిధములైన ఘోరబాధలు పెట్టుచుండిరి. ఖురైషులు ముసల్మానులైన తమబానిసలను బీదలను మాత్రమే కష్టపెట్టక ముసల్మానులైనట్టి తమబంధువులను కూడ బాధించుచుండిరి.

'హజ్రత్ ఉస్మాన్‌గనీ ముసల్మానులైనారని విని వారిపినతండ్రి వారిని ఖర్జూరపుచాఁపలలో చుట్టి పొగబెట్టి బాధించుచుండెను.

'ముస్‌ఇబ్‌బిన్ ఉమైరు' ఇస్లాములో చేరిన విషయము అతని తల్లివిని యతనిని ఇంటినుండి వెడలఁగొట్టెను.

ఖురైషులు కొందఱు భక్తులను, ఆవు ఒంటెయొక్క

వచ్చి చర్మములో చుట్టి మండుచున్న యెండలో వైచు
చుండిరి. ఖురైషులు కొందఱికి ఇనుపకవచములు తొడిగించి
వారిని కాలుచున్న ఇసుకపై పడవేయుచుండిరి. ఖురైషులు
ముసల్మానుల కిడుచున్న కష్టములు సహించుటకు వారికి
ఇస్లాము మతమునందున్న మహిమయే తోడుపడు
చుండెను. లేనిచో అట్టికష్టములు సహించుటకు నెవరికి
సాధ్యము?

—: ఖురైషులు పైగంబరులవారికి పెట్టినకష్టములు :—

పైగంబరులవారు పోవుమార్గములందు రాత్రివేళ
ఖురైషులు ముండ్ల కంపలు పఱచుచుండిరి. రాత్రులలో
చీకటి కావున కాళ్లలో కంపలు గ్రుచ్చుకొని చాలబాధ
పైగంబరులవారికి గలుగుచుండెను. కంపుచే బాధకలుగు
టకై ఇంటితలుపులయొద్ద మురికి పడవేయుచుండిరి. దానికి
పైగంబరులవారు ఓర్చుకొనియుండిరి. ముండ్లకంపలు పఱచుట
యందు 'అబూలహబ్' యొక్క భార్య ఉమ్మెజమీలు చాల
ప్రయత్నించుచుండెను.

ఒకదినము పైగంబరులవారు కాబామసీదులో ప్రార్థన
(నమాజు) చేయుచుండిరి. 'ఉఖ్బాబిన్ అబీముయీతు' అను
దుష్టుండు వచ్చి తనదుప్పటిని త్రాడువలె పేని పైగంబరులవారు
సిజ్దా (సాష్టాంగనమస్కారము) చేయుచున్నప్పుడు వారిమెడకు
వేసి చుట్టసాగెను. పైగంబరులవారి మెడ నలిగి చాల బాధ
కలుగుచుండినను ప్రార్థనలోనే యుండిరి. అంతలో హజ్రత్
అబూబకరు వచ్చి యాదుష్టుని త్రోసివేసి యాదుప్పటిని
పైగంబరులవారి మెడనుండి తీసివేసిరి. అప్పుడు కొందఱు

దుష్టులు హాజరత్ అబూబకరును పట్టుకొని కొట్టి చాలబాధిం చిరి. ఆహా! ఏమి! పైగంబరులవారి ఓర్పు! ఏమి పైగంబరుల వారి శిష్యుల భక్తివిశ్వాసములు! ఏమి ఆదుష్టుల నీచత్వము! చదువరులే యోచింపవలెను.

మఱొకదినము పైగంబరులవారు కాబామసీదులో నమాజు చేయుచుండిరి. అచట ఖురైషులు కూడియుండిరి. అపుడు 'అబూజెహాల్' అను దుష్టుడు 'ఈదినము పురము లో ఒంటెను కోసియున్నారు. దానిప్రేగులు మొదలైన ము ఱికి తీసికొనివచ్చి యీతని (పైగంబరులవారి) వీపుపై పెట్టుం డని పలికెను. అంతలో 'ఉఖ్బా' అనుదుష్టుడు లేచిపో యి ప్రేగులు తీసికొనివచ్చి పైగంబరులవారు సిజ్దా చేయుచు న్నపుడు వీపుపై నుంచెను. పైగంబరులవారు దేవునిధ్యాన మందు నిమగ్నులై యుండిరి. అదివారికి తెలియకుండెను. అ దిచూచి దుష్టులు పరిహాసించుచుండిరి. అంతలో పైగంబరు ల వారికుమార్తె 'బీబీఫాతిమా' వచ్చి చాలదుఃఖించి వీపు మీదిప్రేగులను తీసివేసెను. అచటనుండిన దుష్టులను శపించెను. తుదకు ఆమెశాపము ప్రకారము బదరుయుద్ధములో ఆదుష్టులు నశించిరి.

ఖురైషులు పైగంబరులవారికిని వారిశిష్యులకును ఇంత వఱకుచేసిన కష్టములు చాలవని తలంచి మఱియు బాధపెట్టు టకై ఒకసంఘము ఏర్పఱచిరి. ఆసంఘమునకు పెద్ద (అధ్య క్షుడు) అబూలహబ్ అను దుష్టుడు. 25 మంది సర్దార్లు అందలి సభ్యులు. దూరదేశమునుండి మక్కాపురమునకు వచ్చువారు మహమ్మదువారి మాటవినకుండుటకై వచ్చినప్రజలతో సతని

గూర్చి యేమిపలుకవలె ననువిషయమును గూర్చి ఆసంఘము
లో చర్చింపఁబడెను. వారిలో ఒకఁడు ముహమ్మదు జ్యోతి
ష్కుఁడని చెప్పుదమని' పలికెను. అపుడు వారిలో వృద్ధుఁడైన
'వలీదుబిన్ ముగైరా' ఇట్లు చెప్పసాగెను. "జ్యోతిష్కుల
పసరుపుమాట లెక్కడ? ముహమ్మదు బోధించు మాట లెక్కడ?
అట్లు చెప్పినచో మనము అబద్ధము పలుకుచున్నామని అరబ్బు
లు తలంతురు. కావున అట్టిమాట చెప్పకూడదు."

మఱొకఁడు "ముహమ్మదు పిచ్చివాఁడు. అతని మాట
లు వినకూడదని చెప్పుదమని వచించెను. అప్పుడు "ముహమ్మ
దు మాటలకును పిచ్చికిని ఏమిసంబంధము? అట్లు చెప్పకూడ
దు" అని వలీదు పలికెను.

మఱొకఁడు "ముహమ్మదు కవి అని చెప్పుదమని' చె
ప్పెను. అప్పుడు "కవిత్వమును గూర్చియు దాని లక్షణమును
గూర్చియు మాకు బాగుగా తెలియును. ముహమ్మదు చెప్పు
మాటలకును పద్యకావ్యమునకును ఏమియు సంబంధము లేదు."
అని వలీదు పలికెను.

మఱొకఁడు "ముహమ్మదు మంత్రకాఁడు. అని పలుకుద
మని' చెప్పెను. అదివిని "ముహమ్మదునందు పవిత్రతయును
భక్తియును మేము చూచుచున్నాము. మంత్రకాండ్రలోనుం
డు అపవిత్రము వారి నీచత్వము మాకు బాగుగా తెలియును.
అతనికిని మంత్రకాండ్రకును సంబంధము లేదు. కాఁబట్టి మే
మట్లు చెప్పలేమని" వలీదు చెప్పెను. అదివిని అందఱు "మఱే
మి చెప్పవలెనో నీవే చెప్పుము." అని వలీదు నడిగిరి. అపుడు
"ముహమ్మదుమాటలలో అద్భుతమైన మధుర మున్నది.

అదివినినదో దానిసారముచే తండ్రికుమారుని తమ్ముఁడు అన్నను భార్యభర్తను విడనాడును. కావున అతనిమాటలు వినకూడదని చెప్పవలెనని” వలీదు ఆలోచనచెప్పెను. పిదప ఆసంఘములో “ముహమ్మదును పలువిధములుగా హింసించవలెను. అతనిప్రచారమునకు అడ్డుపడవలెను. అతనిశిష్యులను బాధించవలెను.” అనుతీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపఁబడెను.

:—ముసల్మానులు అబిసీనియాకు వలసపోవుట.:—

ముసల్మానులను పలువిధములైన తీవ్రబాధలు దుష్టులు పెట్టసాగిరి. పైగంబరులవారదిచూచి ప్రాణభక్తిరక్షణము కొఱకు ఇష్టపడినవారు అబిసీనియాకు పోవచ్చును. అచటి రాజు మంచివాఁడని తమశిష్యులకు సెలవిచ్చిరి. సెలవైనపిదప పంద్రెండుమంది పురుషులును, నలుగురుస్త్రీలును, రాత్రివేళ చీకఁటియందు అబిసీనియాకు పోవుటకై షుయెబాయను రేవునందు ఓడనెక్కి పయనమైరి. హజరత్ ఉస్మాన్‌గనీ ఆప్రయాణికులకు పెద్దగానుండెను. వారిలో పైగంబరులవారి కుమార్తెయగు బీబీరుఖయా (ఉస్మానుయొక్క భార్య)కూడనుండెను.

వారు అబిసీనియాచేరిరి. వారుచేరిన పిదప 83 మంది పురుషులును 18 మంది స్త్రీలును అబిసీనియాకు వెడలిపోయిరి. పైగంబరులవారి పినతండ్రి కుమారుఁడైన జాఫరు వారితోనుండెను. మక్కా విడిచిపోయిన వారందఱిని అబిసీనియారాజగు నజాషీ చాలగౌరవించి సుఖముగా నుండునట్లు ఏర్పాటుచేసెను. ఆరాజు నసరానీ మతస్థుఁడు. ఖురైషులకది తెలిసి విలువైన కానుకలిచ్చి, పాఱివచ్చినవారిని తిరిగి

పంపవలెనని రాజునొద్దకు రాయబారము సంపిరి. ఖురైషులు 'అబ్దుల్లాబిన్ రబియా, అమ్రుబిన్ ఆస్' అను ఇద్దఱిని రాయబారము కొఱకు నియమించి అబిసీనియాకు పంపిరి. వారిద్దఱును నజాషీరాజుయొక్క దర్బారునకు వచ్చి మక్కా విడిచి పాఱివచ్చిన వారు మాకు అపరాధులు. వారిని మాకు ఒప్పగించవలెను. మీ దేశములో వారి నుండనీయకూడదని విన్నవించిరి. అదివిని రాజు ముసల్మానులను రప్పించి వారిని గూర్చి ప్రశ్నించెను. అపుడు "హజ్రత్ జాఫర్" లేచి ఇట్లు చెప్పసాగెను. ఓరాజా! మేముపామరులమై తెలివిలేక విగ్రహములను ఆరాధించుచుంటిమి. వ్యభిచారము చేయు చుంటిమి. బంధుత్వమును త్రెంపుచుంటిమి. ఇరుగుపొరు గుల వారిని బాధించుచుంటిమి. బలవంతుఁడు బలహీనుని నాశముచేయుచుండెను. అట్టి దుస్థితిలో మునిఁగియుండఁగా దేవుఁడు మాయొద్దకు ఒకప్రివక్తను పంపెను. మేమతని వంశమును అతని సత్యప్రవర్తనమును అతని నమ్మకము (అమానతు) ను అతని పవిత్రమైన చరిత్రమును బాగుగా నెఱుఁగుదుము. దేవుఁడు ఒక్కఁడే అనియు అతనినే పూజింపవలెననియు మాతాతముత్తాతలు ఆరాధించుచున్న ఱాళ్లను విగ్రహములను విడనాడవలయుననియు నమ్మినవారిని మోసము చేయకూడదనియు ఇరుగుపొరుగుల నుండువారి విషయమున స్నేహము కలిగియుండవలెననియు దురాచార ములను విడనాడవలెననియు హత్యలు కావింపరాదనియు మాకు ముహామ్మదురసూలువారు ఆజ్ఞాపించిరి. వ్యభి చారము మొదలైన అధర్మములను, అబద్ధముపలుకుటను,

తల్లిదండ్రులు లేని బిడ్డలసొత్తును అపహరించుటను, పతివ్రతలపై అపనింద మోపుటను నిషేధించిరి. సాటిలేని దేవునే పూజింపవలెననియు దేవునితో సమానునిగా నితరుల చేయకూడదనియు, నమాజు (ప్రార్థన) చేయవలెననియు, జకాతు (దానము) చేయవలెననియు, రోజా (ఉపవాసము) ఉండవలెననియు, మాకు పైగంబరులవారు ఆజ్ఞాపించిరి. కావున మేము వారిని నమ్మితిమి. వారిచ్చిన దేవునాజ్ఞల ననుసరించి నడచితిమి. దేవునినే పూజించితిమి. దేవునికి సాటిలేదని నమ్మితిమి. దేవుడు నిషేధించిన వానిని మానుకొంటిమి. దేవుడు సెలవిచ్చినదానిని స్వీకరించితిమి. అందుచే మా కులస్థులు మాకు పెట్టరాని బాధలు పెట్టిరి. అనేక హింసలు కావించిరి. మేము స్వీకరించిన మతము విడిచి పూర్వము చేయుచున్న దురాచారములు మేము చేయవలెనని ఖురైషులు చాల ప్రయత్నించిరి. కాని మేమట్లు చేయక ఆత్మభక్తి రక్షణార్థమై మా జన్మభూమిని విడనాడి మీ దేశమునకు రక్షణాగతులమై వచ్చితిమి. ఓరాజా! మాకు మీయొద్ద అన్యాయము జరుగదని నమ్ముచున్నాము.

అది రాజువిని "మీ ప్రవక్తగారియొద్దకు వచ్చిన దైవసందేశము (వహీ) లోని వాక్యములు వినిపించుమని" జాఫరు నడిగెను. అపుడు జాఫరు కొన్ని వాక్యములు వినిపించెను. రాజది విని భయభక్తులతో కన్నీరు విడువసాగెను. దేవదత్తగ్రంథమగు ఇంజీలును మీరు పఠించిన ఖురానువాక్యములును ఒకదీపకిరణములే అనిచెప్పి ఏసుక్రీస్తుగారు పూర్వము రాఁబోవు ప్రవక్తను గూర్చిచెప్పిన యాతఁడు ముహమ్మదు వారే యని

విశ్వసించు ప్రశ్నను నకలంబించెను. ఖురైషుల దాయాదారులను సత్కరించి పంపివేసి ఆశ్రయించెను. ఖురైషులు వచ్చిన కథలు అచట చెల్లచేసి. వారు తిరిగి మక్కాపట్టణమునకు వచ్చి జరిగిన వృత్తాంతమంతయు ఖురైషులకుం దెలిపిరి.

—: అబూబకరుగారు అబిసీనియాకు పయనమగుట :—

ఖురైషులు బలహీనులను మాత్రమే బాధించుటలేదు. గొప్ప కుటుంబములయందుండు వారినిగూడ బాధించుచుండిరి. హజరత్ అబూబకరుగారు మొట్టమొదట ముసల్మానులైన వారు. వారి కుటుంబము చాలబలమైనది. వారికి సహాయులు చెప్పుకొనగలరు. అయినను ఖురైషుల కాఠిన్యము వారిపై అమిత మాయెను. అందుచే వారుకూడ అబిసీనియాకు పయనమై బిర్కుల్ గమాదు అను ప్రదేశమును చేరిరి. అచట ఇబ్నుదగ్నా అను సర్దారు కలిసి ఎక్కడికి పోవుచున్నారని అబూబకరును అడిగెను. అప్పుడు నా కులమువారు నన్ను మక్కాలో శాంత ముగా నుండనీయరు కావున ఎచటికైన పోయి నెమ్మదితో దేవుని బ్రార్థింపవలెనని పోవుచున్నాను. అనిఅబూబకరుగారు బదులుచెప్పిరి. అప్పుడా సర్దారు "అట్లుకానేరదు. మీ వంటి వారు మక్కా విడిచిపోవుట సరికాదు. నేను మీకు అభయ మొసంగుచున్నాను" అని తిరిగి వారిని మక్కాపురమునకు పిలిచికొనివచ్చెను. ఆసర్దారు ఖురైషు లందఱితోం గలసి "ఏమి? మీరు నిఱుపేదలకు తోడుపడునట్టియు, అతిథుల కాతిథ్యము చేయునట్టియు, బంధువులను పోషించునట్టియు, 'అబూబకరు'ను వెళ్లంగొట్టుచున్నారు." అనిచెప్పంగా ఖురైషు లిట్లనిరి. "అబూబకరు నిశ్శబ్దముగా నింటిలోబ్రార్థన (నమాజు)

చేసికొనవలెను. ఏమనగ అతడు పఠించు ఖురాను వాక్యములు విని మా స్త్రీలు బిడ్డలు దానికి లోబడుచున్నారు. కావున అతడు మేము చెప్పినట్లు ఇంటిలో శబ్దములేక చదువవలెను. హాజరత్ అబూబకరు ఖురైషులషరతు ప్రకారము కొన్ని దినములు చేసిరి. పిదప వారు తమఇంటిముంగిటిలో నొకమసీదు కట్టుకొని దానిలో శబ్దముతోనె నమాజు చేయసాగిరి. వారి పఠనము చాలసారసముగా నుండెను. అందుచే స్త్రీలు బిడ్డలు ఖురానువిని పరవశులగుచుండిరి. అది ఖురైషులు చూచి ఇబ్నుదగ్నాతో చెప్పిరి. అతడు వచ్చి అబూబకరుతో నిట్లుచెప్పెను. "నేను మీకిచ్చిన అభయము రద్దుచేయుచున్నాను. మీయిష్టము." అప్పుడు హాజరత్ అబూబకరుగారు "నీ అభయము నా కక్కరలేదు. దేవుని రక్షణయే చాలును' అనిచెప్పి వారు తమయిష్టప్రకారము నమాజు చేయసాగిరి.

—: ఖురైషులు పైగంబరు వారికి పేరాస చూపుట :—

ఖురైషులు తాము పన్నిన కుట్ర వృథాయయ్యెనని తలచి తమలోనిట్లు ఆలోచించిరి. "ముహమ్మదునకు ధనాశ చూపవలెను. దానికి సమ్మతింపనిచో ముహమ్మదును దండింపవలెను. ఎట్లైన మనమాట ఒప్పుకొనునట్లు చేయవలెను.". అని ఉత్బాఅనుధనికుని ముహమ్మదువారి యొద్దకు పంపిరి. ఉత్బా ముహమ్మదువారియొద్దకు వచ్చి యిట్లు పలికెను. "ఓయీ! ముహమ్మదూ! నీవు ఈప్రచారముచే ధనము కూర్చవలెననియున్నచో మేము అందరికన్న ఎక్కువధనము నీయొద్ద నుండునట్లు చేయుదుము. లేక పెద్దరికము కోరుచుండినచో నిన్ను మాకుపెద్దగా నెన్నుకొనుదుము. లేక నీవు రాజ్యము

నూవ-అమిలుస్-సాలిహాతి-లహుమ్-అజ్‌రున్- గైరుమమ్నూన్. పరమదయాళువును ప్రేమించువాఁడు నగు అల్లాపేర. ఈ గ్రంథము పరమదయాళువును అనుగ్రహించువాఁడును అగు దేవుఁడొసంగినది. ఖురాను గ్రంథము అరబ్బీభాషయందున్నది. గ్రహించువారికి ఖురాను గ్రంథమందు స్పష్టముగా సూచనలున్నవి. దేవునాజ్ఞ ననుసరించువారికి అది సంతోషము నిచ్చుచున్నది. తిరస్కరించువారిని భయపెట్టుచున్నది. పెక్కుమంది దానిని వినక ముఖము త్రిప్పుకొని నీవుబోధించినది మామనస్సులకుపట్టదు. మాకు చెవుడున్నది. నీమధ్యను మామధ్యను తెఱయున్నది. కావున నీవు నీపనిచేయుము. మేము మాపనిచేయుదుము అనిచెప్పుదురు. నేనుకూడ మీవంటి మానవుఁడనే. మీ దేవుఁడు ఒక్కఁడేయని నాయొద్దకు దైవసందేశము వచ్చుచున్నది. కావున మీరు అతనిపై పునకుస్థిరముగరండు. మఱియు అతనినే క్షమాపణవేఁడుఁడు అని చెప్పుము. జకాతు (దానము) చెల్లింపనట్టియు పరలోకమునుతిరస్కరించునట్టియు అవిశ్వాసులకు తీవ్రబాధ దుఃఖము లభించును. కాని, విశ్వసించి సత్కార్యము చేసినవారికి ఎడతెగనిపుణ్యము లభించును.

ఖురానుయొక్క ఆదివ్యవాక్యములు "ఉత్బా" వినినంతనే నిశ్చేష్టుఁడై బదులు చెప్పలేక ఊరకలేచిపోయెను. ఖురైషులు ఉత్బారాకకు ఎదురుచూచుచుండిరి. ఉత్బావారియొద్ద చేరినంతనే ఏమి అడిగితివి? ఏమిజరిగినది? అనిఅడిగిరి. అప్పుడు

ఉత్బా "ఖురైషులారా! నేను దివ్యమైన వాక్యములను విని
వచ్చితిని. అది జ్యోతిషముకాదు. కవిత్వము కాదు. జాల
విద్యయును కాదు. కావున నామాటవిని ముహమ్మదును అతని
స్థితిలోనే విడిచిపెట్టుడు. అతని జోలికి పోకుడు. అనిచెప్పఁ
గా ఖురైషులు విని నీవుకూడ ముహమ్మదు మాటకు లోఁబడి
వచ్చినట్లున్నది అని నిందించిరి.

—: అబూతాలిబు నొద్దకు ఖురైషులు పోవుట :—

ఆ విధముగా ఖురైషులు యత్నించిన యత్నములచే
ప్రయోజనములేకపోయెను. అందుచే ఖురైషులందఱు చేరి
ముహమ్మదురసూలు వారిపినతండ్రియగు అబూతాలిబు నొద్ద
కు వచ్చి యిట్లు చెప్పసాగిరి. "మేముమిమ్ముల గౌరవించితిమి.
మీయన్నకుమారుఁడు మాతాత ముత్తాతలు పూజించు
చున్న దేవతలను విగ్రహములను చెడఁబడఁదిట్టుచున్నాఁడు
మేము మీముఖముచూచి చాలవఱకు ఓర్చుకొంటిమి. ఇప్పుడు
ఓర్వఁజాలము. కావున మీరు అతనికి బుద్ధిచెప్పి యాప్రచార
ము మానునట్లు చేయవలెను. లేనిచో మేము అతనినిచంపుదు
ము. మీరేమియు చేయలే"రని చెప్పిరి. అబూతాలిబు అది
విని, ముహమ్మదువారిని రప్పించి జరిగిన విషయము తెలిపి
ఖురైషులతో విరోధము చాలహెచ్చినది. నేను సహింప
లేనంతటి భారము నాపై మోపకుము. విగ్రహములఁగూర్చి
ముచ్చటింపకుము. అని పలికెను. పైగంబరులవారు అదివిని
"ఓపినతండ్రీ! ఖురైషులు నాకుడిచేతిలో సూర్యుని ఎడమ
చేతిలో చంద్రుని తెచ్చిపెట్టినను నేనుచేయు ప్రచారము విడు
వను. ధర్మప్రచారముకొఱకు నాప్రాణమైన విడుతును. కాని

దేవునాజ్ఞ విడువను" అని బదులుచెప్పి అచ్చటినుండి పోవసాగిరి. అప్పుడు అబూతాలిబు పైగంబరులవారి స్థైర్యము చూచి మఱల పిలిచి "ఓకుమారా! నీయిష్టప్రకారము చేయుము. నేను జీవించియున్నంతవఱకు నీకు తోడుపడుదును' అనిచెప్పెను.

-: ఖురైషులు పైగంబరులవారిని సభకు రప్పించుట. :-

ఖురైషులు అబూతాలిబు నొద్దకు పోయి ప్రయోజనము లేకపోయెనే యని మఱల ఏమి చేయవలెనని యాలోచించి ఒకగొప్పసభ కాబాలో చేసి ముహమ్మదువారిని ఆసభకు రప్పించిరి. ముహమ్మదు రసూలువారు ఆసభకుపోయి కూర్చుండిరి. అపుడు ఖురైషులు ముహమ్మదు వారితో ఇట్లుసంభాషించిరి. "ఓముహమ్మదూ నీతో ఈసభలో మాటలాడవలెనని నిన్ను ఈసభకు రప్పించితిమి. దేవునితోడుగా నీవలన కులమునకు కలిగిన కష్టనష్టములు ఎవ్వనివలనను కలుగలేదు. ప్రచారమువలననేమి కోరుచున్నావు. ధనముకోరుచున్నావా? ధనము కూర్చెదము. లేక గౌరవము కోరుదువా? నిన్ను పెద్దగాఁజేయుదుము. లేక రాజ్యము కోరుదువా? నిన్ను రాజుగాఁజేసెదము. లేక నీకేదైన 'జన్' పట్టిన మంత్రింతుము" అని ఖురైషులు పైగంబరువారితో చెప్పసాగిరి. అప్పుడు పైగంబరులవారు "మీరు నావిషయము చెప్పినదంతయు శుద్ధ అబద్ధము. నేనుచేయు ప్రచారమువలన ధనమును, రాజ్యమును, గౌరవమును కోరలేదు. నిజమేమనగా దేవుఁడు నన్ను ప్రవక్తగా నియమించి మీయొద్దకు పంపియున్నాఁడు. నాకు ఖురాను గ్రంథము నొసంగియున్నాఁడు. నేను నాప్రభువుయొక్క యాజ్ఞలు మీకుఁ దెలిపితిని. వానిని వివరముగా బోధించితిని. మీరు

త్వరగా సత్యమును గ్రహించినచో ఉభయలోకములలో మీకు మేలు కలుగును. లేనిచో మీవిషయమును నావిషయమును దేవుఁడు ఏమి నిర్ణయము చేయునో దానికెదురుచూతము” అని పలికిరి. అప్పుడు ఖురైషులు “సరే! ఓముహమ్మదు ఒక మాట వినుము. నీవు పలికిన మాటలు మేము నమ్మము. మేము నీళ్లవసతిలేక చాలబాధపడుచుంటిమి. కావున మక్కాలోనుండు కొండల నెత్తివేయుమన్నను, సిరియా ఇరాకు దేశములలో ప్రవహించు నదులవంటి నదులు మక్కాలో కూడ ప్రవహించునట్లును, మాతాత ముత్తాతలు, వారిలో ఖుసైబిన్కిలాబ్ అను మాసర్దారుఁడు గోరిలోనుండి బ్రతికి వచ్చునట్లును దేవుని వేడుకొనుము. అతఁడు బ్రతికి నీవుచెప్పినది నిజమని మాకు చెప్పినచో నీవు దేవుని ప్రవక్తయని నమ్మెదము” అని చెప్పిరి. చూచితిరా! తెలివిలేని పామరులు ఎట్లు ప్రశ్నించెదరో! అప్పుడు ముహమ్మదు పైగంబరువారు “నేను అట్టిపనిచేయుటకై ప్రవక్తగారాలేదు. నేను ధర్మప్రచారము చేయుటకై దేవునిఆజ్ఞానుసారమై వచ్చితిని. కావున నేను దేవునాజ్ఞలను మీకుఁదెలిపితిని. మీరంగీకరించినచో ఇక్కడను అక్కడను మీకు మేలుకలుగును. లేనిచో మీవిషయము నావిషయము దేవుఁడేమిచేయునో దానిని చూతము” అని పలికిరి. “సరే నీవు మాకొఱకు ఏమి చేయకపోయిన పోనీ నీకొఱకైనను తోఁటలును, పెద్దపెద్ద మేడలును, బంగారు వెండి బొక్కసములును లభించునట్లు దేవుని వేఁడుకొనుము. మఱియు నీవెంట ఒక దేవదూత యుండి నీవు నిజమైన ప్రవక్తయని నీమాట నమ్మవలెనని మాకుచెప్పినచో మేము నీమాటలు

నమ్మనేరము" అని ఖురైషులు బదులుచెప్పిరి. "నేనట్లు దేవుని ప్రశ్నించను. నే నట్టివిషయము కోరుటకు ప్రవక్తగా రాలేదు. ధర్మప్రచారము నాపని. అది నేను చేసితిని. మీరు నమ్మిన మీకు మేలు కలుగును. లేనిచో నేను మీరు పెట్టు బాధల నోర్చుకొందును. దేవుఁడేమిచేయనున్నాఁడో యది చూచెదను" అని పలికిరి. అపుడు ఖురైషులు "సరే నీవే దేవుని ప్రవక్తవైనచో ఆకాశమునొక్క ఒకతునుక మాపై పడునట్లు చేయుము. దేవుఁడు కోరినట్లు చేయఁగలఁడు కదా! అట్లు చేయనిచో మేము విశ్వసింపము" అని పరిహసించిరి. (అట్లు పరిహసించినవారు తుదకు బదరుయుద్ధములో నశించిరి.)

అపుడు పైగంబరులవారు "దేవుని చేతిలో నున్నది. అతఁడు కోరినయది చేయఁగలఁడు" అనిచెప్పిరి. ఖురైషు లదివిని మేముకోరినది నీవుచేయలేకపోతివి. కాన నిన్ను మున్నాటికి నమ్మము. నీప్రచారము సాగనీయమని పలువిధములైన డంబాలుకొట్టి నీదేవుఁడు మాకంటికి కనఁబడి చెప్పునంతవఱకు మేము నమ్మము" అనిచెప్పిరి. అట్లు సంభాషణ జరిగినపిదప పైగంబరువారు లేచి పోయిరి.

—; హంజాగారు ఇస్లాములో చేరుట :—

ఖురైషులు తమద్వేషముచే పలువిధములైన కష్టములు పైగంబరులవారికి కలిగించుచుండిరి. అట్లు అయిదు సంవత్సరములవఱకుజరుగుచుండెను. ఆఱవయేఁట పైగంబరులవారు ఒకదినము సఫా కొండతిప్పపై కూర్చుండియుండిరి. అబూజెహాల్ అనుదుష్టుఁడు వారి యొద్దకు పోయి కారణము లేకయే తిట్టసాగెను. అదివిని పైగంబరులవారు బదులుచెప్పక

యూరకుండిరి. అదిచూచి అబూజెహాల్ ఛాతీతో పైగంబ
రులవారితలపై కొట్టెను. అపుడే రక్తము ప్రవహింపసాగెను.
ఆవిషయము పైగంబరులవారి పినతండ్రియగు హంజాకు తెలి
సెను. అతఁడా అప్పటికిని ముసల్మానుఁడు కాలేదు. అతఁడు
అదిచూచి బంధుప్రేమచే చాలరోషముతో అబూజెహాలు
నొద్దకు పోయి వానిని తనచేతిలోని ధనుస్సుతో తలపై కొట్టెను.
హంజా యీవిషయము పైగంబరులవారికి తెలిపి "సంతోషించి
తివా?" యని యడిగెను. అపుడు పైగంబరులవారు "నాకీ
విషయముచే నేమియు సంతోషము లేదు. కాని మీరు ముస
ల్మానులైనచో మహాసంతోషము కలుగు"నని చెప్పిరి. అదివిని
హంజా, అపుడే ఇస్లామును స్వీకరించెను.

—: ఉమరు ఇస్లాము స్వీకరణము :—

హంజాగారు ముసల్మానులైన మూఁడుదినములపిదప
ఉమరు ఇస్లాము నవలంబించెను. అదియెట్లన ఒకదినము ఖురై
షులు కూర్చుండియుండిరి. "ఎవరు ముహమ్మదును చంపుదురో
వారికి నూఱుఒంటెల నిచ్చెద"నని అబూజెహాల్ చెప్పెను.
అదివిని ఉమర్ లేచి "యదెంతపని నేనుదానినెఱవేర్తు"నని
ప్రతిజ్ఞచేసి ఖడ్గము చేతఁబూని పైగంబరులవారిని వధించుటకై
బయలుదేఱెను. దారిలో నయీముబిన్ అబ్దుల్లా ఎదురుపడి
"ఓఉమర్' ఎచ్చటికి పోవుచున్నావని" అడిగెను. "నేనుముహ
మ్మదును వధించుటకు పోవుచున్నాను" అని అతఁడుచెప్పెను.
అదివిని నయీము "ముందు నీవు నీయింటివారివిషయము
చూడుము. నీచెల్లెలును నీబావయును ముసల్మానులైయు

న్నారు. ముందు వారిని సవరించుము" అనెను. అది విని నంతనే 'ఉమర్' తన బావయింటికి పోయెను. అపుడు వారిం టిలో ఖురానెషరీఫు పఠించుచుండిరి. 'ఉమరు' రాక నెఱింగి వారు ఖురానెషరీఫును దాఁచిపెట్టిరి. అపుడు ఉమరు బావయింటిలో ప్రవేశించి "మీాఇంటిలోనుండి వినఁబడిన శబ్దమేమి?" అని చెల్లెలిని అడిగెను. అపుడామె "ఏమియు లే" దని బదులు చెప్పెను. అపుడు ఉమరు లేదు లేదు. మీా రు మతభ్రష్టులైనారని విన్నాను." అని చెప్పుచు బావను పట్టి కొట్టసాగెను. చెల్లెలు మధ్యలో విడిపించుటకై పోఁగా నామెనుకూడ రక్తముప్రవహించునట్లు కొట్టెను. అపుడు చెల్లెలు "ఓఉమర్! నీశక్తికొలఁది కొట్టుము. స్వీకరించిన ఇస్లాము మతమును విడనాడము." అని ధైర్యముగా పలికెను. ఆమెమాటవలన 'ఉమరు'యొక్క మనస్సు మృదువుపడి చెల్లెలివంక చూచెను. ఆమె దేహమంతయు రక్తముతో నిండియుండుటచూచి మనస్సు మఱింత కరఁగిపోయెను. "మీారు చదువుచున్నది నాకును వినిపింపుఁడు" అని ఉమ ర్' చెప్పెను. అదివిని అతని చెల్లెలు తమయొద్దనున్న ఖురాను చూపించెను. దానిలోని వాక్యములుచదివి విననంతనే "ముహమ్మదువారియొద్దకు నన్ను తీసికొనిపొండు. నేను ఇస్లాము నవలంబించుచున్నాను". అనిచెప్పసాగెను. ఆకాల మున పైగంబరులవారును వారిశిష్యులును 'అర్ఖము' అను వారింటిలో నుండిరి. ఉమర్ అచటికి పోయి హెచ్చరించెను. అదివిని పైగంబరులవారు ఎదురుగా పోయి "ఏమి ఉమరు!

ఎందుకు వచ్చితివి?" అని అడిగినంతనే 'ఉమరు' భయము
తో వణకుచు "నేను ఇస్లాము నవలంబించుటకై వచ్చితిని"
అని చెప్పగా పైగంబరులవారు సంతసించి అల్లాహూ అక్బరు
(అల్లా సర్వాధికారుండు) అని చెప్పిరి. అచటనుండిన
ముసల్మానులందఱును "అల్లాహూ అక్బరు" అని పల్కిరి. పైగం
బరులవారిని వధించుటకు వచ్చిన ఉమరు తుదకు
పైగంబరులవారి ప్రియశిష్యుడాయెను.

'హజరత్ ఉమరు' ఇస్లాము నవలంబించిన పిదప
కాబామసీదునకుపోయి నమాజు చేయసాగెను. అదిచూచి
ఖురైషులు కుపితులై అడ్డగించిరి. కాని వారి యాటలు హజ
రత్ ఉమరు వారియెడ్ల సాగలేదు. ఇంతవఱకు కాబాలో
నమాజుచేయుటకు భయపడుచున్న భక్తులు 'హజరత్ ఉమరు'
తో కూడి నమాజు చేయసాగిరి. ముసల్మానులకు 'హజరత్
హంజా' మఱియు హజరత్ ఉమర్ వలన ధైర్యమువచ్చెను.

—: సంఘబహిష్కారము :—

ముసల్మానులు దినదినము హెచ్చుచుండిరి. ఖురై
షులది చూచి ఎన్నికష్టములుపెట్టినను పైగంబరులవారును
వారి శిష్యులును తమపట్టుదల విడుచుటలేదు. హాషిమ్ సంతతి
వారు (పైగంబరులవారి కుటుంబము) ముసల్మానులు కాక
పోయినను ముహమ్మదునకు తోడుపడుచున్నారు. కావున
వారిని బహిష్కరింపవలెనని యాలోచించుకొని యొకసభ చేసిరి.
ఆసభలో ఖురైషులు ఇట్లుతీర్మానించిరి. "ముహమ్మదును వధిం
చుటకై మాచేతికినప్పగించునంతవఱకు ఎవ్వడును బనీహా
షిముతో చుట్టఱికము చేయరాదు. వారితో నెట్టివ్యాపారము

చేయరాదు. వారితో స్నేహము చేయరాదు. వారికి తినుటకు ఆహారముగాని త్రాగుటకునీరుగాని దొరకనీయరాదు. ఆతీర్మాన మొకపత్రములో వ్రాసి కాబామసీదుద్వారమునకు కట్టిరి. ఆతీర్మానముచే అబూతాలిబు వీలులేక తన కుటుంబమును పైగంబరులవారు తమబంధువులను తీసికొని 'షేబేఅబూతాలిబ్' అను కనుమలో పురమువిడిచిపోయి నివసింపసాగిరి. అది ప్రవక్తపదవి లభించిన యేడవయేట జరిగెను. ఆకనుమలో నుండు కాలమున ఆహారము దొరుకుట కఱవయ్యెను. ఆకులు తినసాగిరి. బిడ్డలు ఆకటిబాధచే విలపించుచుండిరి. కఠినులైన ఖురైషులు పిల్లలయొక్క యేడ్పులు విని యానందించుచుండిరి. వారిలో కొందఱు కనికరించి రహస్యముగా నాహారములందఁజేయుచుండిరి. వానినికూడ అబూజెహల్ అడ్డగించుచుండెను. అట్లు పైగంబరులవారును వారి బంధువులును మూఁడు సంవత్సరముల వఱకు చాలబాధ పడుచు ఆకనుమలోనే యుండిరి. వారికష్టములు చూచి ఖురైషులలోనే కొందఱు కనికరించిరి. ఆతీర్మానము రద్దు చేయవలెను. మేము తినిత్రాగి సుఖముగా నుండి వారు కనుమలో కష్టపడుట న్యాయముకాదు. అనితలంచి జుబైరు, హిషాము, ముతియమ్అనువారు ఒకదినము కాబాలో సభ కావించిరి. అబూజెహల్ తీర్మానము రద్దుచేయకూడదన్నను జుబైరు మొదలగువారు బలవంతముగా కాబాద్వారమందున్న ఆతీర్మానపత్రమును చించివేసి యావార్త అబూతాలిబునకు తెలిపిరి. మూఁడేండ్లు పడరానికష్టములకోర్చుకొని పైగంబరులవారును వారికుటుంబముల వారును ఆకనుమనుండి యిండ్లకువచ్చిరి.

—: అబూతాలిబు మరణము. :—

ప్రవక్తపదవి లభించిన పదియవయేట సంఘబహిష్కారము ముగిసెను. ఆసంవత్సరమే పైగంబరులవారిని బాల్యము నుండి యింతవఱకు సంరక్షించుచున్న పిన్నతండ్రియగు అబూతాలిబు మరణించెను. అందుచే పైగంబరువారికి చాలచింత కలిగెను.

—: బీబీఖదీజాగారు పరలోకము చెందుట. :—

పినతండ్రియొక్క మరణదుఃఖము మానకమునుపే ప్రియురాలైన భార్యయగు బీబీఖదీజా 65 సంవత్సరముల వయస్సులో 'అబూతాలిబు చచ్చిన మూఁడవదినమున పరలోకము చెందెను. అట్లు పిన్నతండ్రిని భార్యను పైగంబరుల వారు గోలుపోయిరి.

: పైగంబరులవారు తాయెఫ్ పురమునకు పోవుట. :

బీబీఖదీజా అబూతాలిబు మరణించిన పిదప ఖురైషులు విచ్చలవిడిగా పైగంబరులవారినిబాధింపసాగిరి. పైగంబరులవారు అదిచూచి చుట్టుపక్కలనుండువారికి బోధించుటకై పయనమయిరి. వారివెంబడి జైదుబిన్ హారిస్ ఉండెను. మార్గమందుండు పల్లెలలో బోధించుచు తాయెఫ్ అను పట్టణము చేరిరి. ఆపట్టణములో పెద్దపెద్దసర్దారులుండిరి. వారిలో అబ్దెయాలీలు, మస్ఊదు, హబీబు అనువారు ముఖ్యులు. పైగంబరులవారు ఆముగ్గురికి బోధించిరి. అపుడు వారిలో నొకఁడు 'నీవు ప్రవక్తయే యైనచో నేనుకాబాయెదుట గడ్డము మీసములు గొఱుగు కొందును. అనియు మఱొకఁడు ఏమి దేవునికి నీవేదొరకితివా? ఎక్కను ఒంటెకూడ లేదే అనియు

మఱొకండు "నేను నీతో మాట్లాడను. ఎందుకన నీవు సత్యము చెప్పుచున్నచో నిన్ను తిరస్కరించుట మంచిది కాదు. అబద్ధము పలుకుచున్నచో అబద్ధవాదితో మాట్లాడుట సరికాదు' అని పలువిధములైన మాటలు పలికెరి. ఆదుష్టులు అంతతోనే యూరకుండక అల్లరికాండ్రను ప్రేరేపించి పైగంబరులవారు బోధించునపుడు అల్లరిచేయునట్లు చేసిరి. పైగంబరులవారు బోధించునపుడు గోలపెట్టుచు రాళ్లురువ్వుచు చప్పట్లుకొట్టుచు తిట్టుచు పలువిధములైన అల్లర్లు కావించిరి. అట్లు అల్లరికావించుటచే పైగంబరులవారు ఒకఅంగూరుతోఁటలో ప్రవేశించిరి. అదిచూచి తోఁటయజమానుఁడు కనికరించి 'అదాసు అను తనబానిసచేత నొకపళ్లెములో అంగూరుపండ్లు పంపెను. అదాసు తీసికొనివచ్చి యిచ్చెను. పైగంబరులవారును జైదును భక్షించిరి. పైగంబరులవారచట ఒకదినము ప్రజలకు బోధించుచుండిరి. అపుడు దుష్టులు కొట్టిన రాళ్లదెబ్బలచే దేహమంతయు రక్తమయమై యాబాధచే స్మృతిదప్పి భూమిపై పడిపోయిరి. అపుడు జైదు పైగంబరులవారిని వీఁపుపై నెత్తికొని బయటికి వచ్చి నీళ్లుచల్లెను. అపుడు పైగంబరులవారు స్మృతి నొందిరి. పైగంబరులవారన్నికష్టములు పడియు దుష్టులనుశపింపక వారు ముసల్మానులుకాకపోయినను వారిసంతానమైనను కావచ్చునని తలంచి మరల మక్కాపట్టణమునకు వచ్చిరి. పైగంబరులవారు మక్కాపట్టణము ప్రవేశించునపుడు ముత్ఇమ్అను నతఁడు వారికి రక్షణనిచ్చెను. అందుచే ఖురైషులు పైగంబరులవారిని అడ్డగించలేకపోయిరి. లేనిచో ఆదుష్టులు పురమునందు ప్రవేశింపనిత్తురా! తాయెఫునుండి తిరిగి

మక్కాపురము చేరిన పిదప పైగంబరులవారు ప్రత్యేకముగా నొక్కొక్క సంఘమువారుండుచోట్లకు పోయి ఇస్లాముబోధింపసాగిరి. కొందఱు పరిహసించిరి. కొందఱు విని యూరకుండిరి. వారిలో బనూఆమిర్ సంఘపుసర్దారు ఇట్లు ప్రశ్నించెను. "ఓయి! మహమ్మదు మేము మీకిప్పుడు తోడుపడుదుము. మీరు విజయము పొందినచో మీతరువాత మాకు దొరతనము వచ్చునట్లు సమ్మతింతురా!" అపుడు పైగంబరులవారు "ఆపని దేవునిచేతిలోనున్నది" అని జవాబిచ్చిరి. అపుడాసర్దారు 'ఓహో! బాగుగనున్నదే. ఇప్పుడు మేము అరబ్బులతో విరోధించి మీకు తోడ్పడుట యేమి! తరువాత రాజ్యమితరులకుచేరుట యేమి? అట్టి పని మాకు వద్దువద్దు' అని చెప్పెను.

—: యాత్రికులకు బోధించుట :—

దూరదేశములనుండి ప్రజలు కాబాయాత్రకొఱకు మక్కాపట్టణమునకు వచ్చుచుండిరి. ఆయాత్రదినములందు పైగంబరులవారు యాత్రికులయొద్దకు పోయి "దేవుని పూజించుండీ! విగ్రహారాధన మానుకొనుఁడీ! నేను దేవునిప్రవక్తయని విశ్వసింపుఁడు" అని ఇస్లాముబోధ చేయుచుండిరి. బోధచేయు సమయమందు అబూలహబుమొదలైన ఖురైషుదుష్టులు అల్లరి కావించుచుండిరి.

—: సువైదు ఇస్లాములో చేరుట.:—

ఆదినములలోనే 'సువైదుబిన్‌సామిత్' అనువానికి పైగంబరులవారు ఇస్లాము బోధించిరి. అపుడతఁడు లుఖ్మాను ఉపదేశించినయుపదేశములు నాకుతెలియును అని కొన్ని పద్యములు చదివి వినిపించెను. అపుడు పైగంబరులవారు

అతనికి ఖురానెషరీఫును వినిపించిరి. అతఁడు విని ఇస్లామును స్వీకరించెను. అతఁడు యస్‌రబ్ (మదీనా) పట్టణమునకు తిరిగి పోఁగా ఖజ్‌రజ్ కులమువారు అతనిని చంపివేసిరి.

—: జమాదెఅజ్దీ ఇస్లాములో చేరుట. :—

ఆదినములలోనే జమాదెఅజ్దీ అనునతఁడు మక్కా పట్టణమునకు వచ్చియుండెను. అతఁడు యమనుదేశ నివాసి. అతఁడు మాంత్రికులలో ప్రసిద్ధికెక్కి యుండెను. అతఁడు ముహమ్మదునకు మంత్రముచే చికిత్సచేయుదునని ఖురైషులతోఁ చెప్పి పైగంబరులవారియొద్దకువచ్చి తనయుద్దేశమును దెలిపెను. అప్పుడు పైగంబరులవారు ముందు నేను చెప్పునది వినుము. అనిపలికి దేవుని స్తోత్రవాక్యములు వినిపించిరి. అతఁడు విని తత్‌క్షణమే తిరిగి యావాక్యములు చదువుఁడు చదువుఁడు' అనిపలికి తుదకుఇస్లాములో చేరెను.

—: మేరాజ్ (గగన ప్రయాణము). :—

ప్రవక్తపదవి లభించిన పదియవయేఁట రజబునెల 27-వ తేదిరాత్రి జిబ్రీలు దూత పైగంబరులవారు పరుండియుండఁగ వచ్చిలేపి కాబామసీదునకు తీసికొనిపోయెను. అచ్చటనుండి బురాఖ్ అను సవారిలో పైగంబరులవారినెక్కించుకొని యెరూషలేములోనుండు బైతుల్ ముఖద్దస్‌నకుకొనిపోయెను. అచటనుండు దైవమహిమలను పైగంబరులవారు దర్శించిరి. అచటనుండి జిబ్రీలుదూతవెంబడి సప్తాకాశములలో నుండు దైవమహిమలను దర్శించిరి. 'సిద్‌రతుల్‌ముస్తహా' అను చోటున దేవునిదర్శనము పైగంబరులవారికి లభించెను. వారచట ననేక దైవసందేశములుపొందిరి. ఆసమయమునందే

పైగంబరులవారు చెప్పినది ఒకటిగానుండెను. ఆదుష్టులంత పరిశీలించియు తుదకు నిజముదెలిసియు నమ్మక అది జాల విద్యయని నిందింపసాగిరి. అంధులైన అట్టిదుష్టులకు దేవుని మహిమ యెట్లుగోచరమగును!

—:తుఫైలు ఇస్లాము లో చేరుట.:—

ఒకదినము తుఫైలు మక్కాపట్టణమునకు వచ్చెను. అతఁడు దౌసు అను కుటుంబమువారికి సర్దారుఁడు. అతఁడు గొప్ప బుద్ధిశాలియైనకవి. అతఁడు మక్కాపట్టణమునకు వచ్చుచున్నవిషయము తెలిసి ఖురైషులు అతని కెదురు పోయి చాలగౌరవముతో పురమునకు పిలిచికొనివచ్చి ఆతిథ్యము సలిపి యిట్లుచెప్పసాగిరి. “ఓసర్దారు! మీరు పురములో జాగ్రత్తగానుండవలెను. మహమ్మదు అనునతని మాటలు వినరాదు. అతనిమాయమాటలచే భార్య భర్తను, తండ్రి కుమారుని, తమ్ముఁడు అన్నను విడనాడుచున్నారు. అతనివలన మావంశమునకు చాలకష్టము కలిగినది. అట్టియాపద మీకులమునకుఁగూడ రాఁగూడదని మేమిట్లు విన్నవించుచున్నాము.” తుఫైలు అదివిని పైగంబరులవారి మాట యెక్కడవినఁబడునో యని చెవులలో దూది దూర్చుకొని పురములోఁ దిరుగుచుండెను. ఒకదినము వేగుజామున తుఫైలు కాబామసీదునకుపోయెను. అపుడు పైగంబరులవారు నమాజుచేయుచుండిరి. దైవవిధిగా తుఫైలు మహమ్మదువారి పఠనమువిని సమీపించి పైగంబరులవారు పఠించునది వినెను. పైగంబరులవారు తమప్రార్థన ముగించి యింటికి వెడలసాగిరి. తుఫైలు పైగంబరులవారిని

వెంబడించి "ఓమహానుభావా! మీరు పఠించినది నాకు విని పించుడు". అని సవినయించెను. అప్పుడు పైగంబరులవారు ఖురాను పఠించిరి. ఆయత్తులు విని వారితోనే ఆక్షణమే ఇస్లాము నవలంబించెను. అంతేగాక ఆయత్తులు తిరిగి తనయూరికిం బోయి మతప్రచారము చేయసాగెను. మూపితిరా నుష్టిలేబు కారెరి! దేవ్యంగేమి చేసెను!

—: అబూజర్ గప్పారీ ఇస్లాము స్వీకరణము :—

'అబూజర్ గప్పారీ' 'యస్‌రిబ్' నివాసి. అతఁడు తన పురములోనే పైగంబరులవారివిషయమును తెలిసికొన తన తమ్ముని మక్కాపట్టణమునకు నంపెను. అతనితమ్ముఁడు గొప్ప కవి. అతఁడు మక్కాపురమునకు వచ్చి పైగంబరులవారిని దర్శించి మరలి తనయన్నకడకుబోయి మహమ్మదువారు సత్కార్యములుచేయుటకు నాజ్ఞాపించుచు దుష్కర్మములను నిషేధించుచున్నారు అని చెప్పెను. అది విని అబూజరు నీపలుకులవలన నాకుతృప్తి కలుగుటలేదు. నేను స్వయముగా విచారించి వత్తునని తనతమ్మునితో చెప్పి మక్కాపురమునకు పయనమై వచ్చిచేరెను. అతఁడు పైగంబరులవారిని గుర్తింపక యుండెను. అందుచే కాబామసీదులో పరుండియుండఁగా హజరత్ అలీగారువచ్చి యతని తనయింటికిఁగొనిపోయి ఆతిథ్యము సలిపిరి. అతఁడు రెండవదినము 'హజరత్ అలీ'తో తనయుద్దేశము రహస్యముగాఁ దెలిపెను. వారు అతని పైగంబరులవారి సమ్ముఖమునకుఁ దీసికొనిపోయిరి. అబూజర్ గప్పారీ తనయుద్దేశము పైగంబరులవారికిఁ దెలిపెను. పైగంబరులవారు ఇస్లామును బోధించిరి. అపుడతఁడు ఇస్లాముమతములో చేరెను. పైగంబరు

లవారు అబూజరుతో నిట్లు చెప్పిరి. "ఓ అబూజరూ! మీరీ విషయము దాచి మీ స్వగ్రామమునకు పొండు." అప్పుడు అబూజర్ "నేను దుష్టులకు భయపడను. నేను ఇస్లాము నవలంబించితినని ప్రకటించి పోవుదు"నని చెప్పి కాబాయొద్దకు వచ్చి ఖురైషుల యెదుట తన ఇస్లాము స్వీకరణమును ప్రకటించెను. అప్పుడు ఖురైషులు కుపితులై 'మతభ్రష్టుని కొట్టుడు' అని చెప్పగనే యచట నుండిన వారితని పైబడి కొట్టసాగిరి. అప్పుడు అబ్బాసు (పైగంబరులవారి పినతండ్రి) వచ్చి యతనినివిడిపించెను. ఆమరుదినము నట్లే చేసెను. ఖురైషులు కొట్టుచుండ అబ్బాసు విడిపించెను. పిదప అబూజర్ గఫ్ఫారీ మక్కాపురమును విడిచి తనయూరికిం బోయెను.

—: బీ బీ సౌ దా గా రి వి వా హ ము :—

బీబీఖదీజా మరణించిన పిదప హజ్రత్ పైగంబరులవారు బీబీసౌదా అనువితంతువును పెండ్లియాడిరి. బీబీసౌదాగారు తమభర్తయగు సక్రానుతోం గూడి అబిసీనియాకు పోయియుండిరి. వారిభర్త అచటనే పరలోకగతుండయ్యెను. వారు నిరాధారులై యుండిరి. అందుచే పైగంబరులవారు బీబీసౌదాగారి యొక్క భక్తివిశ్వాసములను సుగుణములను విని వారికి ఆధారములేకుండుటను చూచి వారిని సంరక్షించుటకై పెండ్లి చేసికొనిరి.

—: బీ బీ ఆ యి షా గా రి వి వా హ ము :—

బీబీఆయిషా హజ్రత్ అబూబకరు యొక్క కుమార్తె. ఆమె పిన్నవయస్సులో నుండెను. ఆమెతండ్రి పైగంబరు వారికిచ్చి పెండ్లిచేయుటకై నిశ్చయించి యాయుద్దేశము

పైగంబరులవారికి తెలిపెను. హజరత్ పైగంబరులవారు సమ్మతించి ఆమెను పెండ్లియాడిరి. పైగంబరులవారు వివాహమాడిన స్త్రీలలో 'బీబీఆయిషా' మాత్రమే కన్య. మిగిలిన స్త్రీలందఱు వితంతువులు. బీబీఆయిషావలననే భార్యాభర్తలధర్మము లనేకములు తెలియనాయెను. ఆమె పైగంబరులవారివలన గొప్ప గొప్ప ధర్మములు గ్రహించి పైగంబరులవారి పిదప శిష్యులకు బోధించెను. కాన వారివివాహముచే చాలమేలు లోకమునకు కలిగెను. విద్యను గ్రహించుటకు చిన్నవయస్సేకదా చాల యోగ్యమైనది. పైగంబరులవారు కన్యలను కామమోహములచే వివాహమాడినవారని తలంచియుండినచో తమ యౌవనమునందే పెండ్లిచేసియుందురు. కాని వారట్లుచేయక పూర్తి యౌవనమందుండినప్పుడు నలుబదిసంవత్సరములు వయస్సుగల వితంతువు (బీబీఖదీజా) ను పెండ్లిచేసికొనిరి. కావున బీబీఆయిషాను పెండ్లియాడుట ముఖ్యధర్మములను ప్రచురించుటకే గాని మఱి యితరోద్దేశము గాదని చదువరులు గ్రహింతురు గాక!

## —: మదీనాపట్టణములో ఇస్లాము వ్యాపించుట. :—

మదీనాపట్టణము మక్కాపురమునుండి 300 మైళ్లదూరములో నున్నది. అచట "ఔసు, ఖజ్‌రజు" అను కుటుంబములు గలవు. వారు యమనుదేశమునుండి సైలెలఅరిమ్‌అను నీళ్ల ప్రమాదముచే తమజన్మదేశము విడిచి మదీనాపురమువచ్చి చేరిరి. ఇస్లామునకు పూర్వము మదీనాపేరు 'యస్‌రిబు'. వారు చాలకాలమునుండి అచట నివసించుచుండిరి. వారు చాల కాలము వఱకు ఐకమత్యము కలిగియుండిరి. కాని తుదకు

అరబ్బులలో వలె వారిలోకూడ ద్వేషములుపుట్టి యుద్ధములు జరుగుచుండెను. వారుమదీనాపురము చేరకముందు యూదులు అచట పూర్వమునుండి నివసించుచుండిరి. తుదకు బుఆసు అను యుద్ధము జరిగి 'ఔసు, ఖజ్రజు' వారిబలము తగ్గిపోయెను. పైగంబరులవారు మక్కాపురములో బోధచేయుచుండిన కాలమున ఔసుకుటుంబమువారు ఖజ్రజ్వారి వల్లనోడిపోయి ఖురైషులసహాయము కోరుటకై వారు మక్కాపట్టణమునకు వచ్చిరి. ఆవిషయము పైగంబరులవారికి తెలిసి వారికిబోధించుటకై వారియొద్దకుపోయి ఖురానెషరీఫును చదివి వినిపించిరి. ఔసులో అయాసు అనునతఁడు ఖురానెషరీఫును విని తన వారితో నిట్లుచెప్పెను. "మీరువచ్చిన పనికన్న ఇస్లాము స్వీకరణము చాలశ్రేష్ఠమైనది." అది విని వారినాయకుఁడగు అబుల్హైసు" మేము దీనికొఱకు రాలేదు. ఊరకుండు"మని మందలించెను. అయాసు పైగంబరులవారు మదీనాపురమునకు పోయి చేరుటకుముందే చనిపోయెను. అతనివల్ల మదీనాలో పైగంబరులవారినిగూర్చి కొంతవఱకు ప్రజలకు తెలిసెను.

ప్రవక్తపదవి లభించిన పదునొకొండవయేఁట కాబాయాత్ర కాలమున పైగంబరులవారు తమవాడుకచొప్పున మక్కాపట్టణమునకు కొన్నిమైళ్లదూరమున ఒకరాత్రి చీఁకటిలో అఖబా అనుచోట ఆఱుగురు కలిసి మాట్లాడు చుండఁగ విని వారినిసమీపించి ఇస్లామును బోధించిరి. అచట నున్నవారు మదీనాపురనివాసులు. ఖజ్రజ్వంశస్థులు. పూర్వమునుండి వారి ఇరుగుపొరుగున నున్న యూదులు రాఁబోవు ప్రవక్తను గూర్చి చెప్పుచుండఁగ వారు వినియుండిరి.

అందుచే వీరే యూదులుచెప్పు ప్రవక్తలని నిశ్చయించుకొని వారు ముసల్మానులైరి. వారు తమదేశమునకుబోయి ఇస్లామును గూర్చి బోధింపసాగిరి. అది జరిగిన రెండవయేట మదీనానుండి పండ్రెండుమంది సర్దార్లు మక్కాపురమునకు వచ్చి అఖబా యనుచోటున కూడి పైగంబరులవారికిశిష్యులై ఇట్లు శపథము చేసిరి. "మేము ఒక్కదేవునిమాత్రమే పూజించెదము. అతనికి సాటి కల్పింపము. దొంగతనమును వ్యభిచారమును ఎన్నడును చేయము. మా ఆడుబిడ్డలను వధింపము. ఎవ్వనిపైనను అపనింద మోపము. అబద్ధము పలుకము. ఎవ్వనిపైనను చాడీలు చెప్పము. పైగంబరులవారి ధర్మోపదేశము ననుసరింతుము.' అట్లు మదీనావారు ముసల్మానులై శపథముచేసి మరలి తమయూరికి పోవునప్పుడు ఖురానెషరీపును ఇస్లాముధర్మములను నేర్పుటకై 'ముసెయిబ్ బిన్ ఉమైరు'ను పైగంబరులవారు మదీనాపురమునకు పంపిరి. 'ముసెయిబు'గారు మదీనా చేరి ప్రజలకు ఇస్లామును బోధించుచుండిరి. వారిబోధచే పెక్కురు ముసల్మానులైరి. అందుచే ముసెయిబు పోయిచేరిన రెండవ యేట 62 మంది ఖజ్‌రజ్ కుటుంబమువారును పదునొకండుగురు ఔసువంశమువారును ఇద్దఱుస్త్రీలును కాబాయాత్రికులతో కూడివచ్చిరి. అపుడు రహస్యముగా పైగంబరులవారును వారిపినతండ్రియగు అబ్బాసును (వీరింతవఱకును ముసల్మానులు కాలేదు) అఖబా అనుచోటున మదీనానుండివచ్చిన 75 మందితో నొకరాత్రికలిసి వారికిబోధించిరి. మదీనావారు పైగంబరులవారిని మక్కావిడిచి మదీనాపురమునకు రమ్మని విన్నవించిరి. అపుడు పైగంబరులవారు "నేను మీదేశమునకు

వచ్చినచో నన్ను నాశిష్యులను మీరు మీకుటుంబములనవలె రక్షింపవలెను" అని పలికిరి. అపుడు మదీనావారు "అట్లే చేయుదుము. మాకేమి ప్రతిఫలము దొరకును?" అని అడిగిరి. "దేవుఁడు సంతసించును. మీకు స్వర్గపుణ్యములు లభించును" అని పైగంబరులవారు బదులుచెప్పిరి. అంత మదీనావారు "మమ్ము విడిచి మీజన్మదేశమునకు పోరుగదా!" అని పలికిరి. అపుడు పైగంబరులవారు "నాజీవితకాలమంతయు మీతోనేయుందును"అని పలికిరి. ఆసమయములో అబ్బాసు మదీనావారినిట్లు హెచ్చరించెను. మీరు పైగంబరులవారిని తీసికొనిపోఁదలఁచుచున్నారు. వారికివిరోధులు పెక్కురు గలరు. బాగుగా నాలోచించి నిశ్చయించుకొనుఁడు. ఇచ్చట పైగంబరులవారిబంధువులు వారి ప్రాణరక్షణచేయుచున్నారు. అది విని మదీనావారు "మేమన్నివిషయములకు సిద్ధమై వచ్చినాము" అనిచెప్పిరి. అట్లువారు పైగంబరులవారి యుపదేశము పొందిరి. పిమ్మట పైగంబరులవారు 12 మందిని నఖీబు (నాయకబోధకు) లుగా నియమించి ఏసుక్రీస్తు ప్రవక్తగారి 12 మంది శిష్యులవలె మీరును నాశిష్యులు (నఖీబులు.) మీరు మదీనాలో ఇస్లాము బోధచేయవలెను. దాని వృద్ధికొఱకు పాటుపడవలెను అని ఉపదేశించిరి. తరువాత అందఱు తమతమ నివాసములు చేరిరి. ఆసమాచారము ఖురైషులకు తెలిసి ఉదయమే మదీనావారిని వెదుకసాగిరి. మదీనావారు అప్పటికే పయనమై పోయియుండిరి. కాని సాదుబిన్ ఉబాదా (పంద్రెండుగురు బోధకులలో ఒకరు) ఖురైషులకు చిక్కిరి. ఆ దుష్టులు వారిని బంధించి కాబామసీదునొద్ద కొట్టసాగిరి.

వెన్నెదికిలి నడుము కట్టెను. అట్లు వారు కష్టపెట్టుచుండగా ఒకడు వచ్చి "ఖురైషులలో నెవ్వరితోనైన నీకు పరిచయ మున్నదా?" అని యడిగెను. అప్పుడు "జుబైరుబిన్ ముత్ యిమ్ హారిసుబిన్ ఉమయ్యా అనువారు నాకు పరిచితులు. వారికి నేను ఉపకారము చేసియున్నాను. వారిప్పుడు నాకు తోడు పడవలెను నాకు" అని చెప్పెను. అది విని యొకమనుష్యుడు పోయి ఆవృత్తాంతము వారిద్దరికి తెలిపెను. వారువచ్చి ఖురైషులనుండి విడిపించిరి. నాడు అక్లిష్టములు పడియు భక్తి విశ్వాసములు విడువక స్థిరముగా నుండి మదీనాకు మరలి పోయెను. అట్టి భక్తి విశ్వాసములకు ఇస్లాము మహిమయే కారణము.

అట్లు మదీనానగరములో ఇస్లాము వృద్ధి యగుచుండెను. పైగంబరులవారు మక్కాలో నుండిన శిష్యులకు మదీనాకు పోవచ్చునని సెలవొసంగిరి. భక్తులు మదీనాపురమునకు పోసాగిరి. అది ఖురైషులకు దెలిసి పోవువారికి పలు విధములైన ఆటంకములు చేయసాగిరి.

—: సుహైబు రూమీ :—

'సుహైబురూమీ' అనువారు మక్కాపురము విడిచి పోవుటకు సిద్ధమైరి. కాని ఖురైషులు వారిని చుట్టుకొని "నీవు ఇచ్చటికి వచ్చినపుడు నిఱుపేదగా నుంటివి. ఇచ్చట చాల ధనము సంపాదించితివి. నీవు ధనము తీసికొని పోవుటకు వీలు కాదు", అని చెప్పిరి. అప్పుడు సుహైబు "నాసొత్తంతయు విడిచి పోదును"అని చెప్పగా "అట్లైనచో పోవచ్చు"నని చెప్పి వారిసొత్తంతయు లాగుకొనిరి. సుహైబుగారు భక్తి

రక్షణకై తాము కష్టపడి సంపాదించిన సొత్తును దుష్టుల
పాలుచేసి మదీనాపురము పోయిచేరిరి.

—:అబూసల్మా:—

హజ్రత్ అబూసల్మా తమభార్యబిడ్డలతో మదీనాపురమునకు పోవుటకై సిద్ధమైరి. ఒంటెమీద భార్యయగు ఉమ్మెసల్మానుఁ గూర్చుండఁబెట్టిరి. బిడ్డయగుసల్మా తల్లిఒడిలో నుండెను. వారు పోవుటకు సిద్ధమైన సంగతి వారిబంధువులకుఁ దెలిసి వారిని చుట్టుకొనిరి. ఉమ్మెసల్మాయొక్క బంధువులామెను పోనీయక తమయింటికి లాగుకొనిపోయిరి. అబూసల్మాయొక్క బంధువులు ఉమ్మెసల్మాఒడిలో నున్నబిడ్డను లాగుకొని తమయింటికిఁ గొనిపోయిరి. అట్లు అబూసల్మాగారు తమ బంధువులు చేసిన దౌర్జన్యము నోర్చుకొని భార్యబిడ్డలను విడనాడి ఒంటరిగానే మక్కావిడిచి మదీనా చేరిరి. ఉమ్మెసల్మాగారు తమబిడ్డను భర్తను వీడిపోయి చాల దుఃఖించుచు వారువీడిపోయిన చోటునకు వచ్చి ప్రతిదినము ఏడ్చుచుండిరి.

అట్లు ఒకసంవత్సరము కన్న నెక్కువ గడచెను. ఒక దినము వారట్లు దుఃఖించుచుండ వారిచిన్నాయన కుమార్లలో ఒకఁడువచ్చి వారిపై కనికరించి తనబంధువులకు సలహాచెప్పి వారిబిడ్డను ఇప్పించి మదీనాపురమునకు పోవునట్లు చేసెను. ఉమ్మెసల్మా మహాధైర్యముతో నొంటరిగా తమబిడ్డను తీసికొని ఒంటెనెక్కి మదీనాకు వచ్చిచేరిరి. దుష్టులు పెట్టినకష్టములు చూడుఁడు! ఆభక్తులభక్తిస్థిరత్వము చూడుఁడు! దుష్టులైన ఖురైషులు తమ బంధువులైన భక్తులను మక్కావిడిచి మదీనాపురమునకు పోవుదారిలో అడ్డగించుచు పలువిధములైన తీవ్రబాధలు పెట్టుచుండిరి.

సిన వారు దండెత్తివచ్చి విడిపించుకొని పోవుదురు" అనెను అపుడు మఱొకఁడు మక్కాపురమునుండి వెళ్లఁగొట్టిన చాలును. అనిచెప్పెను. అదివిని యావృద్ధుఁడు "ఆయాలోచన సరి కాదు. ముహామ్మదువారు ఎచ్చటికిపోవుదురో అచటివా రత నికి లోఁబడుదురనుమాట మీకుఁ దెలియదా?" అనిపలికెను. అపుడు దుష్టనాయకుఁడైన అబూజెహాలు లేచి నేనుచెప్పు సల హా వినుఁడు. ప్రతికుటుంబము నుండి ఒకవీరునిఎన్నుకొనవలె ను. ఆవీరులందఱు ఖడ్గములు పూని ముహామ్మదుగృహా మును ముట్టడించి అతఁడు బయటికి వచ్చినపుడే ఒక్కపెట్టున అందఱు నతనిపైఁబడి వధింపవలెను. అట్లుచేసిన ముహామ్మదు కుటుంబమువారు ఎవ్వనిపై హత్యాదోషము మోపఁగలరు? విధిలేక వారు హత్యాపరాధము మాత్రము తీసికొనుటకు సమ్మతింతురు. కావున ఎట్టి యాందోళమును సంభవింపదు. మేము కోరినదియు సులభముగా నెఱవేఱును". అనిచెప్పఁగా సభవారందఱు అట్లు చేయుటకై సమ్మతించిరి.

—: పైగంబరులవారు మక్కాపురము నువీడుట :—

ఖురైషులు చేసికొన్న తీర్మానమును దేవుఁడు పైగంబరులవారికిఁ దెలిపి మక్కావిడిచి మదీనాపురమునకుఁ బోవల సినదని సెలవిచ్చెను. అపుడే పైగంబరులవారు మిట్టమధ్యా హ్నము తమ ప్రియశిష్యులైన అబూబకరుగారి గృహామునకు పోయి తలుపుతట్టిరి. అబూబకరుగారు తొందరపాటుతో వచ్చి తలుపు తెఱచి లోపలికిఁగొనిపోయి ఎండలోదయచేసితిరే ఏమి సెలవు? అనివిన్నవించిరి. అపుడు పైగంబరులవారు మక్కావిడిచి మదీనాకు పోవుటకై దేవునాజ్ఞ యైనది. నేను పోవుదును. అని

బదులు చెప్పిరి అప్పుడు "మీతోనే వచ్చుటకు నాకుకూడ సెలవున్నదా?" అని అబూబకరుగారు అడిగిరి. "రావచ్చును" అని పైగంబరులవారు పలికిరి. అదివిన్నంతనే మహాసంతోషము తో "ఓమహానుభావా! యీనాటికై రెండు ఒంటెలు మేపియున్నాను. అవి ప్రయాణమునకు చాలనేర్పుగా పోగలవు. మీరు ఒకటి కానుకగా తీసికొనవలెను". అని అబూబకరు చెప్పగా "అట్లైన దానివెల చెల్లింతును". అని పైగంబరులవారు చెప్పిరి. ఆరాత్రియే ప్రయాణమగుటకు వారు నిశ్చయించుకొనిరి. అబూబకరు కుమార్తెయగు 'బీబీఅస్మా' ప్రయాణమునకొఱకు ఆహారములు సిద్ధపఱచెను. పైగంబరులవారు అబూబకరును విడిచి తమగృహమునకు వచ్చి చేరిరి. పైగంబరులవారియొద్ద మక్కావారు స్నేహితులేమి విరోధులేమి తమతమ వస్తువులను అమానతుగా నుంచుచుండిరి. పైగంబరులవారు మక్కానువిడిచిపోవుటకు సిద్ధమైన రాత్రి సాయంకాలము నుండియే ఖురైషులు పైగంబరులవారి గృహమును చుట్టుకొనిరి. స్త్రీలున్న గృహములో ప్రవేశించుట అప్పుడుకూడ తప్పుగా నుండెను. అందుచే ఖురైషులు పైగంబరులవారి గృహము చుట్టియుండి వారు నమాజు కొఱకు బయిటికి వచ్చునపుడు వధింపవలెనని వేచియుండిరి. అట్లు దుష్టులు గృహమును ముట్టడించియున్నపుడు పైగంబరులవారు హజరత్ అలీగారిని పిలిచి తమయొద్దనున్న అమానతుసొత్తులను సొత్తులవారికి నొప్పగించవలెనని యొప్పగించుచుండిరి. ఆసొత్తులలో ముట్టడించియున్న కొందఱుఖురైషులవి కూడనుండెను. చూడుడు పైగంబరులవారి యందున్న అమానతుభావము! మఱిదుష్టులు చేయుచున్న అపకారము!

అట్లు ఖురైషులు గృహమును చుట్టుముట్టి యుండఁగా పైగంబరులవారు తమపడకపై హజరత్ అలీగారిని దుప్పటి కప్పుకొని పరుండుటకై ఆజ్ఞాపించిరి. హజరత్ అలీగారి ధైర్యమును భక్తి విశ్వాసములును చూడుఁడు! ప్రాణభీతిలేకయే పైగంబరుల వారిదుప్పటి కప్పుకొని వారు పరుండిరి. పైగంబరులవారు చాల రాత్రి గడచినపిదప గృహమునుండి బయటికి వెడలిరి. దైవవిధిచే దుష్టులందఱు గాఢనిద్రలో మునింగియుండిరి. పైగంబరులవారు సూరెయాసీను పఠించుచు ఒకపిడికెఁడు మన్ను తీసికొని దుష్టులపై విసరి యెట్టితొందర లేకయే దుష్టుల కుట్రనుండి తప్పించుకొని యూరికిబయటచేరిరి. ఆఖురైషుదుష్టు లదిగ్రహింపలేక పోయిరి. ఊరికిబయట హజరత్ అబూబకరు వేచియుండిరి. అచటనుండి బయలుదేఱి రాత్రిచీఁకటిలో మార్గమందు ముండ్లురాళ్లు తగులుచుండ మూఁడుమైళ్లదూరము నుండిన 'సౌరు' అనుకొండగుహలో దాఁగిరి.

—: పైగంబరులవారు సౌరు అను గుహలో నుండుట :—

దుష్టులు పైగంబరులవారి గృహముచుట్టు తెల్లవాఱు వఱకు పడియుండిరి. తెల్లవాఱగనే హజరత్ అలీ మేలుకొని బయటికి వచ్చిరి. ఖురైషులు వారినిచూచి ముహమ్మదు ఎక్కడ? అనిప్రశ్నింపఁగా "నాకేమి యెఱుక! నేను కావలియుంటినా?" అని బదులు చెప్పిరి. అపుడు ఖురైషులు చాల కుపితులై హజరత్ అలీగారిని పట్టుకొని కాబాయొద్దకు తీసికొనిపోయి చెడఁబడఁదిట్టి కొట్టి తుదకు వదలిపెట్టిరి. వారిని వదలిపెట్టి ఖురైషులు హజరత్ అబూబకరుగారి గృహమునకు పోయి తలుపు తట్టిరి. అబూబకరు కుమార్తె అస్మా బయటికి

రాత్రి ఒంటెలనెక్కి వారు మదీనాపురమునకు మఱుఁగుదారిని క్రీ. శ. 16-9-622 సోమవారము పయనమైరి. దారి చూపుటకు అబ్దుల్లాబిన్ అరీఖతును ఏర్పఱచుకొనిరి. అతఁడు మార్గము చూపుచుండెను. అట్లు ఒకదినము రాత్రిపయనమై పోవుచు ఒకచోట బసచేసిరి. అచట పెద్దరాతిక్రింద నీడలో పైగంబరులవారు శయనించిరి. అంతలో అబూబకరుగారు మేఁకపాలు తీసికొనివచ్చి పైగంబరులవారు మేలుకొనిన పిదప త్రాగనిచ్చిరి. అలసట తీర్చుకొన్న పిదప వారు పయనమై పోవుచు ఉమ్మెమాబద్ అనునామె గుడారమును సమీపించిరి.

— :ఉమ్మెమాబద్.: —

ఉమ్మెమాబదు ప్రయాణికులకు ఆతిథ్యము చేయుచుండెను. అప్పుడామెయొద్ద నేమియు లేకుండెను. ఒక బక్కచిక్కినమేఁక మూల నిలిచియుండెను. పైగంబరులవారు దానిచూచి "ఏమిమేఁక మందతో పోలేదే" అని అడుగఁగా "నడువలేదుగాన పోలేదు" అని ఉమ్మెమాబదు బదులు చెప్పెను. "దానిలో పాలున్నవా" యని పైగంబరులవారు అడిగిరి. "ఉన్నచో పితుకుకొనుఁడు" అనియామె బదులు చెప్పెను. అది విని పైగంబరులవారు తమచేతులార "బిస్మిల్లా" అని పితుకసాగిరి. పాత్ర నిండిపోయెను. అందఱు త్రాగిరి. తిరిగి రెండవతూరి పితుకఁగా పాత్రనిండిపోయెను. దానిని కూడ అందఱు త్రాగిరి. మూఁడవతూరి పితుకఁగా పాత్రనిండిపోయెను. ఆపాలు ఉమ్మెమాబదు కొఱకు విడిచిపెట్టి పైగంబరులవారు అచటనుండి పయనమైరి. కొంతసేప

టికి 'ఉమ్మెమాబదు' యొక్కడొక్కడు వచ్చి "వారు ఎక్కడి వి?" అని ప్రశ్నించెను. అప్పుడామె పైగంబరులవారి వృత్తాంత మంతయును తెలిపి వారినిరక్షించెను. అది విని అతడు వారివర్తనము లభించియుండిన బాగుండునేయని చింతించెను. తుదకు వారిద్దఱు పైగంబరులవారిని మదీనాలో దర్శించి ముసల్మానులైరి.

—: సు రా ఖా :—

పైగంబరులవారు పోవుచుండగ సురాఖా అనునతడు ఖురైషులు ప్రకటించిన బహుమానపు ప్రకటన విని వేగాన తో పైగంబరులవారిని వెదకుచు పోయి తుదకు సమీపించెను. అప్పుడు వానిగుఱ్ఱము రెండుమూడుతూర్లు పడిపోయి, తుదకు మోకాళ్లవఱకు భూమిలో కూరుకుపోయెను. అపుడు సురాఖా తనగుఱ్ఱముయొక్కగతి చూచి పైగంబరుల వారిసమ్ముఖమునకు వచ్చి క్షమింపుడని వేడుకొనెను. అపుడు పైగంబరులవారు తమ్ము పట్టుటకు వచ్చినశత్రువును కనికరించి క్షమించిరి. అపుడు సురాఖా "నాకు అభయపత్రము ఇచ్చి అనుగ్రహింపుడు." అనివిన్నవించెను. పైగంబరులవారి వెంట నున్న ఆమిర్ బిన్ ఫహీరా అనుఅబూబకరుయొక్క బానిస చర్మపుతునకలో వ్రాసియిచ్చెను. తుదకు ఆసురాఖా మక్కా నగరమును పైగంబరులవారు జయించిన పిదప ముసల్మానుడాయెను.

—: బు రై దా ఇ స్లా ము లో చే రు ట :—

పైగంబరులవారు మదీనాపురము సమీపించిరి. మార్గమందు బురైదా అనునతడు 70మందిని వెంటతీసికొని

ఖురైషులు ప్రకటించిన నందఒంటెలబహుమానము పొందవలెననుఆశతో పైగంబరులవారిని ముట్టడించి సంభాషించెను. పైగంబరులవారి మృదువైన ధర్మవాక్కులు విని బురైదా పరవశుడై తన70మందిపరివారముతో ఇస్లాములో చేరెను.

—: జుబైరు కానుక లిచ్చుట :—

పైగంబరులవారికి మార్గమందు జుబైరుబిన్ అవామ అనువారు సిరియా నుండి సామాను తీసికొనివచ్చుచు దర్శించిరి. వారు పైగంబరులవారికిని అబూబకరువారికిని కొన్ని విలువైన వస్త్రములు కానుకగా నొసంగిరి. వానివలన ప్రయాణమందు చాలసౌకర్యము కలిగెను.

—: ఖుబాపుర ప్రవేశము :—

పైగంబరులవారు వచ్చుచున్నారనువార్త మదీనాపుర నివాసులకు ముందుగానే తెలిసియుండెను. ప్రతిదినము మధ్యాహ్నమువఱకు మదీనాలో నుండుభక్తులు పురమునకుబయట వచ్చి వేచియుండిరి. అట్లు వేచివేచి పోవుచుండిరి. ఒకదినము భక్తులు మధ్యాహ్నమువఱకు నెదురుచూచి రాలేదేఅనుచింతతో తిరిగిపోయిరి. అట్లు పోయిన పిదప ఒకయూదుడు కోట మీాద నుండి చూచి "ఓముసల్మానులారా! మీారెవరిని ఎదురు చూచుచున్నారో వారదిగో వచ్చుచున్నారు." అనిపలికెను. అదివిని ముసల్మానులందఱు మహాసంతోషముతో పైగంబరులవారికి నెదురుపోయిరి. మదీనాకు మూడుమైళ్ల దూరమున ఖుబాఅనుగ్రామము గలదు. అందు పైగంబరులవారు క్రీ. శ. 23–9–622, (8 రబీఉల్ అవ్వల్, ప్రవక్తపదవి లభించిన 13వయేట) ప్రవేశించిరి. ఆగ్రామములో అన్సారీలయొక్క పె

కష్టకరము పనులు గలవు. పైగంబరులవారు వచ్చినంతనే అన్సారులవారు మహాసంతోషముతో 'అల్లాహు అక్బరు' అని చెప్పసాగిరి. పైగంబరులవారు "ఖుబా"లో 14 దినములు వు[illegible] ఇస్లామికశాసనము ఆనాటి[illegible] [illegible] కాలమున నమాజు చేయుటకై ఒకమసీదు కట్టించిరి. మసీదు కట్టించునపుడు పైగంబరులవారును పనిచేయువారితో కలిసి పనిచేయుచు పెద్దపెద్దరాళ్లనెత్తుకొని మోయుచుండిరి. అది చూచి శిష్యులు "మీరుపనులుమాను మేముచేయుదము" అని విన్నవించుచుండిరి. వారివిన్నపము వినుచు నారు. గాని పనిచేయుచుండిరి. హజరత్ అలీగారు అమానతుపాత్రులైన యజమానులకు అప్పగించి కొద్దిదినములలోనే వచ్చి ఖుబాలో పైగంబరులవారితో కలిసికొనిరి.

—: పైగంబరులవారు మదీనాపురము చేరుట :—

14 దినములు ఖుబాలో నివసించి శుక్రవారమునాడు పైగంబరులవారు మదీనాపురములో ప్రవేశించిరి. మార్గమందు బనీసాలిమువారి యిండ్లకొండ్డకుపోవునటికి జుమానమాజు చేయువేళ యాయెను. అచటనే పైగంబరులవారు శిష్యులతో కలిసి నమాజుచేసిరి. నమాజునకు ముందు పైగంబరులవారు గొప్ప యుపన్యాసము (ఖుత్బా) ఇచ్చిరి. నమాజు ముగిసిన పిదప మహావైభవముతో మదీనాపురము చేరిరి. భక్తులు గుంపులు గుంపులుగా దర్శించుటకు వచ్చుచుండిరి. ఆడుబిడ్డలు మహా సంతోషముతో "విదాకోలుకొండల నుండి పూర్ణచంద్రుడు ఉదయించెను. మేము దేవునియొక్క కృతజ్ఞత చెల్లింపవలెను" అను కీర్తనలు పాడుచుండిరి. యూదులు పైగంబరులవారు

ప్రవేశించునపుడు జరిగిన వైభవము చూచి హాబ్ ఖూకు ప్రవక్త గ్రంథము 3:3 "దేవుఁడు తేమానులోనుండిబ యలుదేఱు చున్నాడు. పరిశుద్ధదేవుఁడు పారానులోనుండి వేంచేయుచు న్నాఁడు. ఆయనమహిమ ఆకాశమండలమంతటను కన పడు చున్నది. భూమి ఆయన ప్రభావముతో నిండియున్నది." అను వాక్యము అన్వయించుచున్నదని నిశ్చయించిరి. పైగంబరుల వారు ఒంటెనెక్కి వీథులలో పోవుచుండఁగా ప్రతిభక్తుఁడు వచ్చి "నాయింటిలో దిగుఁడు నాయింటిలో దిగుఁడు" అని విన్నవించుచుండెను. అది విని పైగంబరులవారు నాఒంటె యెక్కడ పరుండునో అచటి యింటిలో బసచేయుదునని చెప్పిరి. దైవవిధిగా ఒంటె 'అబూఅయ్యూబుఅన్సారీ' వారి మేడయొద్ద పరుండెను. పైగంబరులవారు దర్శించుటకై వచ్చువారి సౌకర్యములకై యామేడ క్రింది భాగమున బసచేసిరి. అబూఅయ్యూబు అన్సారీగారు పైగంబరులవారి తాత అబ్దుల్ ముత్తలిబుయొక్క మేనమామగారి వంశస్థులు. అందుచే వారికి చాల సంతోషము కలిగెను. పైగంబరులవారచట 7 నెలల వఱకు బసచేసిరి. ఆమధ్యకాలములో మసీదు కట్టింపఁ బడెను. దానినే 'మస్ జెదేనబవీ' అనుదురు. దానిప్రక్కనే పైగంబరులవారుండుటకు గదులు కట్టింపఁబడెను. మసీదు గదుల కట్టడము పూర్తియైనపిదప పైగంబరులవారు అబూ అయ్యూబు గారి గృహమును విడిచిపెట్టి యాగదులలో నివసించిరి.

### పైగంబరులవారిగృహస్థులు మదీనాపురమునకు వచ్చుట.

పైగంబరులవారు మక్కాలోనుండిన తమకుటుంబ

మును తీసికొనివచ్చుటకు జైదుగారిచేత రెండు ఒంటెలు కొంత పైకము నిచ్చి పంపిరి. వారివెంబడి అబూబకరుగారియొక్క కుమారులగు అబ్దుల్లాగారు పోయిరి. జైదుమక్కాచేరి బీబీ ఫాతిమా (పైగంబరులవారి కుమార్తె)ను, బీబీసౌదా (పైగంబరులవారి భార్య)ను మదీనాపురమునకు పిలుచుకొని వచ్చెను. బీబీ ఆయిషాగారు (పైగంబరులవారి భార్య) తమయన్నగారి వెంట మదీనాపురమువచ్చిచేరిరి.

—:హిజ్రీ శకము.:—

పైగంబరులవారు మక్కాపురమును విడిచి మదీనా పురమునకు వచ్చి చేరినదినమునుండి హిజ్రీ సంవత్సర మేర్పడెను. కావున ఇక జరుగు వృత్తాంతములు హిజ్రీ సంవత్సరము ననుసరించి వ్రాయబడును. పైగంబరులవారు ప్రవక్త పదవి లభించిన పిదప 13 సంవత్సరములవరకు, మక్కాపురములో బోధచేయుచుండిరి. వారికి మదీనా చేరునప్పటికి 53 సంవత్సరముల వయస్సు.

హిజ్రీ మొదటి సంవత్సరము.

—:మసీదు కట్టడము.:—

పైగంబరులవారు అబూఅయ్యూబుగారి గృహములో నుండుదినములలో పశువుల కొట్టమందు నమాజు చేయుచుండిరి. దినదినము భక్తుల సంఖ్య వృద్ధిపొందుచుండెను. అందుకుగాడి నమాజు చేయుటకు ప్రత్యేకముగ గృహము లేకుండెను. వారున్న గృహమునకు సమీపమున ఒక బీడుస్థలముండెను. అది తండ్రిలేని యిద్దరు బిడ్డలది. వారిద్దరు భూమిని ఉచితముగా నిత్తుమని విన్నవించిరి. కాని పైగంబరులవారు దానికి సమ్మ

తింపక వెలకుఁ దీసికొనిరి. భూమిలోనున్న ఖర్జూరపుచెట్లు నఱికి భూమిని చదరముగాఁ జేసి మసీదు కట్టించుటకు పూనిరి. శిష్యులతోఁ గూడి పైగంబరులవారును రాళ్లనెతుకొని వచ్చుచు మసీదుగోడల కట్టుచుండిరి. మసీదు కట్టునపుడు "అల్లాహుమ్మ-లాఖైర యిల్లాఖైరల్-ఆఖిరా. ఫగ్-ఫిరల్-అన్సారవల్ ముహాజిర" ఓదేవా! పరలోక గమనమే మోక్షము! ఓదేవా అన్సారీలను ముహాజిరులను అనుగ్రహించి క్షమింపుము అని పాడుచుండిరి. (మదీనాపురములో పైగంబరులవారికిని మక్కాపురమునుండివచ్చిన ముసల్మానులకును సహాయముచేసినవారు అన్సారీ లనఁబడుదురు. మక్కాపురము విడిచి మదీనాపట్టణమునకు వచ్చిన ముసల్మానులకు ముహాజిరులు అని పేరు). మసీదు కట్టడము సామాన్యమైనదియే. గోడలు పచ్చియిటికరాళ్లవి. ఖర్జూరపు స్తంభములు. ఖర్జూరపుటాకుల పందిరి. వాన కురిసిన ఉఱిసి నీళ్లంతయు లోపలఁబడి బురద అగుచుండెను. అందుచే నేలపై గులకఱాలు పఱచిరి. మసీదు ప్రక్కన ఒకతిన్నె కట్టించిరి. అచ్చట యిల్లువాకిలి లేని భక్తులు బసచేయుచుండిరి. మసీదుకట్టడము పూర్తియైన పిదప దానిప్రక్కన కొన్నిగదులు పైగంబరులవారి స్త్రీలకొఱకు కట్టించిరి. ఆగదులుకూడ సామాన్యమైనవి. పచ్చియిటికరాళ్లగోడలు గలవి. ఆఱు ఏడుమూరల వెడల్పును పదిమూరల పొడవును గలవి. ద్వారములకు కంబళ్లు పర్దాలు విడువఁబడియుండెను. గదులు తయారైనపిదప పైగంబరులవారు అబూ అయ్యూబు గృహమునుండి యాగదులలో బసచేసిరి. ఇరుగు పొరుగుననున్న అన్సారీలు

వాని వాక్యములలో ఇస్లాముయొక్క ముఖ్యాంశములు ప్రకటింపఁబడును.

—: అజాను వాక్యములు. :—

అల్లాహుఅక్బరు (అల్లాసర్వాధికారుఁడు) అనినాలుగు తూర్లు చెప్పవలెను. అష్హాదు- అల్లాయిలాహాఇల్లల్లాహు (అల్లా ఒక్కఁడేయని నేను సాక్ష్యమిచ్చుచున్నాను.) అని రెండుమార్లు చెప్పవలెను. అష్హాదు అన్న ముహామ్మదర్ రసూలుల్లాహ్ (ముహామ్మదువారు దేవుని ప్రవక్తయని నేను సాక్ష్యమిచ్చుచున్నాను.) అని రెండుతూర్లు చెప్పవలెను. హాయ్యా అలస్సలాత్ (నమాజుకొఱకు రండు) అని రెండు పర్యాయములు చెప్పవలెను. హాయ్యా అలల్ ఫలాహ్ (మోక్షము పొందుటకు రండు) అని రెండుతూర్లు చెప్పవలెను. అల్లాహుఅక్బరు (అల్లా సర్వాధికారుఁడు) అని రెండుతూర్లు చెప్పవలెను. లాఇలాహా-ఇల్లల్లాహు (అల్లా తప్ప నితరదైవములేదు.) అనిచెప్పి ముగింపవలెను.

ముసల్మానులు ఇప్పటివఱకు రెండురకాతులు (నమాజులోని భాగము) చేయుచుండిరి. ప్రయాణములో నున్నపుడు రెండు రకాతులు జరుపవలెను. ప్రయాణికులు కానివారు నాలుగురకాతుల నమాజు చేయువలెనని విధింపబఁడెను.

—: సోదరత్వము. :—

మక్కాపురము విడిచి మదీనాపురమునకు వచ్చిన ముసల్మానులకొఱకు మదీనాలో నివసించుటకు గృహాము

లును జీవనోపాయములును కావలసియుండెను. వారికొఱకు పైగంబరులవారు మదీనాలోనుండు అన్సారీలను పిలిచి “మక్కా నుండివచ్చినమహాజర్లు మీసహోదరులు. మీరు వారిని భరింపవలెను.” అని ఉపదేశించి ప్రతిఒక్క అన్సారీకి ఒక్కొక్క మహాజరు నొప్పగించిరి. అన్సారులు మహా సంతోషముతో సమ్మతించి మహాజరు సహోదరులను గృహ ములకుఁ దీసికొనిపోయి తమ ఆస్తిలో సగభాగము నొసంగిరి. ఒకతల్లికిఁబుట్టిన సహోదరులలో నుండునట్టి ప్రేమకంటె వారికి నెక్కుడుప్రేమ కలిగెను. అల్లకలుగుటకు ఇస్లాము మహిమయే గదాకారణము! తరువాత కొందఱు మహాజర్లు వ్యాపారము చేయుటకు ప్రారంభించిరి. ఆవ్యాపారములోనే వారికి చాల ధనము లభించెను. అట్లు మదీనావారు మక్కానుండి వచ్చిన వారికి తోడ్పడుటచే వారికి అన్సారులు (సహాయులు) అను బిరుదు కలిగెను.

—:అబ్దుల్లా బిన్ సలాము ఇస్లాములో చేరుట:—

అబ్దుల్లాబిన్ సలాము యూదులలో గొప్ప పండితుఁడు. గొప్పవంశములో పుట్టినవాఁడు. అతఁడు రాఁబోవు ఆఖరు ప్రవక్తను గూర్చి పూర్వమతగ్రంథములలో చదివియుండెను. హజ్రత్ పైగంబరులవారు మదీనాకు వచ్చిచేరిన విషయము అతనికితెలిసి పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చి “నేను కొన్నివిషయముల నడుగుదును. వానిఁ గూర్చి ప్రవక్తలు మాత్రమే చెప్పగలరు” అని విన్నవించెను. అతఁడడిగిన విషయములకు పైగంబరులవారు సమాధానము చెప్పిరి. అదివిని అబ్దుల్లాబిన్ సలాము ఇస్లామును స్వీకరించెను. “ఈవిష

యము [illegible] తెలియకమునుపే వారినిరప్పించి నన్ను గూర్చిఅడుగుఁడు” అని అబ్దుల్లాబిన్ సలాము పైగంబరులవారితో విన్నవించెను. పైగంబరులవారు సరేయని యూదులపెద్దలను రప్పించి అబ్దుల్లాబిన్ సలామునుగూర్చి యడిగిరి. ఆసమయమున అబ్దుల్లాబిన్ సలాము చాటున దాఁగియుండి వారిసంభాషణ వినుచుండెను. పైగంబరులవారు యూదులతో నిట్లు ప్రశ్నించిరి. మీకులములో అబ్దుల్లాబిన్ సలాము ఎట్టి గౌరవముగలవాఁడు? అదివిని “ అతఁడు మాలో నందఱికన్న గొప్పవాఁడు గొప్పవంశమువాఁడు. మహా పండితుఁడు” అనిపొగడిరి. అంత పైగంబరులవారు “అతఁడు ముసల్మానుఁడైనచో మీరేమిచెప్పెదరు?” అని ప్రశ్నించిరి. అట్లుజరుగదు. దేవుఁడు రక్షించుఁగాక! అని యూదులుపలికిరి. అబ్దుల్లాబిన్ సలాము తటాలున చాటునుండివచ్చి “అష్హదు-అల్-లాయిలాహ-ఇల్-లల్లాహు-వ-అష్హదు-అన్న- ముహమ్మదన్-అబ్దుహు-వరసూలుహు అను కలిమా చదివి నేను ఇస్లాము స్వీకరించితిని.” అని ప్రకటించెను. యూదులదివిని మహా కోపముతో “దుష్టుఁడు దుష్టునికుమారుఁడు” అని అబ్దుల్లాబిన్ సలామును దూషింపసాగిరి. చూచితిరా! కొంతసేపునకుముందు పొగడుచున్న వారు ద్వేషముతో తిట్టుటకు మొదలుపెట్టిరి.

—: స ర్మా ఇ స్లా ము లో చే రు ట. :—

అబ్దుల్లాబిన్ సలాము ఇస్లామును స్వీకరించిన తరువాత నస్రానీ (క్రైస్తవు)లలో గొప్పవిద్వాంసుఁడగు సర్మా ఇస్లాము స్వీకరించెను. అతఁడు క్రైస్తవమతబోధకుఁడు. మఱియు

చెప్పెను. అతఁడు మరణించిన పిదప సల్మాను అరబ్బుల బిడారుల వెంట ప్రయాణమాయెను. వారు మధ్యలోనే యతని నొకయూదునికి విక్రయించిరి. ఆయూదుని స్నేహితుఁడగు నొక మదీనాపుర నివాసి అతనిని కొని మదీనాపట్టణమునకుఁ దెచ్చెను. సల్మాను మదీనాలో తన యజమానుని ఖర్జూరపుతోఁటలలో పనిచేయుచు కాలము గడుపుచుండెను. అట్లుండ హాజరత్ పైగంబరులవారు మదీనాకు వచ్చిచేరిన విషయము సల్మానునకు తెలిసెను. ఆవిషయము తెలియఁగానే తాను మఱచిపోయిన ప్రసక్త విషయము జ్ఞప్తికివచ్చి కొన్ని ఫలములు తీసికొనివచ్చి పైగంబరులవారి సమ్ముఖమున పెట్టెను. అపుడు పైగంబరులవారు "అదేమి?" అని ప్రశ్నింపఁగా "దానముగా ఇచ్చితిని" "అని సల్మాను చెప్పెను. అది విని పైగంబరులవారు మేము దానముగా నొసంగినట్టివి భక్షింపము అని చెప్పిరి. అపుడు సల్మాను లేచిపోయి మరల రెండవదినము కొన్ని వస్తువులు తెచ్చి "కానుకగా నొసంగుచున్నాను" అని పైగంబరులవారితో విన్నవింపఁగా పైగంబరులవారు తీసికొని భక్షించిరి. సల్మాను పరీక్షించిన రెండుగుర్తులు పూర్తియాయెను. మూఁడవగుర్తు చూచుటకై పైగంబరులవారు పోవుచుండఁగ వారివెంబడి సల్మానుకూడ పోవుచుండెను. అతని యుద్దేశము పైగంబరులవారు తెలిసికొని తమభుజముల నుండి దుప్పటిని జార్చిరి. అంత సల్మాను మహాభక్తితో ఖాతమైన బువ్వతును కన్నులకద్దుకొని ముద్దుపెట్టుకొని యేడ్వసాగెను. అదిచూచి పైగంబరులవారతని నూఱడించి యతని వృత్తాంత మడిగిరి. అప్పుడు సల్మాను తనవృత్తాంతమంతయు విన్నవించి

ఇస్లాము స్వీకరించెను. ఇస్లాము అవలంబించిన పిదప హజ్రత్ పైగంబరులవారు సల్మానుయొక్క యజమానుడగు యూదునికిడబ్బిచ్చి దాస్యమునుండి హజ్రత్ సల్మానును విడిపించిరి. ఇస్లామ వలంబించక పూర్వము హజ్రత్ సల్మానెఫార్సీ పేరు మాబా అని యుండెను. చూచితిరా! యూదులపండితుడగు అబ్దుల్లాబిన్ సలామును, క్రైస్తవమతస్థుడగు హజ్రత్ సల్మానును, స్వయముగా వచ్చి ఇస్లామవలంబించిరి. దానికి కారణము అంతకుపూర్వమే రాబోవుఆఖరు ప్రవక్తలగు ముహమ్మదు వారిని గూర్చి పూర్వదేవదత్త గ్రంథములగు తౌరాతు ఇంజీలు (క్రొత్త పాతనిబంధనల)లో తెలుపబడియుండుటయే.

—: ముసల్మానులు జబ్బుపడుట :—

ముసల్మానులు మక్కా నుండి మదీనాపురమునకు వచ్చి చేరిన పిదప నచటినీరు గాలి సరిపడక కొందఱు జ్వరముతో బాధపడిరి. వారిలో హజ్రత్ అబూబకరునకును హజ్రత్ బిలాలునకును చాలబాధకలిగెను. పైగంబరులవారది చూచి దేవుని ప్రార్థింపగా ఆజ్వరము మదీనాలో లేకుండ పోయెను. అందఱు స్వస్థతనొందిరి.

—: బీబీఆయిషా సంసారమునకు వచ్చుట. :—

పైగంబరులవారు మదీనాపురమునకు రాకమూడేండ్ల పూర్వమే మక్కాపురమునందు బీబీఆయిషాను వివాహమాడినవిషయము ముందు వ్రాసియున్నాము. బీబీఆయిషా సంసారమునకు రాకుండెను. మదీనాపురము చేరిన మొదటిసంవత్సరము బీబీఆయిషా సంసారమునకు వచ్చెను. అపుడు ఆమెకు తొమ్మిదేండ్ల వయస్సుండెను.

—: అస్ హాబెసుఫ్ఫా :—

పైగంబరులవారి శిష్యులలో పెక్కురు వ్యాపారమును సేద్యమును చేయుచు ఇస్లాముసేవ కావించుచుండిరి. కాని కొందఱు శిష్యులు ప్రత్యేకముగా వేఱుపనులు చేయక యెల్లపుడు పైగంబరులవారి సమ్ముఖము నందుండి పైగంబరులవా రిచ్చునుపదేశములను గ్రహించుచు ఖురానెషరీఫును పఠించుచుండిరి. అట్టివారికి భార్యబిడ్డలు లేకుండిరి. వారుం డుటకై మసీదుప్రక్కన ఒకతిన్నె కట్టఁబడెను. దానినే సుఫ్ఫాఅనుదురు. వారు పగలంతయు పైగంబరులవారి సమ్ముఖమునందుండి మతబోధలను గ్రహించుచు రాత్రియందు ఆతిన్నెపై పరుండుచుండిరి. కొన్నిసమయములలో వారికి రెండుమూఁడుదినములవఱకు ఆహారముదొరకకుండెను. కాని వారు దానికి సహించుచు విద్యను గ్రహించుచుండిరి. వారిలో కొందఱు మతప్రచారమునకై యితరప్రదేశములకు పోవుచుండిరి. అట్టివారిని అస్ హాబెసుఫ్ఫా అనుదురు.

—: యూదులతో ఒడంబడిక. :—

మదీనాపురములో యూదులు నివసించుచుండిరి. వారికి పెద్దపెద్దకుటుంబము లుండెను. వారు కోటలు కట్టుకొని చాల బలము గలిగియుండిరి. పూర్వమునుండి విరోధులుగానున్న ఔసు, ఖజ్ రజు కుటుంబములు ఇస్లాములో చేరి సహోదరులై ద్వేషము విడనాడి ఐకమత్యము కలిగియుండిరి. ఇస్లాము దిన దినము అభివృద్ధి పొందుటను చూచి యసూయాపరులైన యూదులు సహింపలేకపోయిరి. పైకిమాత్రము ఇస్లాములో చేరి ముసల్మానులమని నటించిన వంచకులుకూడ కొందఱుండి

8. అనాటి మదీనాలో యూదులు ఖజ్రజ్ తెగలవారు ఔస్ తెగలు. యూదులు ఖజ్రజ్ తో కలిసి ముసల్మానుల పక్షమున కొట్లాటలు కావించుచుండిరి. కావున వారిమధ్య శాంతము చేకూర్చెను. శాంతము నెలకొల్పుటకై పైగంబరులవారు యూదులను రప్పించి ముసల్మానులకును యూదులకును ఒకయొడంబడిక నిర్ణయించిరి.

(1) హత్య మొదలైనవాని గూర్చి పూర్వమునిర్ణయింపబడిన అపరాధపద్ధతియే అమలులో నుండును.

(2) యూదులు తమమతచారాదుల ప్రకారము నడచుకొనవచ్చును. ఎట్టి నిరోధము లుండవు.

(3) యూదులును ముసల్మానులును స్నేహభావముగా నుండవలెను.

(4) యూదులకుగాని ముసల్మానులకుగాని ఇతరులతో యుద్ధము సంభవించినచో ఒకరికొకరు తోడు పడవలెను.

(5) ఏపక్షమువాడును ఖురైషులకు అభయము నొసంగ కూడదు.

(6) ఎవరైన శత్రువులు మదీనాపురముపై దాడి వెడలివచ్చిన ఉభయపక్షములవారును కలిసి శత్రువును మార్కొనవలెను.

(7) ఒకపక్షమువారు ఒక శత్రువుతో సంధిచేసినచో రెండవ పక్షమువారును దానికి సమ్మతింపవలెను. కాని మతయుద్ధములలో నట్లు కానేరదు.

పై ఒడంబడికచే మదీనాపురములో నెట్టియాందోళనము లేక శాంతము కలిగెను. మదీనాపురమునకు చుట్టుపట్లనున్న గ్రామములవారును ఆ యొడంబడికను సమ్మతించిరి.

—: కుల్సూము మరణము .: —

హిజ్రీమొదటిసంవత్సరము కుల్సూము మఱియు అస్అదు అనుఇద్దఱు ముసల్మానులు మరణించిరి. వారిమరణముచే యూదులును వంచకులును సంతోషించి "ముహమ్మదు పైగంబరయినచో నతనిశిష్యు లెందుకు చనిపోవుదురు?" అని చెప్పసాగిరి. పైగంబరులవారదివిని దేవునిపనికి మేమేమి చేయగలము. అనిచెప్పిరి. దైవనిధిగా దుష్టుల (కాఫర్ల) నాయకులలో నిద్దఱు వలీదు ఆసు, అనువారు కూడ ఆదినములలో చచ్చిరి.

—: అబ్దుల్లాబిన్ జుబైరు పుట్టుట :—

ముహాజిర్లు మదీనాపురముచేరి యొకసంవత్సర మాయెను. వారిలో నెవ్వరికిని సంతానవృద్ధి లేక యుండెను. అందుచే యూదులు జాలవిద్య చేసిరి కావున పుట్టలేదను వార్త ప్రబలియుండెను ఆకాలములోనే హజ్రత్ అబ్దుల్లాబిన్ జుబైరు పుట్టిరి. వారితండ్రి పైగంబరులవారి మేనత్త కుమారులగుజుబైరుగారు. వారితల్లి హజ్రత్ అబూబకరుకుమార్తెలగు బీబీఅస్మాగారు. వారిజననముచే ముహాజిరులకు మహాసంతోషము కలిగెను.

—: హిజ్రీ రెండవ సంవత్సరము :—

ఇంతవఱకు హిజ్రీ మొదటిసంవత్సరములో జరిగిన విషయములనుగూర్చి వ్రాసితిమి. ఇఁక హిజ్రీ రెండవయేఁట జరిగినవిషయములను వ్రాయుదుము.

—: కాబామసీదు ఖిబ్లాగా నియమింపఁబడుట :—

పైగంబరులవారు మదీనాపురములో 16 నెలలవఱకు జెరూషలేము (బైతుల్ ముఖద్దసు) వైపు ముఖముచేసి

నమాజు చేయుచుండిరి. [illegible] ముఖము చేసి
[illegible] తమతమ
[illegible] ముఖము చేయుదురు.
[illegible] ముఖము
చేయుదురు. పైగంబరులవారును [illegible] బైతుల్
ముకద్దస్ [illegible] చేయుచుండిరి. అది
[illegible] కా
[illegible] ఇస్మాయీలు
[illegible] కాబా
మసీదును [illegible] పైగంబరులవారును కాబా
మసీదు [illegible] ప్రార్థించుచు దేవుని
[illegible] చేయుచుండిరి. [illegible] కాబావైపున
ముఖముచేసి నమాజు [illegible] దేవునాజ్ఞ కలిగెను. అప్పుడే
పైగంబరులవారును వారి శిష్యులును కాబామసీదు దిక్కున
ముఖముచేసి నమాజు సలుపసాగిరి. అప్పటినుండి యిప్పటి
వఱకును ముసల్మానులందఱును కాబామసీదువైపు
ముఖముచేసి నమాజు సలుపుదురు. ఆ నమాజు చేయుటలో ననేక
రహస్యములున్నవి. వానిలో ముఖ్యమైనవి ముసల్మాను
భక్తులకొరకు ఐకమత్యమును వారిచిహ్నమును.

—: ఖురైషుల కుట్ర :—

పైగంబరులవారును వారిశిష్యులును ఖురైషులు పె
ట్టుచున్న బాధలకు సహించి సుమారు మున్నూఱుమైళ్లదూరము
న నున్నమదీనాపురమునకు వచ్చిచేరి శాంతముగానుండిరి. కాని
మక్కాఖురైషులు తమవిరోధమును విడువక యెట్లైన

ముసల్మానులను నశింపఁజేయవలెనని కుట్రలు చేయుచు మదీనాలోనుండు కాఫర్లనాయకులకు నిట్లువ్రాసిరి. "మీరుమక్కా వారిని మీపురములో నిలిపియున్నారు. అది మాకు సరిపడదు. కావున మీరు ముసల్మానులతో యుద్ధము చేయుఁడు. లేక వారిని మీపురమునుండి తఱిమివేయుఁడు. మీరట్లుచేయనిచో మేము మదీనాపై దాడివెడలి వత్తుము. మీస్త్రీలను వశపఱచుకొందుము." ఖురైషులసందేశము వచ్చినపిదప ఉబైబిన్సలూలును వానితోడివారును పైగంబరులవారితో యుద్ధము చేయుటకై నిశ్చయించుకొనిరి. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి స్వయముగా వారియొద్దకుపోయి యిట్లు బుద్ధిసెప్పిరి. "ఖురైషులు మీతో కుతంత్రము చేసినారు. దానికి లోఁబడి మీరు యుద్ధము చేసినచో మీకు చాలనష్టము కలుగును. వారిమాట తిరస్కరించిన మీకంతనష్టము కలుగదు. ఎందుకన మీరు ముసల్మానులతో యుద్ధముచేసినచో మీబంధువులనే మీచేతులార వధించినవారగుదురు. ఒకవేళ ఖురైషులతో యుద్ధమాడవలసివచ్చినచో అపుడు మీరు పరాయివారలతో యుద్ధము చేసినవారగుదురు." పైగంబరులవారు చెప్పినబోధనచే యుద్ధమునకై సిద్ధముగానున్నవారు యుద్ధము మానుకొనిరి.

ఖురైషులు తాము పన్నినకుట చెల్లలేదేయని మదీనాలోనున్న యూదులకు వార్తలనంపి వారిని తమపక్షముచేసికొని తమకుట్ర ఫలించునని గర్వించి మదీనాలోనున్న ముసల్మానులకు "మీరు తప్పించుకొని మదీనాచేరినామని గర్వింపవలదు. మేము మదీనాపై దండెత్తివచ్చి మిమ్ము నాశనము చేయుదు" మని బెదరింపువార్తల నంపిరి. దానికితోడుగ

కుర్జుబిన్ జాబిర్ అను ఖురైషుండు మక్కానుండి మదీనాకు వచ్చి ముసల్మానులయొక్క ఒంటెలు పచ్చికబయలందు మేయుచుండగ వానిని దోఁచుకొని పోయెను.

అట్లు ఖురైషులు మదీనాపై దండెత్తివచ్చుటకై ప్రయత్నములు చేయుచుండఁగ పైగంబరులవారు వాటికి ప్రతీకారము చేయవలెనని చుట్టుపట్లనున్న గ్రామములకుఁ బోయి శాంతము నెలకొల్పుటకై ఒడంబడికలు చేయుచుండిరి. దానికొఱకు మదీనానుండి 80 మైళ్ళ దూరమునందున్న ఉద్దాను ప్రదేశమునకుఁబోయి బనూజమ్రా అనువంశము వారితో ఒడంబడిక గావించుకొనిరి.

ఖురైషులు సిరియాదేశమునకు వ్యాపారమునకై తమ సరకుల నంపుచుండిరి. దానిలో వారికి చాలలాభము కలుగుచుండెను. మదీనాపై దండెత్తవలెనను ఆలోచన మక్కావారికి నుండెను. దానికై యుద్ధసాధనములు కావలెనుకదా! దానికొఱకు మక్కావారందఱు తమసరకులంతయు సిరియాదేశమునకు పంపియుండిరి. దానిలోవచ్చులాభముచే యుద్ధసాధనములు దానిఖర్చులుగావించవలెనని యుండిరి. ఆవణిజులకు నాయకుఁడు 'అబూసుఫ్యాను'. ఖురైషులు వ్యాపారమునకు మదీనా సమీపము నుండియే సిరియాదేశమునకు పోవలసివచ్చును. కావున ఖురైషులవణిజులను అడ్డగించినచో వారివ్యాపారము సాగదు విధిలేక తుదకు సంధిచేయుదు రనితలఁచి పైగంబరులవారు కొందఱిని ఆపనికై పంపుచుండిరి. కాని ఖురైషులు తప్పించుకొని పోవుచుండిరి.

పైగంబరులవారు హిజ్రీ రెండవయేఁట రజబునెల లో పండ్రెండుమందిని తోడుచేసి అబ్దుల్లాబిన్ జహీషును "బత్నెనఖ్లా" అనువోటునకు నంపుచు ఒకయుత్తరమునిచ్చి దానిని రెండు దినముల పిదప విప్పిచూడుఁడని ఆజ్ఞాపించిరి. అబ్దుల్లాగారు పయనమై రెండుదినముల పిదప ఆయుత్తరమును విప్పఁగా దానిలో "నఖ్లా" అనువోటున నిలిచి ఖురైషుల పన్నుగడలు తెలుపుఁడు అనియుండెను. వారు పయనమై నఖ్లా చేరి అచట మఖాము చేసిరి. ఒకదిన మచట నుండి కొందఱు ఖురైషులవర్తకులు పోవుచుండిరి. అబ్దుల్లా వారిని ముట్టడింపఁగా 'హాజమిా' అనునతఁడు వధింపఁబడెను. ఇద్దఱు వర్తకులు పట్టుబడిరి. అబ్దుల్లాగారు ఆ యిద్దఱు వర్తకులను వారి సొమ్మును తీసికొని పైగంబరులవారి యొద్దకు వచ్చి జరిగిన వృత్తాంతమంతయు తెలిపిరి. పైగంబరులవారు "నేను మిాకట్లు చేయుటకు నాజ్ఞ నొసంగలేదు. ఖురైషులవిషయము తెలిసికొనుటకు మాత్రమే అంపితినిగదా!" అని తమఅసమ్మతమును తెలిపి మందలించి ఆవర్తకులను వదలిపెట్టిరి.

—: ఖురైషులు దాడివెడలుట :—

ఖురైషులవర్తకులు వ్యాపారమునకై సిరియా (షామ్) దేశము పోయి గొప్పలాభము పొంది మరలి మక్కాపురము నకు పోవుచుండిరి. దానిచే ముసల్మానులను నాశము చేయ వలెనను ఉద్దేశము ఖురైషులకుండెను. ఆవిషయము పైగంబరుల వారికిఁ దెలిసి సిరియానుండి మక్కాపురమునకు పోవుచుండిన వర్తకులను మార్కొనవలెనని సాధారణముగా యుద్ధాయుధ ములు లేకుండనే కొందఱు శిష్యులతో పయనమైరి. ఈ

విషయము శత్రువులనాయకుండగా నున్న అబూసుఫ్యానునకు తెలిసి సహాయము చేయుటకై సైన్యము తీసికొని రండని మక్కా ఖురైషులకు వార్తనంపెను. ఆ వార్త వినగానే అబూజెహాలు యిదే మంచిసమయమని తలంచి మక్కావారి నందఱిని యుద్ధమునకై పురికొల్పి గొప్ప సైన్యమును తీసికొని వెడలెను.

—: ధర్మయుద్ధమునకై దేవునాజ్ఞ :—

ఖురైషులు యుద్ధమునకై వెడలిరి అనువార్త పైగంబరులవారికి మార్గమందు సఖా అనుచరుడొకడు తెలిపెను. శత్రువులను మార్కొనుటకై ముసల్మానులు బయలుదేఱిరి. కాని యుద్ధోద్దేశముతో బయలు దేఱలేదు. అదియునుగాక పైగంబరులవారికి నింతవఱకు శాంతముగా నుండి విరోధులు చేయుబాధలను సహింపవలెననియే దేవునాజ్ఞ యుండెను. దానిననుసరించి ప్రవక్తపదవి లభించిన దినమునుండి మక్కాపురములోనున్న 13 సంవత్సరముల వఱకును సహింపరాని కష్టములను పైగంబరులవారును వారి శిష్యులును ఓర్చిరి. మదీనాచేరిన పిదప కూడ పైగంబరులవారు శాంతముగా ఇస్లాము ప్రచారము చేయుచుండిరి. కాని ఖురైషులును, యూదులును మదీనావంచకులతో కలిసి ముసల్మానుల నాశనముచేయవలెనని వ్రాసియుండిరి. ఆ యుద్దేశముతోనే మక్కావారిగొప్పసైన్యము వచ్చుచుండెను. అందుచే విధిలేక ధర్మ రక్షణార్థమై దేవునాజ్ఞ పైగంబరులవారి కిట్లు కలిగెను.

"ఉజిన లిల్లజీన యుఖాతలూన-బి అన్నహుమ్-జులిమూ-వఇన్నల్లాహ-అలానస్-రిహిమ్‌లఖదీర్-అల్లజీన-ఉఖ్‌రిజూమిన్ దియారిహిమ్_బిగై రిహఖ్ఖిన్_ఇల్లాఅన్‌యఖూలూ-అబ్బునల్లా హు_నలౌలాదఫ్_ఉల్లాహిన్నాస _ బాజహుమ్ _ బిబాజిన్ లహుద్దిమత్ సవామిఉ-వబియఉన్‌వసలవాతున్ -వమసాజిదు యుజ్‌కరు-ఫీహాస్-ముల్లాహి-కసీరన్" యుద్ధము చేయునట్టి కాఫర్లతో యుద్ధముచేయుటకై ముసల్మానులకు సెలవు నొసంగఁబడుచున్నది. ఎందుకన వారి (ముసల్మానుల) యెడ కాఫర్లు దౌర్జన్యము చేసిరి. మఱియు అల్లా ముసల్మానులకు సహాయముచేయు శక్తిగలిగి యున్నాఁడు. మా ప్రభువు అల్లా యని పలికినందులకే ముసల్మానులు తమయిండ్లనుండి అన్యాయముగా (కాఫర్లచే) దఱుమఁ బడిరి. దేవుఁడు ప్రజలలో కొందఱిని (కాఫర్లను) కొందఱిచే (ముసల్మానులచే) పాఱ దోలనిచో మఠములును, గుళ్లును, యూదుల దేవాలయములును, అల్లానామము పఠింపఁబడు మసీదులును నాశమగును.

—: బదరు యుద్ధము :—

అట్లు పైగంబరులవారు యుద్ధమును గూర్చి దేవునాజ్ఞ అయినపిదప మక్కా-వారిని మార్కొనుటకై సిద్ధమైరి. దానికొఱకు మహాజిరులను అన్సారులను బోధించి వారి యభిప్రాయము నడిగిరి. మహాజిర్లు లేచి "మేము దేవుని మార్గమందు వెనుకంజ వేయము. మా ప్రాణముల నర్పింతు"మని పలికిరి. పైగంబరులవారు అన్సారీల అభిప్రాయము తెలిసి

కొనుటకై వారిపైబడవచ్చిరి. అప్పుడు సాదుబిన్ ఉబాదా గారు లేచి "ఓమహానుభావా! మీరాజ్ఞయైనచో సముద్రము లో మునుగుటకైన మునుగుదుము" అని విన్నవించిరి. పైగం బరులవారు మదీనాపై దాడివెడలి వచ్చుచున్న ఖురైషుల గొప్పసైన్యమును ఎదుర్కొనుటకై సిద్ధమైరి. ఆసమయమున పైగంబరులవారితో 313 గురు ముసల్మానులు మాత్రముం డిరి. పైగంబరులవారు పయనమై మదీనా నుండి 80 మైళ్లదూర మున నున్న బదరుఅనుప్రదేశమునకు రంజానునెల17వ తేదిని చేరిరి. ఖురైషులు కూడ బదరును సమీపించిరి. కావున పై గంబరులవారును వారిసైన్యమును బదరుప్రదేశములోనే నిలి చిపోయిరి. పైగంబరులవారిసైన్యములో రెండుగుఱ్ఱములును అఱువదియొంటెలు మాత్రముండెను. ఖురైషులు వేయిపేరుల గొప్పసైన్యముతో సమస్తయుద్ధసాధనములు తీసికొనివచ్చిరి. వారిసైన్యములో 700 ఒంటెలును 300 గుఱ్ఱములును ఉండెను. సిరియా నుండివచ్చుచున్న వర్తకులసమూహము క్షేమముగా మక్కాపట్టణము చేరెను. ఆవిషయము అబూసుఫ్యాను ఖురైషు లకు తెలిపి తిరిగిరమ్మని వార్తనంపెను. కాని దుష్టుడైన అబూ జెహాలు దానికిసమ్మతింపక "యుద్ధము చేసితీరవలెను. ముస ల్మానులయొద్ద మంచియాయుధములు లేవు. వారిని నాశము చేయుటకై యిదే మంచిసమయ"మని ఖురైషులను యుద్ధమున కై ప్రేరేపించెను. ఖురైషులు తమసైన్యబలముపై గర్వించి యుద్ధమునకే సిద్ధమై బదరుమైదానములో నీళ్లున్న చోటులను వశము చేసికొని సైన్యమును నిలిపిరి.

పైగంబరులవారు యుద్ధము జరుగుటకు నొకదినము

ముందే యుద్ధరంగము చూచి జరుగఁబోవు యుద్ధములో ఖురైషులదుష్టనాయకు లెచటెచట వధింపఁబడుదురో తమశిష్యులకుఁ జూపిరి. రెండవదినము యుద్ధము జరిగి ముగిసినపిదప పైగంబరులవారు చెప్పినచోట్లయందే యాఖురైషులదుష్టనాయకులు చచ్చి పడియుండిరి.

ఉభయపక్షములవారును యుద్ధమునకు సిద్ధమై తెల్లవారునప్పటికి యుద్ధరంగములో వచ్చిచేరిరి. పైగంబరులవారు తమ సైన్యమును చక్కఁగా పంక్తులుగా నిలిపి సరిచేసి అల్లరి చేయక నిశ్శబ్దముగా నుండవలెనని ఆజ్ఞాపించిరి.

—: ఆడినమాటతప్పరాదు :—

పైగంబరులవారి సైన్యము కాఫర్ల సైన్యములో మూడింట నొకపాలుండెను. పైగంబరులవారి పక్షమున ఒక యుద్ధవీరుఁడు వచ్చిచేరినను ఎంతో లాభము అనఁదగియుండెను. అట్టిసమయములో నిద్దఱు ముసల్మానులు మక్కానుండివచ్చుచుండఁగ వారిని మార్గమందు కాఫర్లు అడ్డగించి "మీరు పైగంబరులవారి పక్షమున యుద్ధము చేయుటకై పోవుచున్నారు కాఁబోలు"! అనిరి. వారిద్దఱు మేమట్లు చేయమని మాట యిచ్చిరి. అందుచే కాఫర్లు వారిద్దఱిని వదలిరి. వారిద్దఱు పైగంబరులవారియొద్దకు వచ్చివారితో జరిగిన విషయమును తెలిపిరి. అపుడు పైగంబరులవారు "మీరు ఆడినమాట తప్పరాదు మీరు యుద్ధములో పాలుపుచ్చుకొనవలదు. మాకు దేవునిసహాయమే చాలు"నని చెప్పిరి. చూచితిరా అట్టికష్టసమయములో కూడ ఆడినమాట తప్పరాదని పైగంబరులవారు సెలవిచ్చిరి.

యుద్ధము ప్రారంభమగు కాలమునందు పైగంబరులవారు నమాజుచేసి భయభక్తులతో "ఓ దేవా" యని ప్రార్థించిరి. కర్తా నీ వొసంగిన వాగ్దానము పూర్తిచేయుము. ఈనాటి యీ చిన్న పడుము. ముసల్మానుల సైన్యము నశించినచో ప్రపంచములో నిన్నారాధించువా రెవ్వరుండరు". అని ప్రార్థించిరి. హజరత్ అబూబకరుగారు ఇదిచూచి 'దేవుడు మన వాగ్దానము పూర్తిచేయును'. అని విన్నవించిరి. అప్పుడు పైగంబరులవారు "సయుహ్ జముల్ జమ్-ఉవ యువల్లూనద్-దుబుర్. (శత్రుసైన్యము ఓడిపోవును మఱియు వీపుచూపి పాఱిపోవును.) అని సెలవిచ్చి తమ సైన్యమునకు సంతోషవార్త వినిపించిరి.

—: వర్షము కురియుట :—

పైగంబరులవారు నిలిచిన ప్రదేశము ఇసుకనేలగా నుండి కాళ్లు దిగబడుచుండెను. నీటివసతి కూడ లేకుండెను. అందుచే ముసల్మానులు కొంత చింతించిరి. కాని పైగంబరులవారు 'దేవునిసహాయము కలుగును, అని ధైర్యము చెప్పిరి. ఖురైషులసైన్యమున్న ప్రదేశము ఇసుకలేక గట్టినేలగా నుండెను. వారికి నీటివసతి కూడనుండెను. అప్పుడు దేవునియనుగ్రహామువలన ఎప్పుడు వర్షము పడనిచోటున గొప్పవర్షము కురిసెను. ముసల్మానులు మహాసంతోషముతో దేవునికి కృతజ్ఞత చెల్లించి పల్లములో కట్టలు కట్టి నీళ్లను ఆపుకొనిరి. ముసల్మానులున్న ఇసుకనేల వర్షముచే గట్టిపడి నడచుటకు సౌకర్యము కలిగెను. ఖురైషులున్న చోటు బురదగానయి కాళ్లు జాఱుచుండెను. వర్షముచే ఖురైషులకు ఇబ్బంది కలిగెను.

—: యుద్ధప్రారంభము. :—

తుదకు రెండుసైన్యములును సమీపించెను. ఖురైషు లపక్షము నుండి ఉత్బా, వలీదు, షైబా అనుముగ్గురు నాయ కులు యుద్ధరంగములో దుమికి యుద్ధమునకై ముసల్మానులను పిలిచిరి. వారికి పోటీగ అన్సారులలో ఔఫు, మఆజు, అబ్దుల్లా బిన్ రవాహా అనువారు వచ్చిరి. వారిపేరులను వంశములను గూర్చి ఉత్బా అడిగెను. వారు మదీనావారలగు అన్సారులని తెలిసి" మీరు మాజోడువారు కారు. మీతో మాకు పనిలే దు. మక్కావారలగు మావంశస్థులు మాకు సగియైనపోటి. కావున। వారు రావలెనని' చెప్పెను. అపుడు పైగంబరులవారు ముగ్గురిని తిరిగిరమ్మని చెప్పి హజ్రత్ హమ్జా, అలీ, ఉ బైదా అనుముగ్గురిని పంపిరి. వారుపోయి యుద్ధమాడిరి. హ జ్రత్ అలీచే వలీదును హజరత్ హంజాచే ఉత్బాయును వధింపఁబడిరి. షైబాచే ఉబైదాగారు దెబ్బతిని పడిపోయిరి. తత్క్షణమే హజరత్ అలీ, షైబాను మార్కొని వధించి హజ్ రత్ ఉబైదాను తమభుజములపై నెత్తికొని పైగంబరులవార సమ్ముఖమునకు తీసికొని వచ్చిరి. తుదకు వారు ఆ గాయముచే మరణించిరి. దానితరువాత సయీదుబిన్ ఆసు కుమారుఁడు ఉబైదాఅనువాఁడు ఖురైషులసైన్యమునుండి యుద్ధరంగములో నికివచ్చెను. వానిశరీరమంతయు కవచముతో నిండి ఒకకన్ను మాత్రము కనఁబడుచుండెను. హజ్రత్ జుబైరుగారు వానిని మార్కొనుటకై వచ్చి బల్లెముతో గుఱిపెట్టి కనఁబడుచున్న కంటిలోపొడిచిరి. ఆదెబ్బతోనే।యాదుష్టుఁడునేలఁగూలిచచ్చె ను. ఆపిదప పోటీయుద్ధము ముగిసి రెండుసైన్యములునుఒక్క

సహాయము వలన ముసల్మానులకు యుద్ధములో విజయము కలిగెను. ఆయుద్ధమందు ముసల్మానుల పక్షమున దేవదూతలు కూడ దేవునాజ్ఞచే తోడుపడిరి. ఖురైషులలో 70 మంది హతులైరి. అనేకులకు గాయములు తగిలెను. 70 మంది ఖురైషులయుద్ధవీరులు పట్టువడిరి. ముసల్మానులలో 14 మంది మాత్రము స్వర్గలోకము చేరిరి. వారిలో 6 మంది ముహాజిర్లు 8 మంది అన్సారులు.

—: ఖైదీలను విడుచుట. :—

పట్టువడిన డెబ్బదిమంది ఖురైషుఖైదీలలో పైగంబరులవారిపినతండ్రియగు అబ్బాసును, పైగంబరులవారి అల్లుడగు అబుల్ ఆసును హజ్రత్ అలీతమ్ముడగు అఖీలును ఉండిరి. యుద్ధరంగమందు వధింపబడిన ఖురైషులను ఒక పెద్దగుంతలో పూడ్చిరి. యుద్ధము ముగిసిన పిదప మూడు దినములవఱకు నచటనేయుండి తరువాత ఖైదీలను తీసికొని పైగంబరులవారు మదీనాపురమునకు వచ్చిచేరిరి. ఖైదీలను సౌఖ్యముగా నుంచుటకై ఆజ్ఞాపించి తమశిష్యులకు నొప్పగించిరి. శిష్యులు తాము ఖర్జూరపుపండ్లు తిని తమయొద్దనున్న ఖైదీలకు అన్నమిచ్చుచు వస్త్రములు లేనివారికి వస్త్రములిచ్చుచు చాల సౌఖ్యము గలుగజేసిరి. పైగంబరులవారు ఖైదీల విషయమున నేమిచేయవలెనని తమశిష్యులతో నాలోచించిరి. హజ్రత్ అబూబకరుగారు "ఖైదీలనుండి ఫిదియాధనము పుచ్చుకొని విడుదల గావింపవలెను. అందఱు మనబంధువులేగదా!" అని విన్నవించిరి. హజ్రత్ ఉమరుగారు "అట్లువలదు. ఖైదీలు ఇస్లాముసకు విరోధులు. వారిని విడువకూడదు. వధింపవలె" నని

ఆలోచన చెప్పిరి. కాని పైగంబరులవారు హజరత్ అబూబకరు గారు చెప్పిన సలహా సమ్మతించిరి. భాగ్యవంతులుగానున్న ఖైదీలనుండి నాలుగువేలు దిర్హములు (1000 రూపాయలు) ఫిదియా (బదులు)గా పుచ్చుకొని విడిచిపెట్టిరి. సెలవేదలుగా నుండి వ్రాయను తెలిసిన ఖైదీలలో నొక్కొక్కడు పదుగురు ముసల్మాను బాలురకు వ్రాయను నేర్పింపవలెను. దానిపిదప విడుదల కావింపఁబడును అని తీర్మానింపఁబడెను. అక్షర జ్ఞానము లేని బీదఖైదీలను ఉచితముగానే విడుదల గావించిరి.

పైగంబరులవారి అల్లుఁడగు అబుల్ఆసు వెద్ద బదులిచ్చుటకు ధనములేకుండెను. అతఁడు మక్కాలో నుండిన తనభార్యయగు బీబీజైనబు (పైగంబరులవారి కుమార్తె) నకు దానిగూర్చి తెలిపెను. అప్పుడామె తనతల్లియగు బీబీఖదీజాగారు వివాహకాలమందిచ్చిన విలువైనహారమును తనభర్త విడుదలకై పంపెను. ఆ హారమును పైగంబరులవారు చూచి బీబీఖదీజాగారిని జ్ఞప్తికి దెచ్చుకొని కన్నీరువిడిచిరి. పైగంబరులవారు తమశిష్యులతో "మీరు సమ్మతించినచో బీబీజైనబునకు నామెతల్లియొసఁగిన జ్ఞాపకార్థముగానున్న హారమును తిరిగి యిచ్చివేయుఁడు" అనిచెప్పిరి. అపుడు శిష్యులందఱు దానికి సమ్మతించి యాహారము తిరిగి బీబీజైనబునకు పంపివేసి, అబుల్ ఆసును విడిచిపెట్టిరి. అబుల్ఆసు మక్కాపురమునకు వచ్చి బీబీజైనబును పైగంబరులవారింటికి మదీనాపురమునకు పంపివేసెను. ఇంతవఱకు అబుల్ఆసు ఇస్లాములోచేరకుండెను. తొందరకు స్వయముగానే ఇస్లామునవలంబించెను. పైగంబరులవారిట్లు ఫిదియా (బదులు) పుచ్చుకొని ఖైదీల

ను విడుదల చేసిరికదా! దానిగూర్చి దేవునాజ్ఞ లేకుండెను. పూర్వ యుద్ధపద్ధతినిబట్టి అట్లు వారు చేసిరి. కావున దేవుఁడు దానిగూర్చిమందలించి ఫిదియా (బదులు) పుచ్చుకొనవచ్చునని సెలవిచ్చెను. దేవునిసెలవైనందున పైగంబరులవారును శిష్యులును సంతసించిరి. బదరుయుద్ధమును గూర్చిఖురానెషరీఫులో 'అన్ఫాలు'సూరాలో వివరముగా నున్నది.

—: గజ్వా సరియ్యా. :—

పైగంబరులవారు తమశిష్యులతోఁగూడిచేసిన ప్రయాణములో యుద్ధముసంభవించినను, సంభవింపకపోయినను దానిని 'గజ్వా' అనుదురు. పైగంబరులవారు లేక శిష్యులు మాత్రమే యుద్ధముకొఱకు పయనమైనచో దానిని 'సరియ్యా' అనుదురు. గజ్వాలు 27 సంభవించినవి. వానిలో 9 గజ్వాలలో మాత్రము యుద్ధము సంభవించినది. ఆతొమ్మిదింటిలో బదరుయుద్ధముమొదటిది. దానిగూర్చి వ్రాసియున్నాము. మిగిలిన 8 ధర్మయుద్ధములు ఒహుదు, అహజాబు, బనూఖురైజా బనుల్ముస్తలఖ్ ఖైబరు మక్కావిజయము, హునైను తాయెఫుఅనునవి. వానిగూర్చి ముందు వ్రాయుదుము. సరియ్యాలు 35 సంభవించినవి. వానిలో చాలవఱకు ఇస్లాము ప్రచారమునకై వెళ్లిన రాయబారములు. వానిలో యుద్ధము సంభవించలేదు. బదరుయుద్ధమునకు పూర్వము పైగంబరులవారు, ఉద్దాను, బవాతు, అషీరా, సఫ్వాను అనుచోటులకుఁ బోయి కొన్నిచోటుల నొడంబడికలు గావించి, తిరిగి మదీనా పురమునకు వచ్చిరి. ఆప్రయాణములో నెట్టికలహములు గాని యుద్ధములు గాని ఖురైషులతో సంభవించలేదు. పైగంబరు

లవారు బదరుయుద్ధమునకు పోయినప్పుడు ఉస్మాన్‌బిన్ హార్సును, హాజ్రత్ హజ్జూను, ...దుబిన్ అబిఖాసును అబ్దుల్లాబిన్ జహాషును పలుసార్లకు నాయకులుగాఁజేసి పంపిరి. వారిలో అబ్దుల్లాబిన్ జహాషువారు పోయిన (సిరియా) యాత్రను గూర్చివివరముగా వ్రాసియున్నాము. మిగిలిన సరియ్యాయాత్రలలో ఖురైషులతో నెట్టికలహములు గాని యుద్ధములు గాని సంభవించలేదు.

—: బీ బీ రు ఖ య్యా మ ర ణ ము :—

బీబీరుఖయ్యా హాజ్రత్ పైగంబరులవారి రెండవ కుమార్తె. మక్కాపురములో నున్నప్పుడే ఆమెహాజ్రత్ ఉస్మానుగనీని వివాహమైయుండెను. బీబీరుఖయ్యాగారు తమభర్తతోఁగూడి అబిసీనియాకు పోయియుండిరి. పైగంబరులవారు మక్కాపట్టణము నుండి మదీనాపట్టణమునకు వచ్చినపిదప బీబీరుఖయ్యాగారు అబిసీనియా నుండివచ్చి మదీనాచేరిరి. పైగంబరులవారు బదరుయుద్ధమునకు పోవుసమయమున బీబీరుఖయ్యాగారు జబ్బుపడియుండిరి. వారిచికిత్సకొఱకు ఉస్మానుగనీ, ఉసామాగార్లు మదీనాలో నుండిరి. బదరుయుద్ధములో విజయము గలిగినవార్త మదీనాపట్టణమునకు జైదుబిన్ హారిస్ చే పైగంబరులవారంపిరి. జైదుగారు మదీనాపురము ప్రవేశించునప్పటికి బీబీరుఖయ్యాగారు మరణించియుండఁగా నందఱు వారిని సమాధిగావించి తిరిగి వచ్చుచుండిరి. వారిమరణవార్తయు విజయవార్తయు నొకేసమయమందు మదీనావారు వినుట తటస్థించెను.

—: ఉమైరు ఇస్లాములో చేరుట. :—

బదరుయుద్ధములో ఖురైషులకు సపజయము గలిగె ననువార్త మక్కాపురము చేరఁగా నెవ్వరు నేడ్వఁగూడదు అను ప్రకటన కావింపఁబడెను. అందఱు రోషమునకు లొంగి రోదనచేయకుండిరి. కాని వారిహృదయములు దుఃఖముతో నిండియుండెను. ఒకదినము సఫవాను అను ఖురైషుఁడును, ఉమైరుబిన్ వహాబును ఏకాంతమున బదరులో గలిగిన పరాజయమును గూర్చిచింతించుచుండిరి. సఫవాను "మేము మానము లేని బ్రతుకు బ్రతికి ఫలమేమి?" అని చెప్పెను. ఉమైరు విని నీవు చెప్పినది నిజము. అప్పు మఱియు భార్య పిల్లల జీవనచింత లేకుండినచో నిప్పుడే మదీనాపురము చేరి ముహామ్మదును వధించి వత్తునుగదా! అనిచెప్పఁగా సఫవాను "నీవు దానిచింత చేయకుము. నేను నీయప్పు తీర్చెదను. మఱియు నేను బ్రతికియున్నంతవఱకు నీభార్యబిడ్డలను పోషించు భారమునాది", అని పలికెను. ఉమైరు తత్క్షణమే గృహమునకు పోయి ఖడ్గమును విషపునీళ్లలోముంచి మదీనాపురమునకు పయనమాయెను. కొద్ది దినములకు మదీనాపురము చేరెను. హజ్రత్ ఉమర్ గారు ఉమైరును ఖడ్గము ధరించియుండఁగ జూచి అనుమానపడి వానిని పట్టుకొని పైగంబరులవారియొద్దకుఁ దీసికొనివచ్చిరి. పైగంబరులవారు "ఓయి ఉమరు అతని వదలిపెట్టుము" అనిచెప్పుచు "ఓయి ఉమైరు నీవెందులకు వచ్చితివి చెప్పుమని" అడిగిరి. ఉమైరు "కుమారుని విడిపించుటకు వచ్చితిని" అనిబదులిచ్చెను. "అటులైన ఖడ్గమెందులకు ధరించియున్నావు?" అని పైగంబరులవారడిగిరి. ఉమైరు

"మాఖడ్గములు బదరురంగములో గాకేమి నష్టమును నిలిపించి నవి?" అని చెప్పెను. పైగంబరులవారు "నిజము చెప్పుము" అని అడిగిరి. ఉమైరు తిరిగిముందు చెప్పినమాటయే పలికెను. అప్పుడు పైగంబరులవారు "ఏమి నీవును సఫవానును ఏకాంతమునఁ గూర్చుండి నన్ను వధించుటకు నాలోచనలు చేయలేదా? సఫవాను నీయప్పును తీర్చుటకును నీభార్యబిడ్డలను పోషించుటకు నొప్పుకొనలేదా? నీవు నన్ను వధించుటకై శపథము చేసి మదీనా చేరితివిగదా!" అనివారిరహస్యము తెలిపిరి. ఉమైరు "ఓ మహానుభావా! మీరు నిజముగా దేవుని ప్రవక్తలే. లేనిచో నేనును సఫవానును రహస్యముగా మాటలాడిన విషయము మూఁడవవానికిఁ దెలియదే! నేనిప్పు మిమ్ము విశ్వసింపఁ గలను" అనివిన్నవించి ఇస్లాములో చేరెను. పైగంబరులవారు ఉమైరునకు ఇస్లాము విషయములు నేర్పించుటకై శిష్యులను నియమించిరి. ఉమైరుగారు ఇస్లాము విషయములు నేర్చుకొని తిరిగి మక్కాపట్టణము చేరి ఇస్లామును గూర్చి బోధించుటకు ప్రారంభించిరి. వారి బోధనచే పెక్కురు ముసల్మానులైరి. ఉమైరు మక్కానుండి మదీనాకు పోయిన పిదప సఫవాను ఖురైషులయెదుట "ముహమ్మదు శీఘ్రముగానే వధింపఁబడు"నని ప్రజలు కొట్టుచుండెను. కాని పైగంబరులవారి వధకు బదులుగా ఉమైరు ముసల్మానైనవార్తవిని సఫవానును ఖురైషులును దుఃఖసముద్రములో మునిఁగిరి.

## —: అబూసుఫ్యాను మదీనా పైదండెత్తుట :—

బదరుయుద్ధములో అబూజెహాల్ ఉత్బా మొదలైన ఖురైషుసర్దార్లు చచ్చినందున అబూసుఫ్యాను ఖురైషులకు

సర్దారుగా నుండెను. బదరుయుద్ధమునకు ప్రతీకారము చేయు నంత వఱకు స్నానము చేయను. తల దువ్వను. అనుశపథము అబూసుఫ్యాను చేసి 200 మంది యుద్ధవీరులను తీసికొని మదీనాపై దాడివెడలెను. మదీనాలో నున్న యూదులు పైగంబరుల వారితోఁ జేసియున్న ఒడంబడికకు విరుద్ధముగా ఖురైషులకు తోడుపడుదురను విషయము అబూసుఫ్యానుకుఁ దెలిసి రాత్రిచీఁకటియందు రహస్యముగా మొట్టమొదట 'హుయియా బిన్ అఖ్తబ్' అనుయూదునొద్దకు పోయెను. కానిహుయియూదుఁడు అబూసుఫ్యాను కొఱకు నింటితలుపు కూడ తెఱవలేదు. అచటనుండి అబూసుఫ్యాను బనూనజీరుయూదుల సర్దారుఁడగు సలాముబిన్ ముష్కిమ్ యొద్దకు పోయెను. వాఁడు మహాగౌరవముతో నెదురువచ్చి పిలిచికొనిపోయి మేలైనభోజనములు పెట్టి సారాయి త్రాగించి ఆతిథ్యము సలిపి మదీనాలోని రహస్యములు దెలిపెను. అబూసుఫ్యాను తెల్లవాఱుసరికి మదీనా నుండి మూఁడుమైళ్ళదూరమున నుండిన అరీజుఅనుచోటున కొన్నిగృహములను గడ్డివాములనుగాల్చి సాదుబిన్ అమ్రుఅను అన్సారిని వధించి తాను చేసినశపథము పూర్తియాయెనని తలంచి తిరిగిమక్కాపురమునకు ప్రయాణమాయెను. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి అబూసుఫ్యానును పట్టుటకై వెంబడించిరి. కాని అతఁడు తప్పించికొని పోయెను. పోవునపుడు అబూసుఫ్యాను తొందరపాటుతో తనసైన్యము యొద్దనున్నసత్తూ అనుపిండిమూటలను భారము తగ్గుటకై పడవేయించెను. అవి ముసల్మానులకు చిక్కినవి. అరబ్బీలో (సత్తూ) పిండిని సవీఖుఅనుదురు. అందుచే దానిని గజ్వతొస్సవీఖు అనుదురు.

బదరు యుద్ధములో ముసల్మానులకు విజయము గలిగి నందున యూదులు సహింపలేక వారు చేసియున్న యొడంబడికకు వ్యతిరేకముగా కుట్రలు సలుపుచుండిరి. యూదులలో ఖైనఖా, నజీరు, ఖురైజా అను మూఁడుసంఘముల వారు ప్రబలియుండిరి. వారిలో ఖైనఖా యూదులు యుద్ధములో చాల నేర్పుగలిగినవారు. ఎల్లప్పుడు వారియొద్ద యుద్ధసాధనములుండును. దానిచే వారికి గర్వము కలుగుచుండెను. వారు కమసాలి మొదలైన వృత్తులు చేయుచునారు. ఒకదినము ముసల్మానులలో నొకఅన్సారీస్త్రీ యొక కమసలి యూదుని యంగడిలో నగ చేయించుటకై కూర్చుండియుండెను. ఆమెముఖముపై బుర్ఖా యుండెను. పశుప్రాయులైన యూదులు ఆమెముఖమును చూచుటకై ప్రయత్నించిరి. కాని ఆమె చూపలేదు. అపుడొక యూదుఁడు ఆమెవెనుకనుండి యామెవస్త్రమును వీఁపుపై కట్టెను. ఆమె లేవఁగా నామె మానమును యూదులు చూచి పరిహసించిరి. ఆమెయీఅవమానముచే రోదన పెట్టెను. అచ్చట ఒకముసల్మాను నిలిచి దుష్టులైనయూదులు కావించిన అవమానమును స్త్రీ చూచి సహింపలేక ఖడ్గముదూసి అవమానించినయూదుని వధించెను. అపుడు యూదులందఱు ఆముసల్మానునిపైఁబడి అతని వధించిరి. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి ఖైనఖాయూదుల వద్దకు పోయి వారిని సేకరించి "మీరుభయభక్తులు గలిగి యుండుఁడు. దేవునికి భయపడుఁడు. బదరులో ఖురైషులకుఁ గలిగినగతి మీకు కూడఁ గలుగకుండునట్లు చూడుఁడు" అని బుద్ధి చెప్పిరి. అదివిని ఖైనఖాయూదులు "మక్కావారు

యుద్ధము తెలియనివారు. వారిని జయించితినని పొరపాటు పడకుము. మేమట్లు కాము. మాతో యుద్ధము చేసిన మా సంగతి తెలియనగు"నని ధిక్కరించి మాట్లాడి చేసియున్న ఒడంబడికను త్రెంపివేసిరి. అందుచే పైగంబరులవారు విధిలేక యూదులకోటను ముట్టడించిరి. కైనఖాయూదులు కోటతలుపులు వేసికొని పదియేనుదినములవఱకు లోపలనే యుండిరి. తుదకు యూదులు భయపడి పైగంబరులవారెట్లు తీర్మానింతురో అట్లు సమ్మతింతుమని వార్తనంపిరి. పైగంబరులవారు "యూదులు మదీనాకోటను విడిచి సిరియాదేశములో నున్న అజురాతు ప్రదేశమునకు పోవలసినది" అని తీర్మానించిరి. దానిప్రకారము యూదులు తమకోటను విడిచి అజురాతునకు వెడలిపోయిరి.

—: బీబీ ఫాతిమాగారి వివాహము. :—

హిజ్రీరెండవయేట బదరుయుద్ధము ముగిసినపిదప పైగంబరులవారికుమార్తెయగు బీబీఫాతిమాగారికిని హజ్రత్ అలీగారికిని వివాహమాయెను. అపుడు బీబీఫాతిమాగారు 15 సంవత్సరములవయస్సు గలిగియుండిరి. హజ్రత్ అలీగారికి 21 సంవత్సరముల వయస్సుండెను. హజ్రత్ అలీగారు స్వయముగా పైగంబరులవారితో బీబీఫాతిమా గారి వివాహమును గూర్చి విన్నవించిరి. పైగంబరులవారు బీబీఫాతిమాతో దానిగూర్చి ప్రశ్నింపఁగా బీబీఫాతిమాగారు అంగీకారసూచకముగా ఊరకుండిరి. అపుడు పైగంబరులవారొక సభగావించి వివాహము గావించిరి.

హిజ్రీ రెండవయేఁట రంజాను పూర్తి నెలదినములు ఉపవాసము (రోజా)లుండవలెనని విధింపఁబడెను. ఉపవాసదినములు పూర్తియైన పిదప రమజాను పండుగ చేయవలెననియు నమాజుకొఱకు 'ఈదుగా' అను మసీదులో అందఱు కూడి నమాజు సలుపవలెననియు విధింపఁబడెను. ఆయేఁడే రమజాను ఖుత్బాపండుగ నాఁడు 'సదఖేఫితరు' అనుదానము బీదలకు నొసంగవలెననియు నియమింపఁబడెను.

ఇంతవఱకు హిజ్రీ రెండవయేఁట సంభవించిన విషయములను గూర్చి వ్రాసితిమి. ఇఁక హిజ్రీ మూఁడవ సంవత్సరము జరిగిన విషయములను వ్రాయుదుము.

## హి జ్రీ మూ ఁ డ వ స ం వ త్స ర ము .

### —: కా బు బి న్ అ ష్ర ఫు ని వ ధ .:—

కాబుబిన్ అష్రఫు అనునతఁడు యూదులలో గొప్ప కవి. కవిత్వమునకు తోడు అతనియొద్ద ధనము కూడనుండెను. అతఁడు మదీనాలో నుండు యూదులపండితులకు వేతనములిచ్చుచుండెను. అందుచే పండితులేమి పామరులేమి అతని మాటకు లోఁబడియుండిరి. అతఁడు అరేబియాలో నున్న యూదులందఱికి పెద్దగా నుండెను. పైగంబరులవారు మదీనాకు వచ్చినప్పటినుండి అతఁడు వారియందు ద్వేషము గలిగియుండెను. బదరు యుద్ధములో మక్కా-ఖురైషులకు నపజయము గలిగెనని అతనికి మనస్తాపము కలిగి మక్కా-పురమునకుఁ బోయి బదరులో వధింపఁబడినవారిని గూర్చి కవిత్వము చెప్పి "ముసల్మానులపై పగదీర్చుకొనవలసినది". అని ఖురైషులను పురికొల్పెను. అట్లు మక్కా ఖురైషులను

పైగంబరులవారిపైకి విరుద్ధముగ పురికొల్పి తిరిగి మదీనా పురమునకువచ్చి పైగంబరులవారిని ముసల్మానులను దూషించుచు కవిత్వము చెప్పెను. మఱియు నొకదినము పైగంబరులవారికి కాబు విందు చేసెను. పైగంబరులవారు విందుకొఱకు పోయిరి. కాబు పైగంబరులవారిని వధించుటకై కొందఱిని నియమించియుండెను. అతఁడు పన్నినకుట్ర దేవుఁడు పైగంబరులవారికిఁ దెలుపఁగా నచటి నుండి మరలివచ్చిరి. అట్లుదుష్టుఁడైనకాబు పైగంబరులవారియందును ముసల్మానుల యందును ద్వేషము కలిగి యుద్ధమునకై కుట్రలు సలుపుచు దేశములోనున్న శాంతమును భంగపఱచుచుండెను. అందుచే అతనిని వధించుట ముసల్మానులకు ధర్మమైయుండెను. దాని కొఱకు ముహమ్మదుబిన్ ముస్లిమా కొందఱుముసల్మానుల తోఁ గూడి కాబుయూదుని యొద్దకు పోయి వాని బయటికి పిలిచి యతనితో నిట్లు సంభాషించిరి. "ఓయికాబు! మేము ముహమ్మదువారిని మదీనాపురమునకు రప్పించి వారికి తోడు పడుటచే ధనవంతులందఱు మావిరోధులైనారు. అప్పు చిక్కుట లేదు. నీవు ధనవంతుఁడవు. తాకట్టు(గిర్వి)గా నేదైన నుంచి యప్పుదీయ వలెనని నీయొద్దకు వచ్చితిమి". అని చెప్పఁగా కాబుయూదుఁడు "అట్లైన మీభార్యలనుకుదువ పెట్టుఁడు" అని చెప్పెను. చూచితిరా! పశుప్రాయుఁడైన కాబు యూదుని గుణములెంత హీనదశలో నున్నవి. అదివిని "నీవు చాల సౌందర్యవంతుఁడవు. నీయొద్ద మాస్త్రీలను కుదువ పెట్టలేము" అని బదులు చెప్పిరి. అపుడు కాబు "మీబిడ్డలను కుదువ పెట్టుఁడు" అని చెప్పెను. "అట్లు చేయలేము. అప్పు

కొఱకు బిడ్డలను కుదువపెట్టినామను అపకీర్తి భరింపలేము. మాఖడ్గములు తాకట్టుగాఁ బెట్టెదము" అని బదులు చెప్పిరి. అటులైన రాత్రివేళ రమ్మని కాబు చెప్పెను. వాఁడు చెప్పిన ప్రకారము ముహమ్మదుబిన్ముస్లిమా మఱియు అబూనా యిలా కాబు ఒద్దకు పోఁగా వాఁడు గృహము నుండి బయ టికివచ్చెను. వారిద్దఱు మాట్లాడుచు కాబును పట్టుకొని వధించి తమగృహమునకు వచ్చిచేరిరి. అట్లుకాబుబిన్ అష్రపు వలన ముసల్మానులకు కలుగుచుండిన బాధ తొల్గెను.

## గత్ఫాను గజ్వా

—: దాసూరు ఇస్లాములో చేరుట. :—

దాసూరుబిన్హారిసు అనునాయకుఁడు హిజ్రీమూఁడవయేఁట అరబ్బులలో 'బనీసాలబా' 'బనీముహారిబ్' అను రెండుకుటుంబముల నుండి 540 మందియుద్ధవీరులను దీసికొని మదీనాపై దాడివెడలి దోఁచుటకై వచ్చుచుండెను. అది పైగంబరులవారికిఁ దెలిసి దాసూరును మార్కొనుటకై మదీనా నుండి వెడలిరి. ఆవిషయము దాసూరు తెలిసికొని భీతిల్లి పాఱిపోవుచు కొండలలో దాఁగుకొనెను. దైవవిధిగా నపుడు వర్షము కురిసెను. పైగంబరులవారిసైన్యము తడిసిపోయిన దుస్తులు తీసియెండఁ బెట్టెను. పైగంబరులవారు కూడ తమ దుస్తులను ఒకచెట్టునకు తగిలించి విశ్రాంతి కొఱకు చెట్టునీడను పరుండిరి. దాసూరు, పైగంబరులవారు ఒంటరిగా పరుండుట చూచి యిదే మంచిసమయమని తలఁచి పైగంబరులవారిని వధించుటకై వచ్చెను. వాఁడు పైగంబరులవారిని సమీపించి ఖడ్గము దూసి "ఓయి! ముహమ్మదు నాచేతినుండి నిన్నెవరు

రక్షింపఁగలరు? అని పలుకఁగా "అల్లా రక్షించునని" పైగంబరులవారు చెప్పిరి. అది విని దాసూరు వణఁక సాగెను. మఱియు వానిచేతిలోని ఖడ్గము నేలపై పడిపోయెను. పైగంబరులవారు ఖడ్గము నెత్తికొని "ఓయిదాసూరు! నాచేతి నుండి నిన్నెవరు రక్షింపఁ గలరు అని అడుగఁగా ఎవరును లేరు" అనివణఁకుచు చెప్పెను. అది విని దయాసముద్రులైన పైగంబరులవారు "భయ పడకుము. నిన్ను క్షమించితిని" అని చెప్పఁగా తత్క్షణమే దాసూరు పైగంబరులవారి దయా గుణమునకు లొంగి ఇస్లాములో చేరెను. దాసూరు తన కుటుంబములవారికిని ఇస్లామును గూర్చి బోధింపఁగా వారంద ఱును ఇస్లాములో చేరిరి. చూచితిరా! వధింపవచ్చిన దాసూరు పైగంబరులవారి సుగుణములకు లోఁబడి యిస్లాముబోధకుఁడై మరలెను.

—: నజ్రాను గజ్వా. :—

బనీసలీము అనుకుటుంబమువారు మదీనాపై దాడి వెడలవలెనని కుట్రసలుపుచు నొకచోట చేరిరి. పైగంబరుల వారికది తెలిసి 300 మంది శిష్యులను తీసికొని మదీనా నుండి వెడలి నజ్రాను అనుప్రదేశము చేరిరి. పైగంబరులవారు వచ్చు చున్నారను విషయము బనీసలీమువారికిఁ దెలిసి మరలి తమ గ్రామము చేరిరి. అందుచే పైగంబరులవారును నజ్రానునుండి మరలి తమగ్రామము చేరిరి. ఆప్రయాణము నందు యుద్ధము సంభవింపలేదు.

వారికి ఖురైషుల విషయము తెలిసి యిద్దఱు శిష్యులను ఖురైషుల విషయము తెలిసికొని వచ్చుటకై పంపిరి. వారిద్దఱు పోయి ఖురైషులు మదీనా సమీపించుచున్నా రనువార్త దెలిపిరి. ఖురైషులు బుధవారమునాఁడు ఒహదుకొండకు సమీపమున నిలిచిరి. పైగంబరులవారు శుక్రవారమునాఁడు నమాజు చేసినపిదప వేయిమందిశిష్యులతో ఖురైషులను మార్కొనుటకై మదీనా నుండి వెడలిరి. మధ్యలో వంచకుల నాయకుఁడగు అబ్దుల్లాబిన్ ఉబై అనువాఁడు తన మున్నూఱు మంది వంచకులను తీసికొని పైగంబరులవారిని విడిచిపెట్టి మదీనాపురమునకు పోయెను. ఆకుట్ర రహస్యముగా అబ్దుల్లాబిన్ సలాలును ఖురైషులును పన్నియుండిరి. కాని ముసల్మానులు అట్లుచేయలేదు. అపుడు ఎవరుభక్తులు ఎవరుద్రోహులు అను విషయము తేట తెల్లమాయెను.

—: బాలురకు యుద్ధమునందలి యుత్సాహము. :—

ముసల్మానుల సైన్యములో కొందఱు బాలురుండిరి. వారికి యుద్ధమునకు తగిన వయస్సు లేనందున పైగంబరులవారు మదీనాకు పంపివేసిరి. పైగంబరులవారు రాఫెబిన్ ఖదీజును "నీవు బాలుఁడవుగానున్నావు. మదీనాకు పోవచ్చును" అని చెప్పఁగా నతఁడు యుద్ధమునందుత్సాహము కలిగి కాలిమ్రేళ్ల పై నిక్కిసిలిచి "నేనుయుద్ధము చేయఁగలను" అని బదులు చెప్పఁగా నతనిని సైన్యములో చేరవచ్చునని సెలవిచ్చిరి. అది చూచి సమ్రా అనుబాలుఁడు "నేను కుస్తీలో రాఫెబిన్ ఖదీజును పడవేయుదును కావున అతనికి సైన్యములో చేరుటకు సెలవిచ్చిన నాకుఁగూడను సెలవియ్యవలెను" అని పైగంబరుల

వారితో విన్నవించెను. దానిపిదప వారిద్దఱిమధ్య కుస్తీ జరుగఁ
గా రాఫేయు సమ్రాను పడఁగొట్టెను. అప్పుడు సమ్రాను కూడ
సైన్యములో చేర్చుకొనఁబడెను. మూఁడింతలా వారికి యుద్ధము
నడుపుగల యుత్సాహము.

— : యుద్ధరంగము : —

పైగంబరులవారు ఉహుదుకొండను తమకు వెనుకప్ర
క్కగా నుండునట్లు చేసికొని నిలిచి సైన్యమునొక్క కొండాను
ముసియిబ్‌బిన్ జుబైరుగారి చేతికప్పగించిరి. కొండవెనుకటి
దిక్కు నుండి శత్రువులసైన్యము వచ్చునను సందేహముచే
బాణములవేయు 50 మందివిల్లుకాండ్లను కొండపై నియమించి
విజయముకలిగినను, అపజయము కలిగినను స్థానము వదల
కూడదనియు పైగంబరులవారు ఆజ్ఞాపించిరి. హజ్రత్
అబ్దుల్లాబిన్‌జుబైరుగారు బాణములు వేయుసైన్యమునకు నాయ
కులుగా నుండిరి. ఖురైషులు కూడ తమసైన్యమును యుద్ధ
రంగమందు సవరించి నిలిపి దానిజెండా తలహాచేతికి నిచ్చిరి.
మొట్టమొదట 14 మందిఖురైషులస్త్రీలు తమసైన్యమునకు
రోషముపుట్టించుటకై "మేము ఆకాశ నక్షత్రముల కుమార్తె
లము. (తివాసి) ఖాలీసులపై నడచువారలము. మీరు ముం
దంజవేసి యుద్ధమాడినచో మిమ్ము కౌఁగిలించుకొందుము.
వెనుకంజవేసి యుద్ధమాడక పోయినచో మిమ్మువీడుదుము."
అని పాడసాగిరి. దానిపిదప ఖురైషులసైన్యము నుండి జెండా
పట్టిన తలహా వచ్చి "ఓముసల్మానులారా! మీలో నెవ్వరైన

నన్ను మార్కొనువారు గలరా?' అనిపౌరుషముగాఁ బలికెను హజ్రత్ అలీగారు తక్షణమే యుద్ధరంగమునకు దుమికి "నేను న్నానని పలుకుచు ఖడ్గముతో తలహాను ఒకదెబ్బలోనే వధించిరి. తలహా నేలఁగూలఁ గానే యతనికుమారుఁడగు ఉస్మాను జెండా నెత్తికొనెను. అపుడు పైగంబరులవారి పినతండ్రియగు హజ్రత్ హంజా వాని మార్కొని ఖడ్గముతో నొకదెబ్బ వేయఁగా వానినడుముపటకు తెగిపోయెను. అంత రెండుసైన్యములు కలిసియుద్ధము చేయసాగెను. హజ్రత్ హంజా హజ్రత్ అలీ హజ్రత్ అబూదజానా ఖురైషులసైన్యమును నేలఁ గూల్చుచుపోవుచుండిరి.

—: హంజాగారు స్వర్గలోకము చేరుట :—

వహ్షీఅను హబషీబానిస హజ్రత్ హంజాను వధించవలెనని ఒకఱాతిచాటున దాఁగియుండెను. వాఁడు జుబైరు బిన్ ముతియిమ్ యొక్క దాసుఁడు. బదరుయుద్ధములో జుబైరుపినతండ్రిని హజ్రత్ హంజాగారు వధించియుండిరి. అందుచే జుబైరు వహ్షీబానిసతో హంజాను వధించినచో దాస్యము నుండి విడిచిపెట్టెదనని మాట యిచ్చియుండెను. హజ్రత్ హంజా ఖురైషులసైన్యమును చీల్చుచుపోవుచువహ్షీ దాఁగి యున్నచోటుకు సమీపింపఁ గానే మఱుగు నుండివాఁడు చిన్న బల్లెముతో గుఱిపెట్టి హజ్రత్ హంజాపై వైచెను. ఆబల్లెము హజ్రత్ హంజా నాభిలోఁ దగిలివీఁపువఱకు దూసికొని పోయెను. హజ్రత్ హంజాగారు వహ్షీనివధించుటకు యత్నిం

విరి. కాని నేలపై పడిపోయి ప్రాణమువిడిచి స్వర్గలోకముచేరిరి.

ముసల్మానుల సైన్యము తక్కువగా నున్నప్పటికిని మహాశౌర్యముతో యుద్ధమాడుచు ఖురైషులసైన్యమును తఱుమసాగెను. ఖురైషుల పెద్దనాయకులు వధింపఁబడిరి. ఖురైషులసైన్యము చెల్లాచెదరై పాఱిపోవసాగెను. ముసల్మానులు ఖురైషులు పాఱిపోవుట చూచి కొల్లసొమ్మును కూర్చుటకు మొదలుపెట్టిరి. కొండపైనున్న ముసల్మానులు విజయము గలిగెనన్న సంతోషముచే కొల్లసొమ్మును సేకరించుటకై తమ స్థానమును విడిచిపెట్టిరి. అబ్దుల్లాబిన్ జుబైరు వారించెను. కాని కొందఱుతప్ప అందఱు తమస్థానము విడిచివేసిరి. అది చూచి ఖురైషులపక్షముననున్న ఖాలిదుబిన్ వలీదు పాఱిపోవుచున్న ఖురైషులను సేకరించుకొని కొండవెనుకటివైపు నుండి వచ్చి ముసల్మానులపైఁ బడి ఘోరయుద్ధము గావించెను. కొండపైనున్న కొందఱు ముసల్మానులు ఖురైషులను మారుకొని స్వర్గలోకము చేరిరి. దానివిపిక ఖాలిదుబిన్ వలీదు కొల్లసొమ్మును సేకరించుచున్న ముసల్మానులపై అకస్మాత్తుగా వచ్చి వధింపసాగెను. ముసల్మానులు తొందరపాటుతో మారుకొనిరి. కాని దొమ్మిలో తమవారిని శత్రువులను గుర్తింపలేక కొందఱు ముసల్మానులు ముసల్మానులచేతనే వధింపఁబడిరి. అట్లు యుద్ధము జరుగుసమయములో పైగంబరులవారు వధింపఁబడిరి అను వదంతి పుట్టెను. ముసల్మానులు ఆవదంతి విని ధైర్యమువీడి చెల్లాచెదరైపోయిరి. ముసల్మానులు ప్రాణములకుఁ దెగి ధైర్యముతో యుద్ధముచేయుచు పైగంబరుల వారిని వెదకుచుండిరి. కొందఱుముసల్మానులు పైగంబరులవారు

వధింపఁ బడినారను వదంతి విని మేము యుద్ధము చేసి యేమి
గారు వారినిచూచి పైగంబరులవారే వధింపఁబడినపిదప మన
ము బ్రతికి లాభమేమి? లెండు అనిపురికొల్పి శత్రువులను
మార్కొని 80 గాయములు తగిలి తుదకు స్వర్గలోకముచేరిరి.
ముసల్మానులు పైగంబరులవారిని వెదకుచుండిరి. కాబుబిన్
మాలెకు పైగంబరులవారిని గుర్తించి పైగంబరులవారు సజీ
వులుగా నున్నారని ముసల్మానులకుఁ దెలిపెను. అదివిని
ముసల్మానులందఱు పైగంబరులవారున్న ప్రదేశమునకూడిరి.
అది ఖురైషులు చూచి పైగంబరులవారిపై బాణములు వి
సరారిరి. అబ్దుల్లాబిన్ ఖమయ్యా అనుఖురైషు వీరుఁడు సైన్య
మును చీల్చుచువచ్చి పైగంబరులవారిని సమీపించిముఖము
పై ఖడ్గముతోఁ గొట్టెను. ఆదెబ్బచే పైగంబరులవారి శిర
స్త్రాణము యొక్క కడియములు తలలో దూఱిముఖము నెత్తురు
తో నిండిపోయెను. పైగంబరులవారిపై నలుప్రక్కల నుండి
ఖురైషులు బాణములు ఖడ్గములు వైచుచుండిరి. ముసల్మా
నులు పైగంబరులవారి చుట్టుక్రమ్ముకొని యాబాణములను
ఖడ్గములను అడ్డగించుచు స్వర్గలోకము చేరుచుండిరి. హజ్
రత్ అబూదజానాగారు తమరొమ్మును డాలుగా పైగంబరుల
వారి వైపు చేసి శత్రువులబాణములను పైగంబరులవారికి
తగులకుండ నాపుచుండిరి. ఆసమయమునందే యొకదుష్టుని
రాతిదెబ్బచే పైగంబరులవారిపల్లు విఱిగిపోయి పెదవులకు
గాయముతగిలి నెత్తురు కాఱసాగెను. ఆసమయమందు సాదు
బిన్ అభాసుగారు మహాశౌర్యముతో దుష్టులపై బాణవర్షము
లు కురిపించిరి. రెండుమూఁడు ధనుస్సులు కూడ విఱిగిపోయె

ను. అట్లు ఘోరయుద్ధమందు ముసల్మానులు స్థిరముగా నిలిచి ప్రయోజన మని చింతలో మునిఁగి కూర్చుండిరి. తర్వాత వారు పైగంబరులవారితోఁ గూడఁ గొండపై నెక్కి నిలిచిరి. అప్పుడు శత్రువులు పర్వతమునకు నెక్కఁజూచిరి కాని ముసల్మానులు వారి పై రాళ్లు విసరిరి. అందుచే ఖురైషులు రాలేకపోయిరి. ఆఘోరయుద్ధమందు 70 మంది ముసల్మానులు శూరులు స్వర్గలోకము పొందిరి. ఖురైషులు ముసల్మాను శవములను క్రూరముగా ముక్కు చెవులను కాళ్లుచేతులను కోసికడుపులను చీల్చియంగహీనులఁ గావించిరి. అబూసుఫియాన్యొక్క భార్యయగు హిందా హజరత్ హంజాగారి కడుపును చీల్చి కాలెజాను తీసి నమలి మ్రింగలేక యుమ్మివేసెను. ముష్రికులు హజరత్ హంజాను క్రూరముగా నంగహీనునిఁగాఁ జేసిరి. ఆనవాలు పట్టుటకు కూడవీలు లేకుండెను.

పైగంబరులవారు వధింపఁ బడిరనువార్త మదీనాపురము చేరఁగానే ముసల్మానులు దుఃఖముతో మదీనా నుండి పరుగెత్తుకొని వచ్చి పైగంబరులవారున్న చోటున చేరి శాంతించిరి. బీబీ ఫాతిమాగారు వచ్చి పైగంబరులవారి ముఖము నుండి నెత్తురు కారుట చూచి తుడువసాగిరి. హజరత్ అలీగారు డాలుతో నీళ్లు తీసికొని వచ్చుచుండిరి. బీబీఫాతిమాగారు పైగంబరులవారి ముఖము నుండి నెత్తురు కడుగుచుండిరి. కాని నెత్తురు నిలువక కారుచునే యుండెను. అపుడు బీబీఫాతిమాగారు చిఱుచాఁపను కాల్చి దానిని గాయముపై కట్టగా నెత్తురు నిలిచి పోయెను.

ఒహాదు యుద్ధసమయములో గాయముతగిలిన వారికి

బీబీఆయిషాగారును, ఉమ్మెసల్మాగారును నీళ్లుత్రాగనిచ్చు చుండిరి. (అప్పటివఱకు గోషాధర్మము విధింపఁబడకుండెను.)

హజ్రత్ హంజాగారి చెల్లెలగు బీబీసఫియ్యాగారు ముసల్మానులకు పరాజయము గలిగెనను వార్త విని మదీనానుండి వెడలి ఒహదుకొండకు వచ్చిరి. పైగంబరులవారు హజ్రత్ హమ్జాగారి శవమును బీబీసఫియ్యాగారికి చూపవలదని చెప్పిరి. ఆ సంగతి బీబీసఫియ్యాగారువిని "నేనునాయన్నగారి విషయము వినియున్నాను. దుష్టులు వారిని అంగహీనులుగాఁ జేసినారు. కాని అట్టివిదేవునిమార్గమందుసంభవించెను. కావున అది యొక దుఃఖమేనా? నేను నాయన్నగారిశవము దర్శింతు" నని పైగంబరుల వారితో చెప్పిరి. అపుడు పైగంబరులవారు శవమును చూడవచ్చునని సెలవిచ్చిరి. బీబీసఫియ్యాగారు పోయిచూచి సహించి తమయన్నగారి కొఱకు దేవునిని ప్రార్థించిరి.

—: అబూసుఫ్యాను సంభాషణ. :—

ఖురైషుల నాయకుఁడగు అబూసుఫ్యాను ఒహదుకొండకెదురు గానున్న తిప్పపై నెక్కి "అచ్చట ముహమ్మదున్నాఁడా"? అని కేకవేసెను. "దానికి బదులియ్యకూడదు"అని శిష్యులతో పైగంబరులవారు చెప్పిరి. మరల "అబూబకరున్నాఁడా? అని అబూసుఫ్యాను కేక వేసెను. "జవాబియ్యకూడ" దని పైగంబరులవారు శిష్యులతో చెప్పిరి. మూఁడవతూరి "ఉమరున్నాఁడా?" అని కేక వేసెను. దానికి బదులు రానందున "అందఱువధింపఁబడినారు" అని అబూసుఫ్యాను పలికెను. అదివిని హజ్రత్ ఉమరుగారు సహింపలేక "ఓ దేవుని శత్రువుఁడా! ఇదిగో మేమందఱము సజీవులుగానున్నాము" అ

చె ఱలిరి. అప్పుడు అబూసుఫ్యాను "ఓలుహుబల్ ఓహుబలు (విగ్రహము) పూజింపబడును గాక." అని చెప్పెను. ముసల్మానులు పైగంబరులవారి యాజ్ఞచే "అల్లాహు అలా, వ అజల్" అల్లా (దేవుఁడే) ఘనుఁడు. మహోన్నత సర్వాధికారి యని చెప్పిరి. అప్పుడు "లనల్ ఉజ్జా వలా ఉజ్జాలకుమ్ మాకొక ఉజ్జావిగ్రహ మున్నది. మీకు లేదు" అని అబూసుఫ్యాను పలికెను. అప్పుడు ముసల్మానులు "అల్లాహు మౌలానా వలా మౌలాల కుమ్ దేవుఁడు మా సహాయుఁడు; మీకెవఁడును సహాయుఁడు లేఁడు" అని పలికిరి. అప్పుడు "ఈ యుద్ధము బదరుయుద్ధమునకు ప్రతీ కారము. రాబోవునేఁటి మరల బదరు ప్రదేశములో కలుసు కొనవలెనని అబూసుఫ్యాను చెప్పెను. ముసల్మానులు "సరే అల్లా కోరిన"మ్మని జవాబులనిచ్చిరి.

—: ఖురైషులు మరలుట. :—

పిదప ఖురైషులు మరలి మక్కాపురమునకు వెడలిరి. వారేమిచేసిరని దెలిసికొనుటకు హజరత్ అలీగారు పైగంబరుల వారిసెలవుగొని వెంబడించి ఖురైషులు మక్కాపురమునకు పోవుచున్నారనుసంగతి నిశ్చయమేయని మరలివచ్చి తెల్పిరి. దానిపిదప పైగంబరులవారు యుద్ధరంగమందు వధింపఁబడిన భక్తులశవములను ఒక్కొక్కసమాధిలో నిద్దఱిద్దఱినిగాఁ జేర్చి పూడ్చి మరల మదీనాపురమునకు వచ్చిచేరిరి. ఒహాదు యుద్ధము. శనివారమునాఁడు జరిగెను. అబూసుఫ్యాను మక్కాపురమునకు పోవుచు మరలి వచ్చి ముసల్మానులను నాశము చేయవలెనని యుద్దేశించెను. ఆవిషయము పైగంబ

రులువారు తెలిసికొని రెండవదినము ఆదివారమునాడు మదీనా నుండి 8 మైళ్లదూరమునయున్న హమ్రావుల్ అసద్ అను ప్రదేశమునకు పోయిరి. కాని అబూసుఫ్యాను భీతిల్లి తన సైన్యమును తీసికొని యుద్ధమాడక మక్కాపురమునకు పయనమాయెను. పైగంబరులవారచట బుధవారము వఱకు నిలిచి మదీనాపురమునకు వచ్చిరి.

ఉహదు యుద్ధమును గూర్చి ఖురానెషరీఫులో ఆలె ఇమ్రాను అను సూరాలో వివరముగానున్నది.

—: హసను గారి జననము. :—

హిజ్రీమూడవయేట బీబీఫాతిమాగారికి కుమారుడు గలిగెను. ఆయనకు హసన్ అని పేరు పెట్టిరి. ఆయననే ఇమామ్ హసన్ గారు అనెదరు.

—: బీబీ హఫ్సా వివాహము. :—

హిజ్రీమూడవయేట హజరత్ ఉమర్ కుమార్తెలగు బీబీహఫ్సాగారిని పైగంబరులవారు పెండ్లాడిరి.

—: బీబీ జైనబు వివాహము. :—

ఆయేటనే బీబీజైనబు (బిన్తెఖుజైమా)గారిని పైగంబరులవారు వివాహమాడిరి.

—: బీబీ ఉమ్మెకుల్సూము వివాహము. :—

బదరుయుద్ధకాలమున పైగంబరులవారి కుమార్తె బీబీ రుఖయ్యా(హజరత్ ఉస్మానుగారి భార్య)గారు మరణించియుండిరి. అందుచే హిజ్రీమూడవయేట పైగంబరులవారి కుమార్తెలగు బీబీఉమ్మెకుల్సూమును హజరత్ ఉస్మానుగారు

వివాహమాడిరి. హజ్రత్ ఉస్మాను పైగంబరులవారి యిద్దఱు కుమార్తెలను ఒకరితరువాత నొకరిని పెండ్లి యాడినందుచే వారు జున్నూరైను (రెండు జ్యోతులు గలవారు) అనుబిరుదు పొందిరి.

హిజ్రీమూఁడవయేఁట సంభవించిన విషయములనుగూర్చి వ్రాసితిమి. ఇఁక నాలుగవయేఁట జరిగిన విషయములను గూర్చివ్రాయుదుము.

హిజ్రి నాలుగవయేఁడు.

—: అరబ్బుల విరోధము. :—

అరేబియాదేశములో నుండువంశములలో ఒకటిరెండు తప్ప మిగిలిన వన్నియు ఇస్లామునకు శత్రువులై యుండెను. ఎందుకనగ ఆవంశములన్నియు విగ్రహములను పూజించునట్టివి. ఇస్లాము విగ్రహారాధనను తుదముట్టఁ జేయునది. దానికిఁ దోడుగ కాబామందిర (హజ్) కొఱకు అరబ్బులుమక్కాపురమునకు వచ్చినప్పుడు వారినిఖురైషులు ఇస్లామునకు విరుద్ధముగ పురికొల్పుచుండిరి. బదరుయుద్ధములో ముసల్మానులకు విజయము గలిగినందుచే అరబ్బులు ముసల్మానులపై దాడివెడలుటకు జంకుచుండిరి. కాని ఒహదుయుద్ధములో ముసల్మానులకుఁ గలిగిన పరాజయముచే జంకుచున్న అరబ్బులకుటుంబములు ధైర్యము గలిగి ముసల్మానులతో యుద్ధమాడుటకు యత్నింపసాగెను. అట్లు అరబ్బులు మదీనాపై దాడివెడలుటకు యత్నించుచుండుట పైగంబరులవారికిఁ దెలిసి అరబ్బులను మందలించుటకై తమ శిష్యులను పంపుచుండిరి. పైగంబరులవారు పోక తముశిష్యులనే పంపినచో దానిని సరియ్యా అనుదురు. హిజ్రి

నాలుగినయేఁడు సరియ్యాలు పెక్కులు సంభవించినవి. ఇఁక వాని వార్త వ్రాయుదము.

హాజ్రినాలుగవయేఁట మొహర్రముసెలలో తులైహా, సల్మా అనువారు పైగంబరులవారితో యుద్ధముచేయుటకై సైన్యము కూర్చుకొనియున్నారనువిషయము పైగంబరుల వారికిఁ దెలిసి వారిని మార్కొనుటకై 150మందిముసల్మానులపై అబూసల్మాగారిని నాయకులుగాఁ జేసిపంపిరి. అబూసల్మాగారు సైన్యముతీసికొని వచ్చుచున్నవార్తను తులైహా సల్మాల సైన్యము విని భీతిల్లి యుద్ధమాడకయే చెల్లాచెదరైపోయెను. అబూసల్మాగారు మరల మదీనాపురమునకు వచ్చిచేరిరి.

మొహర్రముసెలలోనే ఖాలిదుకుమారుఁడగు సుఫ్యాను అనువాఁడు మదీనాపురముపై దాడివెడలవలెనని కుట్రలు చేయుచుండెను. పైగంబరులవారి కిది తెలిసి వానిమార్కొనుటకై అబ్దుల్లాబిన్ఉనైసుగారి నంపిరి. వారు పోయి యుక్తితో సుఫ్యానును వధించి తిరిగిమదీనాపురమువచ్చిచేరిరి. అంతటితో సుఫ్యాను చేసియున్నకుట్ర అంతమొందెను.

రజీసరియ్యా.

—: ముస్లిం ల ద్రోహము. :—

హాజ్రీనాలుగవయేఁట సఫరుసెలలో అజుల్ ఖార్రా కుటుంబములవారు పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చి "మాకుటుంబములవారు ఇస్లాములో చేరినారు. ఇస్లాముధర్మములను మాకునేర్పుటకై యెవరినైన పంపుఁడు" అని విన్నవించిరి. పైగంబరులవారు పదిమందిశిష్యులనుపంపిరి. వారిలో

ఆసిముబిన్ సాబితుగారు నాయకులుగా నుండిరి. వారు రజీ అను ప్రదేశమును చేరిరి. అది అస్ఫానునకును, మక్కాకును మధ్యనున్నది. పిలుచుకొని పోవుచున్నవారు నమ్మకద్రోహము చేసి బనూలహియాను అనుకుటుంబములవారికి ముసల్మానుల ను వధించునట్లు సైగచేసిరి. 200 మంది అబూలహియానులు ముసల్మానులను వెంబడించిరి. వారిలో 100 మంది బాణములు వేయుయోధులుండిరి.

ముసల్మానులు వారి కుట్రను దెలిసికొని ఒకకొండపై నెక్కినిలిచిరి. కాఫర్లు "ఓముసల్మానులారా! మీరు దిగిరండు. వధింపము. అభయము నిచ్చుచున్నాము" అని చెప్పిరి. కాని ఆసిముగారు "నేను కాఫర్ల అభయము నమ్మను. మీశరణు చొరను" అని చెప్పి యుద్ధమాడిరి. ఆయుద్ధములో ముసల్మా నులు 8 మంది స్వర్గలోకము చేరిరి. మక్కా ఖురైషులు ఆసిమ్‌గారి మరణమును గూర్చి నిశ్చయించుటకుగాను ఆసిమ్ గారి శవమునుండి మాంసపుకండను కోసికొని దెచ్చుటకై మనుష్యులనంపిరి. వారు వచ్చిరి కాని దైవవిధిగా హజ్రత్ ఆసిమ్‌గారిశవమును తేనెటీగలు క్రమ్ముకొని రక్షించుటచే దుష్టులు సమీపింపలేక తిరిగి పోయిరి.

—: ఖుబైబును వధించుట :—

హజ్రత్ ఖుబైబు జైదు దుష్టులమాటనమ్మి కొండ నుండి దిగివచ్చిరి. కాని దుష్టులు నమ్మకద్రోహముచేసి బంధించి వారిని మక్కాపురమునకుఁ గొనిపోయి ఖురైషుల కమ్మివేసిరి. హజ్రత్ ఖుబైబును హారిసుకుమారులు కొనిరి.

హాజరత్ జైదును సఫ్వాను కొనెను. హాజరత్ ఖుబైబును కొన్నిదినముల వఱకు హారిసు కుమారులు తమ ఇంటిలో నుంచుకొనిరి. ఒకదినము ఇంటివారిబిడ్డ యాడుకొనుచు ఖుబైబుగారున్న చోటునకు వచ్చెను. ఖుబైబుగారు బిడ్డను తమ తొడపై కూర్చుండఁ బెట్టుకొనిరి. అచట కత్తి పడియుండెను. ఆబిడ్డ తల్లి అదిచూచి భయపడసాగెను. ఖుబైబుగారు "ఏమి! నేను బిడ్డను వధింతునని తలఁచి భీతిల్లుచున్నావా? మేమట్లు ద్రోహము చేయువారము కాము" అని ధైర్యము చెప్పిరి. చూచితిరా! శత్రువుల బిడ్డను గూర్చి వారు చూపిన కనికరము! హారిసు కుమారులు ఖుబైబుగారిని పురముబయట వధించుటకై తీసికొనిపోయిరి. దుష్టులు వధించుటకు పూర్వము "నేను రెండురకాతులు నమాజు చేయుదు" నని ఖుబైబుగారు అడిగిరి. దుష్టులు సెలవిచ్చిరి. హాజరత్ ఖుబైబుగారు నమాజు ముగించి యింకను ప్రార్థించుటకై మనస్సుండెను గాని "మీరు నేను చావునకై భయపడి యాలస్యము చేయుచుచున్నానని తలంతురని శీఘ్రముగా నమాజుముగించితి" నని పలికిరి. దానిపిదప ఖుబైబుగారు వధింపఁబడిరి.

—: జైదును వధించుట. :—

దుష్టులు హాజరత్ జైదును వధించు సమయమున ఖురైషులనాయకులు కూడ చూచుటకై వచ్చియుండిరి. వారిలో అబూసుఫ్యాను కూడ నుండెను. వధించువాఁడు వచ్చి ఖడ్గముపూని యున్నపుడు అబూసుఫ్యాను "ఓయీ! జైదు! సత్యము పలుకుము. నీకు బదులుగా నిపుడు ముహమ్మదు

వధింపఁబడినదో నీయుపష్టమని నీవు తెలిసికొందువుగదా! అని హాజరత్ జైదును ప్రశ్నించెను. అప్పుడు హాజరత్ జైదు “దేవునితోడు! నాప్రాణము రక్షింపఁబడుటకై హాజరత్ పైగంబరులవారి పాదములలో నొక ముల్లైనను గ్రుచ్చుకొనుటకు నేను సహింపను” అని చెప్పెను. (చూచితిరా! ముసల్మానులకు పైగంబరులవారియందున్న భక్తి!) పిదప హాజరత్ జైదుగారు వధింపఁబడిరి.

## శ్రీ రెమఊనా.

### —: అమిరుగావించిన హత్య. :—

సఫరునెలలో అబూబరా అనువాఁడు పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చి ‘నజ్దు’ దేశములో ఇస్లాము ప్రచారమునకై కొందఱినిబంపుఁడని విన్నవించెను. పైగంబరులవారు “నజ్దువారు ద్రోహముచేయుదురేమో అను సందేహము గలదు” అనిచెప్పిరి. అబూబరా “నేనువారికి అభయము నొసంగుదు” నని చెప్పెను. 70 మంది ముసల్మాను భక్తులను వారివెంట నంపిరి. వారిలో మున్జిరుబిన్ అమరుగారు నాయకులుగా నుండిరి. వారు శ్రీరెమఊనా అను ప్రదేశమునకు పోయినిలిచి పైగంబరులవారియుత్తరమును హరాముబిన్ మల్హానుగారి చేతనిచ్చి ఆమిరుబిన్ తుఫైలు ఒద్దకు నంపిరి. ఆమిరుఒద్దకు హరాముగారు లేఖతీసికొని పోఁగా నతఁడు హరాముగారిని వధించెను. ఆమిరు చుట్టుపట్లనున్న రిఅల్ జక్వాను ఉసయ్యా అను కుటుంబములవారిని ముసల్మానులతో యుద్ధ

మూపట్టకై పురికొల్పి గొప్పసైన్యముసేకరించుకొని బీరెమఊనాకొద్ద ముసల్మాను భక్తులను మార్కొని ఘోరయుద్ధము గావించి ముసల్మానులను వధించెను. ముసల్మానులలో అమ్రుబిన్ ఉమయ్యాగారిని మాత్రము పట్టుకొని వారితలవెండ్రుకలను కోసి ఆమిరువదలిపెట్టెను. వారుమరలి మదీనాపురమునకు వచ్చుచుండగ మార్గమందు ఆమిరు కుటుంబము వారిద్దఱు కనంబడిరి. వారిద్దఱికి పైగంబరులవారు అభయమొసంగియుండిరి. అది తెలియక అమ్రుబిన్ ఉమయ్యాగారు వారిద్దఱిని పగవారి పక్షమువారిని తలంచి వధించిరి. దాని పిదప మదీనాపురముచేరి జరిగిన వృత్తాంతమంతయు పైగంబరులవారికి విన్నవించిరి. ఆమిరు కావించిన ఆఘోరహత్యను వినిన పైగంబరులవారికి మహాదుఃఖము కలిగి ద్రోహముచేసి ముసల్మానులను వధించినట్టి కుటుంబములను ఒకనెలవఱకు నమాజులో శపించుచుండిరి. అమ్రుబిన్ ఉమయ్యాగారు పొరపాటుగా వధించినవారి అపరాధమును పైగంబరులవారిప్పించిరి.

## బనీనజీరు గజ్వా.

—:యూదుల కుట్ర.:—

అమ్రెఉమయ్యాగారిచే పొరపాటుగా వధింపఁబడిన వారిద్దఱిహత్యకు ప్రతీకారముగా నియ్యఁబడు అపరాధపు (దియత్) సొత్తును యూదులు కూడనియ్యవలసియుండెను. ఆయూదులలో బనీనజీరు కుటుంబములవారి యొద్దకు

పైగంబరులవారు కొందఱు శిష్యులతో గూడ పోయియుండిరి. బనీనజీరు యూదులు పైగంబరులవారు పోయినందుకు సమ్మతించిరి. కాని రహస్యముగా పైగంబరులవారిని వధించుటకై కుట్ర పన్నిరి. పైగంబరులవారు గోడక్రింద కూర్చుండియుండిరి. మిద్దెమీదనుండి నొక పెద్దఱాతిని పైగంబరులవారి తలపై వేయవలెనని యూదులందఱు నాలోచించి యొక యూదుని మిద్దెపై కెక్కించిరి. దేవుండు పైగంబరులవారికి యూదులు పన్నిన కుట్రను దెలిపెను. తత్క్షణమే పైగంబరులవారు బయటికి పోవువారివలె నటించి అచటినుండి లేచి మదీనాపురము చేరిరి. శిష్యులు పైగంబరులవారి రాకకెదురు చూచుచు పైగంబరులవారు వచ్చుటకు ఆలస్యమైనదేయని తలంచి యచటినుండి లేచి పైగంబరులవారిని వెదకసాగిరి. తుదకు పైగంబరులవారు మదీనాకు పోయినారని తెలిసి శిష్యులు కూడ మదీనాకు పోయిరి. పైగంబరులవారు తమశిష్యులకు యూదులు చేసిన కుట్రను గూర్చి తెలిపిరి. ఆకుట్రచే యూదులు చేసియున్న ఒడంబడిక రద్దాయెను. అందుచే పైగంబరులవారు యూదులకు పదిదినముల వఱకు నాలోచించుటకై గడువిచ్చిరి. అంతలో వంచకుల నాయకుండైన అబ్దుల్లాబిన్ సలూలు "మీరు భయపడవలదు. మీరుముసల్మానులతో యుద్ధమాడుడు. నేను మీకు సహాయముగా రెండువేల యుద్ధవీరుల సైన్యమును దీసికొనివచ్చెదను. బనూఖురైజా యూదులు కూడ మీకు తోడుపడుదురు" అని రహస్యముగా బనీనజీరులకు కబురంపెను. ఆవంచకుని మాట నమ్మి బనీనజీరుయూదులు పైగంబరులవారిని యుద్ధమునకై రమ్మని

పిలిచిరి. పైగంబరులవారు యూదులను మార్కొనుటకై పోఁగా బనీనజీరుయూదులు కోటలోనికిపోయి తలుపులుమూసి కొని పైగంబరులవారి సైన్యముపై రాళ్లురువ్వుచు బాణములు వేయుచు యుద్ధము చేసిరి. వంచకులనాయకుఁడును బనూఖురైజాయూదులును బనీనజీరువారికి సహాయము చేయలేదు. తుదకు బనీనజీరు భీతిల్లి మేమిండ్లు విడిచి సిరియా(షామ్) దేశమునకుఁ బోవుదుము. అని పైగంబరులవారికి కబురంపిరి. పైగంబరులవారు దానికిసమ్మతింపఁగా బనీనజీరువారు తమ సొత్తులను ఒంటెలపై వేసికొని యుద్ధసాధనములను వదలి మేళములు వాయించుకొనుచు మదీనాపురము విడిచి పోయిరి. యూదులలో కొందఱునాయకులు ఖైబరు పోయి చేరిరి. అట్లు మదీనాపురమునకు సమీపమునమన్న యూదుల వలని ఉపద్రవము శాంతించెను.

—: బదరు రెండవ గజ్వా. :—

ఒహదుయుద్ధము ముగిసినపిదప ఖురైషులనాయకుఁడు అబూసుఫ్యాను తిరిగి బదరుచోటున యుద్ధమునకై రావలసినదని ముసల్మానులతో చెప్పఁగా సరేయని ముసల్మానులొప్పుకొనిరి. ఆవాగ్దానము పూర్తి చేయుటకై హిజ్రీనాలుగవయేఁట షాబాను నెలలో పైగంబరులవారు 1500మంది శిష్యులతో బదరునకై పయనమైరి. ఆసైన్యముయొక్క జెండా హజ్రత్ అలీగారి చేతికిచ్చిరి. పైగంబరులవారు బదరుచేరి 8 దినములవఱకు ఖురైషుసైన్యమున కెదురుచూచిరి. కాని అబూసుఫ్యాను 2000 మంది సైన్యమును తీసికొని మక్కానుండి కొన్నిమైళ్ల వఱకువచ్చి కఱవుకాలములో యుద్ధ మాడ

కూడదను చాటు పెట్టుకొని భీతిల్లి, తనసైన్యమువారిని సమా
ధానపఱచి మరలిమక్కాపురము చేరెను. పైగంబరుల
వారు తమవాగ్దానముప్రాప్తిచేసి తిరిగిమదీనాపురమువచ్చిచేరిరి.

—: హుసైనుగారు జన్మించుట. :—

నాలుగవయేట బీబీఫాతిమాగారికి రెండవకుమారుల
గు హజరత్ హుసైనుగారు జననమొందిరి.

—: అబ్దుల్లాగారి మరణము. :—

హజరత్ పైగంబరులవారి కుమార్తెలగు బీబీరుఖ
య్యాగారి కుమారులగు అబ్దుల్లాగారు 6 సం॥ వయస్సులో
హిజ్రీనాలుగవయేట మృతినొందిరి.

—: బీబీజైనబుగారు పరలోకము చేరుట. :—

పైగంబరులవారి భార్యలగు బీబీజైనబు (బిన్తెఖుజై
మా)గారు హిజ్రీనాలుగవయేట కాలధర్మముచేసిరి. ఆయేట
నే వారి వివాహమైయుండెను.

—: ఉమ్మెసల్మాగారి వివాహము. :—

నాలుగవయేట షవ్వాలు నెలలో వితంతువులుగానున్న
బీబీఉమ్మెసల్మాగారిని పైగంబరులవారు వివాహమాడిరి.

—: హిబ్రూ భాష. :—

హిజ్రీనాలుగవయేట యూదులభాషయగు హిబ్రూను
నేర్చుకొనుటకై జైదుబిన్‌సాబితును పైగంబరులవా రాజ్ఞా
పించిరి. జైదుగారు హిబ్రూభాషను 15 దినములలో చదువు
టకును వ్రాయుటకును నేర్చుకొనిరి. దానిచే హిబ్రూభాషలో
నుత్తరములు వ్రాయుటకు పైగంబరులవారికి సౌకర్యముకలి
గెను. యూదులచే వ్రాయించవలెనన్న తారుమారు చేయు

మనస్సున సందేహము వారికుండెను.

—: వ్యభిచార శిక్ష. :—

యూదుడొకండు ఒకయూదస్త్రీతో వ్యభిచారము చేసెను. యూదులు పైగంబరులవారియొద్దకు తీర్మానమునకు వచ్చిరి. తౌరేతుశాస్త్రప్రకారము వ్యభిచారము చేసినవారిని రాళ్లతో కొట్టి చంపవలసియున్నది. అట్టిశాస్త్రప్రకారమే పైగంబరులవారును తీర్మానము చేసిరి. దాని ప్రకారమే హిజ్రీనాలుగవయేట వ్యభిచారముచేసిన వారిద్దరుయూదులను రాళ్లతో కొట్టి చంపిరి.

—: సారాయి నిషేధము. :—

సారాయి అన్ని దుర్గుణములకు మూలము. సర్వనాశనమునకు కారణము. దానివలన అనేక దౌర్జన్యములు అన్యాయములు జరుగును. అట్టి నష్టకరమైన మత్తును గూర్చి త్రాగకూడదని హిజ్రీనాలుగవయేట దేవునాజ్ఞయాయెను. దానిగూర్చి ఖురానెషరీఫులో నిషేధాజ్ఞయున్నది. త్రాగువారికి శిక్షయు నున్నది.

—: బీబీ జైనబు గారి వివాహము. :—

జైదు బాల్యమందు శత్రువులచేతిలో చిక్కి బానిసయై హజరత్ పైగంబరులవారిచే విడిపింపఁబడిన విషయము ముందువ్రాసియున్నాము. జైదును పైగంబరులవారు దత్తుకుమారునిగా గ్రహించియుండిరి. జైదుకు యుక్తవయస్సు రాఁగా పైగంబరులవారు తమమేనత్త కుమార్తెయగు బీబీ జైనబును జైదునకిచ్చి పెండ్లి చేసియుండిరి. బీబీజైనబునకును జైదునకును సరిపడలేదు. ఎల్లప్పుడు కలహము జరుగుచుండెను.

తుదకు జైదు పసిగి బీబీజైనబునకు తలాఖు (విడియాకు) ఇచ్చివేసెను. బీబీజైనబు పైగంబరులవారి యాజ్ఞచే జైదును పెండ్లియాడి యుండెను. జైదు విడిచిపెట్టినందున పైగంబరుల వారే యామెను భరించవలసియుండెను. పైగంబరులవారు బీబీజైనబు మనస్సును శాంతింపఁజేయుటకై వివాహమాడుటకుఁ పూనిరి. కాని దత్తకుమారుని భార్యను అరబ్బులు కోడలుగా భావించుచు పెండ్లియాడుట తప్పుగా నెంచుచుండిరి. అందుచే పైగంబరులవారు తమదత్తకుమారుని భార్యను పెండ్లియాడుటకు జంకుచుండిరి. దత్తకుమారుఁడు సొంతకుమారుఁడుగా కాలేదు కావున దేవుఁడు అట్టి యాచారమును రద్దుచేయుటకై పైగంబరులవారు బీబీజైనబును పెండ్లియాడవలెనని సెలవిచ్చెను. దేవునాజ్ఞయైనపిమ్మట ప్రజలకు జంకవలసిన విధి పైగంబరులవారికి లేదు. కావున పైగంబరులవారు బీబీజైనబును వివాహమాడిరి. ఆ వివాహముచే లోకములో దత్తకుమారుని సొంతకుమారునిగా భావించుచున్న యాచారము రద్దుపడెను. ఇస్లాము మతములో దత్తకుమారునికి సొంతకుమారునివలె నెట్టిహక్కులు లేవు. అతఁడుకూడ పరాయివానితో సమానమగును.

—: గోషాధర్మము. :—

బీబీజైనబుగారి వివాహమైన పిమ్మట పైగంబరులవారు తమశిష్యులకు విందుచేసిరి. విందుకు వచ్చిన వారు భుజించిన పిదప మాటలాడుచుండిరి. దానివలన పైగంబరులవారికి కష్టముగలిగెను. అప్పటి వఱకు గోషాధర్మము కూడ లేకుండెను. పైగంబరులవారు వచ్చి మాట్లాడుచున్న వారిని పొండని

చెప్పలేకుండిరి. అపుడు స్త్రీలు పరాయి పురుషులతో పర్దా చేయవలెననియు బయటికి వెడలిన స్త్రీలు దుప్పటి కప్పుకొని బుర్ఖావేసికొని వెడలవలెనని దేవునాజ్ఞ యాయెను.

—:హిజ్రీ అయిదవ యేఁడు:—

మక్కా ఖురైషులును యూదులును పన్నినకుట్రలచే మక్కా నుండి మదీనాపైకి యుద్ధాగ్ని రగులుకొనెను. అరబ్బుల ప్రతికుటుంబమువారును మదీనాపైదాడివెడలి ముసల్మానులను నాశనముచేయవలెనని యత్నింపసాగిరి.

హిజ్రీఅయిదవయేఁట రబీఉల్ అవ్వల్ నెలలో దౌమతుల్ జన్దల్ అనుచోటున శత్రువులు గొప్పసైన్యము సేకరించుచున్నారు అనువార్త పైగంబరులవారికిఁ దెలిసి వేయిమంది శిష్యులతో పైగంబరులవారు మదీనానుండి వెడలిరి. వారు వచ్చుచున్నారు అనువార్త శత్రువులు విని భీతిల్లి చెల్లాచెదరై పారిపోయిరి. యుద్ధము సంభవించలేదు.

—: బనీ ముస్తలఖ్ లేక మురైసీగ్ జా్వ. :—

ముస్తలఖ్ కుటుంబమువారు మదీనాపై దాడివెడలవలెనని మురైసీ అనుచోటున సైన్యమును కూర్చిరి. వారికి హారిసుబిన్ జిరాదు అనునతఁడు నాయకుఁడుగానుండెను. ఆ విషయము పైగంబరులవారికిఁ దెలిసి హిజ్రీ అయిదవయేఁట షాబాను నెలలో మదీనానుండి వెడలిరి. మురైసీఅనుచోటున యుద్ధము జరిగెను. ముస్తలఖ్ వారు ఓడిపోయిరి. ఆయుద్ధములో శత్రువుపక్షమున 10 మంది వధింపఁబడిరి. 600 మంది పట్టువడిరి. 2 వేల ఒంటెలును 5 వేల మేఁకలును కొల్లసొమ్ము(గనీమత్)గా ముసల్మానులకు లభించెను. యుద్ధములో

అక్కొల్లసొమ్మును ఆసించి వంచకులుకూడ ముసల్మానులతో కూడి యుద్ధమునకై వచ్చిరి. కాని లోలోపల శత్రువుల పక్షమున తోడుపడుచు అన్సారీలకు ముహాజిర్లకు నడుమ ద్వేషము కల్పించుటకు యత్నించుచుండిరి. వంచకుల నాయకుడగు అబ్దుల్లాబిన్ సలూలు ఆసమయమందు అన్సారులను ముహాజిర్లకు విరుద్ధముగా పురికొల్పి కలహము కలుగునట్లు చేసెను. కాని పైగంబరులవారు దానిని అణచివేసి అబ్దుల్లాబిన్ సలూలు చేసిన కుట్రకు అతనిని శిక్షింపక క్షమించిరి.

—: బీబీ జువైరియా వివాహము. :—

ఆయుద్ధమున పట్టువడిన ఖైదీలలో సేనాధిపతియగు హారిసు యొక్క కుమార్తె బీబీ జువైరియా కూడ నుండెను. ఆమెతండ్రి పైగంబరులవారి సన్నిధికి వచ్చి "నాకుమార్తెను వదలిపెట్టుడు" అని విన్నపించెను. అపుడు పైగంబరులవారు "నీకుమార్తె తన యిష్టప్రకారము చేయవచ్చును" అని చెప్పిరి. ఆమెతండ్రి పైగంబరులవారి సెలవును దెలిపెను. ఆమె "నేను పైగంబరులవారిని సేవించుటకిష్టపడుచున్నాను" అని బదులిచ్చెను. ఆమెయిష్టము పైగంబరులవారికిఁ దెలిసి యామెను పెండ్లియాడిరి. పైగంబరులవారు బీబీజువైరియాను వివాహమాడిన విషయము ముసల్మానులకుఁ దెలిసి తమతమ భాగములలో బానిసలుగా వచ్చిన ఖైదీలను వదలిపెట్టిరి. దానివలన అందఱికి మహాసంతోషము గలిగెను.

—: బీబీఆయిషాగారిపై వంచకులు మోపిన అపనింద :—

పైగంబరులవారు ముఱైసీనుండి తిరిగి మదీనాకు పయనమైరి. ఒకరాత్రి యొకచోటున నిలిచిరి. బీబీ ఆయిషా

గారు కాలకృత్యములకై సైన్యము నుండి కొంతదూరము
పోయి తిరిగి తమచోటునకు వచ్చిరి. ఆమధ్యలో విలువైన
హారము తెగి దారిలో పడిపోయెను. దానివెతకుటకై తిరిగి
తాము కాలకృత్యములకై పోయియున్న చోటునకు పోయి
వెతకుటలో చాల ఆలస్యమాయెను. బీబీఆయిషాగారు తిరిగి
వచ్చునప్పటికి సైన్యము పయనమైయుండెను. వారు
[illegible] కూర్చుండియుండి యటులే నిద్రపోయిరి. తెల్ల
వాఱునపుడు సఫ్వానుగారు అను ముసల్మానులు అచటినుండి
పోవుచు బీబీఆయిషాగారిని గుర్తించి ఇన్నాలిల్లాహి వయిన్నా
ఇలైహి రాజిఊన్ అనిచెప్పఁగా బీబీఆయిషాగారు నిద్రనుండి
మేలుకొనిరి. సఫ్వానుగారు సైన్యమును వెంబడించుచు నే
లైన వస్తువు సైన్యమువారు మఱచిపోయిన దాని నెత్తుకొని
వచ్చువారు. కావునవారు బీబీఆయిషాగారు సైన్యమునుండి
విడిపోవుటను చూచి ఒంటెనునిలిపి కూర్చుండఁబెట్టఁగా బీబీ
ఆయిషాగారు ఒంటెనెక్కి. సఫ్వానుగారు ఒంటెముక్కుత్రాడు
పట్టుకొని నడచుచు శీఘ్రముగా పోయి సైన్యములో చేరిరి.
బీబీఆయిషాగారు ఆలస్యముగా వచ్చుటచూచి వంచకులును
వారినాయకుఁడైన అబ్దుల్లాబిన్ సలూలును పరమ పవిత్రు
రాలైన బీబీఆయిషాగారిపై అపనింద మోపిరి వంచకులకు
తోడుగ కొందఱుముసల్మాను భక్తులు కూడను ఆయపనిందను
సత్యమేయని తెలియక చెప్పుచుండిరి. ఆవిషయము పైగంబ
రులవారికిఁ దెలిసి చాలచింతించిరి. అది బీబీఆయిషాగారికి
నొక నెల పిదప తెలిసి మహాదుఃఖముతో దేవుని ప్రార్థించు
చుండిరి. ఆయపనిందచే బీబీఆయిషాగారికి నిద్రాహారములు

లేకుండెను. ఒకదినము పైగంబరులవారు బీబీఆయిషాగారితో
దాని గూర్చి సంభాషించుచుండఁగ దేవుఁడు బీబీఆయిషాగారి
పవిత్రతను గూర్చి సందేశము (వహీ) పంపెను. అపనిఁద
మోపిన వారికి 80 కొరడాదెబ్బలు శిక్షగా కొట్టవలెనని
ఆజ్ఞాపించెను. అట్లు బీబీఆయిషాగారి పవిత్రతను గూర్చి
దేవుఁడు సాక్ష్యమిచ్చెను. వంచకులకే అవమానము లభించెను.
అపనిందమోపిన వారికి దేవునాజ్ఞ ప్రకారము శిక్ష విధింపఁ
బడెను. బీబీఆయిషాగారు దేవుని సాక్ష్యమువలన మిక్కిలి
సంతోషించి దేవునికి కృతజ్ఞతలు చెల్లించిరి. బీబీఆయిషాగారి
పవిత్రతను గూర్చి ఖురానెషరీఫుయొక్క సూరెనూరులో
వివరముగానున్నది.

### ఖన్దఖు (అగడ్త) యుద్ధము.

—: శత్రువులు దాడివెడలుట. :—

బనీనజీరులో కొందఱుయూదులు ఖైబరు అను యూ
దులపురమునకు పోయియుండిరి. వారిలో హుయియాబిన్ అఖ్త
బు, సలాముబిన్ అబిల్ హుఖైఖ్ అనువారు ముఖ్యనాయకులు.
వారు మక్కాపురమునకు బోయి ముసల్మానులను నాశము
చేయవలెనని ఖురైషులను పురికొల్పిరి. ఖురైషులు ముందు
గానే మదీనాపై దండెత్తవలెనని యుండిరి. యూదులు కూడ
తోడుపడుదురనువార్త వినినంతనే ఖురైషులకు చాల ఉత్సా
హము గలిగెను. యూదులనాయకులు గత్ఫానుకుటుంబముల
వారి యొద్దకుపోయి వారికి ఖైబరురాఁబడిలో సగము నిచ్చెద
మని యాసచూపిరి. గత్ఫానువంశమువారు కూడ మదీనాపై
దాడివెడలుటకు సిద్ధమైరి. అట్లాయూదులు ఖురైషులు మొద

లైన అరబ్బులకుటుంబములవారు ముసల్మానులను నాశము చేయవలెనని పదివేలసైన్యముతో మదీనాపై దాడివెడలిరి.

—: అగడ్త త్రవ్వుట :—

ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి తమశిష్యుల తో నాలోచించిరి. హజ్రత్ సల్మానెఫార్సీగారు "మదీనా పురము చుట్టు అగడ్త త్రవ్వి శత్రువులను మారొ్కనవలెను. మనకును శత్రువుల సైన్యమునకును మధ్య అగడ్తయుండును. కావున శత్రువులు మనల సమీపింపలేరు." అని సలహా చెప్పిరి. పైగంబరులవారు దానికి సమ్మతించిరి. మదీనా యొక్క మూఁడు ప్రక్కల నుండి శత్రువులు వచ్చుటకు వీలులేకుండెను. ఒకదిక్కున శత్రువులు వచ్చుటకు వీలుండెను. ఆవైపునసే పైగంబరులవారు మూఁడువేలశిష్యులతోఁ గూడి హిజ్రి అయిదవయేఁట జూఖాదానెలలో అగడ్త త్రవ్వుటకు నారంభించిరి పదిపదిగజములు త్రవ్వుటకు పదిపదిమందిశిష్యులను నియమించిరి. ఆయగడ్త 5 గజములలోతుగా త్రవ్విరి. ఆయ గడ్తను 20 దినములలో త్రవ్విరి. పైగంబరులవారును శిష్యులతో కలిసి పనిచేయుచు మట్టినెత్తి వేయుచుండిరి. ఒకప్పుడు మూఁడుమూఁడుదినములు పస్తుండి కడుపునకు జాళ్లుకట్టికొని చాలఓర్పుతో పనిచేయుచుండిరి. అగడ్త త్రవ్వునపుడు ఒక పెద్ద కఠినమైనబండ అడ్డు తగిలెను. శిష్యులు పగులఁగొట్టుటకు యత్నించిరి. కాని వారికి శక్యముగాకుండెను. అపుడు పైగంబరులవారు కుద్దాలము తీసికొని "బిస్మిల్లా" అని యాఘాతిని కొట్టఁగా నదిపగిలి యిసుకవలె నాయెను.

రుబిన్ అబ్దుల్లాగారు తమ గృహములో నిద్దఱి ముగ్గురికి చాలు నంత భోజనము వండి పైగంబరులవారిని విందునకు పిలిచిరి. పైగంబరులవారు తమశిష్యులను కూడ పిలుచుకొనిపోయి తమచేతులార ఆభోజనమును వడ్డించిరి. వారిమహిమచే ముగ్గు రికి చాలునంత భోజనమును వేయిమందిశిష్యులు భుజించి తృప్తి చెందిరి.

మఱొకదినము సిఁడికెఁడు ఖర్జూరపుపండ్లను పైగంబరు లవారి మహిమచే అగడ్త త్రవ్వుచున్న శిష్యులందఱును తృప్తి చెందునట్లు భుజించిరి.

—: యూదులు శత్రువులతో కలియుట :—

శత్రువులు 10 వేల శూరుల సైన్యముతో వచ్చి మదీనాపురమును ముట్టడించిరి. యూదుల నాయకుఁడు హుయియాబిన్ అఖ్తబు బనూఖురైజా యూదుల యొద్దకు పోయి వారిని కూడ తనపక్షము చేసికొనెను. బనూఖురైజాయూదు లు పైగంబరులవారితో నొడంబడిక చేసి యుండిరి. యూ దులు పైగంబరులవారితో చేసియున్న యొడంబడికను త్రెంచి శత్రువుల పక్షము చేరి శత్రువులసైన్యమును బలపఱచిరి. ఆ విషయము పైగంబరులవారికిఁ దెలిసి నిజము తెలిసికొనుటకై హాజ్రత్ సాదుబిన్ మఆజును సాదుబిన్ ఉబాదాను యూదుల యొద్దకు నంపిరి. వారిద్దఱు బనీఖురైజాయూదుల యొద్దకు పోయి వారు చేసియున్న ఒడంబడికను జ్ఞప్తికి తెప్పించిరి. వారు "మీకు మాతో పనిలేదు. మేము మహమ్మదు నెఱుంగ ము. ఒడంబడికను గూర్చి మాకు తెలియదు" అని ధిక్కరించి

మాటలాడిరి. వారిద్దఱు మరలి వచ్చి యీసంగతి పైగంబరులవారికిఁ దెలిపిరి.

—: వంచకుల ద్రోహము. :—

ముసల్మానులసైన్యములో వంచకులు కూడచేరి తుదకు మాగృహములలో నెవరును లేరు అను నెపముచే ముసల్మానులను వీడిపోయిరి.

—: యుద్ధరంగము. :—

శత్రువులు అగడ్తను దాటలేక ఱాళ్లురువ్వుచు బాణములు వేయుచు యుద్ధమాడుచుండిరి. కాని దానిచే ప్రయోజనము లేకుండెను. పెద్దపెద్ద ఖురైషులశూరులు రోషముతో వెడల్పుతక్కువగా నున్నచోటు నుండి అగడ్త దాటి ముసల్మానులుండువైపునకు వచ్చి యుద్ధమునకై పిలిచిరి. వారిలో అమ్రబిన్ అబ్దూదు అనునతఁడు వేయిమందికి సమానమైన శూరుఁడు. అతఁడు ముసల్మానుల యెదుటనిలిచి "మీలో నెవరైన నన్ను మార్కొనఁగలరా?" అని మూఁడు పర్యాయములు ప్రశ్నించెను. హజ్రత్ అలీగారు నేనున్నానని బదులు చెప్పిరి. పైగంబరులవారు తమచేతులార హజ్రత్ అలీగారి చేతికి ఖడ్గమిచ్చి తలపాగ కట్టి యంపిరి. అమ్రబిన్ అబ్దూదు గుఱ్ఱము నెక్కియుండెను. హజ్రత్ అలీ గుఱ్ఱము లేక భూమిపై నిలిచియుండెను. అమ్రబిన్ అబ్దూదు దిగివచ్చి "నీవేనా నన్ను మార్కొను వాఁడవు?" అని నవ్వెను. హజ్రత్ అలీ "అవును నిన్ను మార్కొనుటకు వచ్చితిని" అని

హజ్రత్ అలీగారి తలపై కొట్టెను. హజ్రత్ అలీగారు యీ దెబ్బను తమడాలుతో నాపిరి. కాని డాలు తెగి వారితలకు కొద్ది దెబ్బ తగిలెను. అపుడు హజ్రత్ అలీగారు తమఖడ్గము దూసి అమ్రుబిన్ అబ్దూదును కొట్టిరి. వాఁడా దెబ్బచే నేలఁగూలెను. వాని వెంట వచ్చిన యితర ఖురైషులు మరలి పాఱిపోయిరి. వారిలో నౌఫలు అను ఖురైషుఁడు పాఱిపోవుచు అగడ్తలో పడిపోయెను. ముసల్మానులు వానిపై బాణములు వేయ సాగిరి. వాఁడు పైనుండి కొట్టుట మంచిది కాదు అగడ్తలో దిగి మార్కొనుఁడు అని కేకవేసెను. అపుడు హజ్రత్ అలీగారు అగడ్తలో దిగి వానిని మార్కొని వధించిరి.

ఆదినము రెండుపక్షముల నుండి బాణముల వర్షము కురియుచుండెను. నమాజు చేయుటకు కూడ సీలులేకుండి పైగంబరులవారి నాలుగుపూటల నమాజు సమయము తప్పిపోయెను.

## —: సఫియ్యాగారి శౌర్యము. :—

ముసల్మానుల స్త్రీలున్నకోట బనూఖురైజాయూదు లున్న చోటునకు సమీపముగా నుండెను. ముసల్మానులందఱు శత్రుసైన్యమును మార్కొనుటలో మునిఁగియున్నారని తలఁచి యూదులు ముసల్మానుల స్త్రీలున్నకోటను ముట్టడించిరి. ఒక యూదుఁడు కోటతలుపును సమీపించెను. పైగంబరుల వారి మేనత్తయగు బీబీసఫియ్యాగారు యూదుని చూచి కోట దిగివచ్చి గుడారము మేకకొయ్య తీసికొని వానితలపై మోదఁగా వానితల రెండువ్రక్కలాయెను. వాని తలను కోసి కోటవెనుక విసరివేసిరి. అందుచే యూదులు కోటలోఁగూడ

ముసల్మానుల సైన్యమున్నదని తలంచి కోటను ముట్టడింపక వెడలిపోయిరి.

—: తుపాను గాలి. :—

ఖురైషులసైన్యము మదీనాను ముట్టడించి చాల దినములాయెను. దానివలన ప్రయోజనము లేకపోయెను. తెచ్చిన యాహారసామగ్రి ముగిసిపోయెను. చలికాలమగుటచే ఖురైషుల సైన్యమును చలి చాల పీడించుచుండెను. దైవవిధిగా నొక రాత్రి పెద్దగాలి వీచి ఖురైషుల పౌవులమీఁది కుండలు పొరలిపడి గుడారములన్నియు నేలఁగూలెను.

—: శత్రువులు మరలుట. :—

దానివలన ఖురైషులు ధైర్యమును వీడిరి. దానికె తోడుగ బనీఖురైజాయూదులు ఖురైషులను నమ్మకూడదని తలఁచి ఖురైషులను వదలిరి. అపుడు ఖురైషుల సేనాధిపతి యగు అబౌసుఫ్యాను తినుసామగ్రి ముగిసినది. చలిబాధ తీవ్రముగా నున్నది. యూదులు మమ్ము విడిచి పెట్టినారు. కావున తిరిగి మక్కాపురమునకు పోవలసిన దని దండూరా వేయించెను. తుదకు ఖురైషుల సైన్యమును గత్ఫానువారి సైన్యమును ఒక నెలవఱకు మదీనాపురమును ముట్టడించి ముసల్మానులను ఓడించుటకు శక్యము గాదని తలఁచి తమ తమ పురములకు పయనమైపోయెను.

ఈయుద్ధములో ముసల్మానులకు ప్రాణనష్టము గాలేదు. కాని అన్సారులవంశములో ఔసుకుటుంబమునకు పెద్దలుగా నున్న హజ్రత్ సాదుబిన్ మఆజుగారికి శత్రువులబాణము తగి

శత్రువులు మదీనాముట్టడి చాలించి మరలి పోయిన తరువాత పైగంబరులవారును వారిశిష్యులును యుద్ధభూమి విడిచి తమతమ గృహములకు వచ్చిరి.

అజ్రత్ మఆజుబిన్ సాదుగారికి బాణము దెబ్బతగిలి యుండెను. వారిచికిత్స కొఱకు మసీదుముంగిటిలో నొక గుడారము నియమింపఁబడెను. వారు ఆగుడారములో నుండిరి

## —: బనూఖురైజా యూదులను మార్కొనుట. :—

బనూఖురైజాయూదులు మదీనాకు సమీపమున నివసించుచుండిరి. వారు శత్రువుల పక్షము చేరమని ఒడంబడిక చేసియు ఖురైషులతో కలిసి ముసల్మానులతో యుద్ధమాడిరి. ఆయుద్ధమునకు కారకుఁడైన 'హుయియాబిన్ అఖ్తబు యూదుని తమవెంట యూదులు గొనివచ్చిరి. కావున ఆద్రోహులైన యూదులను దండింపవలసియుండెను. దానికొఱకు పైగంబరులవారు బనీఖురైజాయూదులను మార్కొనవలెనని తమశిష్యులకు నాజ్ఞాపించిరి. అపుడే ముసల్మానులందఱు సిద్ధమై వెడలిరి. పైగంబరులవారు సైన్యముతో వచ్చుచున్న వార్త బనీఖురైజాయూదులకుఁ దెలిసి కోటతలుపులు మూసికొని యుద్ధమునకై సిద్ధమైరి. ముసల్మానులు యూదుల కోటను ముట్టడించిరి. ఆముట్టడి ఒకనెలవఱకు సాగెను. తుదకు యూదులే "సాదుబిన్ మఆజు మమ్ములఁగూర్చి యెట్టి తీర్మానముచేయునో యొప్పుకొందుము." అని పైగంబరులవారికి వార్తనంపిరి. పైగంబరులవారు దానికి సమ్మతించిరి. సాదుబిన్ మఆజు కుటుంబముల వారును ఖురైజాయూదులును

పూర్వమునుండి స్నేహభావము గలిగియుండిరి. కాని హాశ్రత్ సాదుగారు 'న్యాయముగా యూదుల ధర్మశాస్త్రప్రకారముగా యూదుల యుద్ధవీరులందఱు వధింపఁబడవలెను. స్త్రీలను బిడ్డలను ఖైదీలుగాఁ జేయవలెను. వారిసొత్తుకొల్లసొమ్ము (గనిమతు) గా పంచిపెట్టవలెను' అని తీర్మానించిరి. యూదులు కూడ సాదుబిన్ మాఆజుగారు తీర్మానించినదానికి నొప్పుకొనిరి. ఆతీర్మానము ప్రకారము యూదుల యోధులు వధింపఁబడిరి. వారిబిడ్డలు స్త్రీలు ఖైదీలుగాఁ జేయఁబడిరి. వారిసొత్తు ముసల్మానులకు పంచిపెట్టఁబడెను. అట్లు యూదుల ధర్మశాస్త్ర (తౌరాతు) ప్రకారము యూదులకుట్ర నగంచెను. వారిగ్రంథమగు పాతనిబంధన (తౌరాతు) లో ద్వితీయోపదేశకాండము 20 వ అధ్యాయము 10 వ వచనమునుండి 14 వఱకు నిట్లు చెప్పఁబడియున్నది.

"యుద్ధముచేయుటకు మీరొకపురము మీదికి సమీపించునప్పుడు సమాధానము నిమిత్తము రాయబారమును పంపవలెను. సమాధానమని అదినీకుపత్తరమిచ్చి గుమ్మములను తెఱచినయెడల దానిలోనున్న జనులందఱు నీకు పన్ను చెల్లించి నీదాసులగుదురు. అది మీతో సమాధానపడక యుద్ధమే మంచిదని యెంచినయెడల దానిని ముట్టడివేయుఁడి. నీదేవుఁడైన యెహోవా దానినీచేతి కప్పగించునప్పుడు దాని లోని మగవారినందఱిని కత్తివాత హతము చేయవలెను. అయితే స్త్రీలను చిన్నవారిని పశువులను ఆపురములో నున్నది యావత్తును దానికొల్లసొమ్మంతటిని నీవు తీసికొనవచ్చును;

నీదేవుఁడైన యెహూవా నీ కిచ్చిన నీశత్రువుల కొల్ల సొమ్మును నీవు అనుభవించుదువు".

హజ్రత్ సాదుబిన్ మఆజుగారు ఖురైజాయూదుల విషయము తీర్మానించినపిదప బాణము తగిలియున్న గాయము వలననే పరలోకము చెందిరి.

## హిజ్రీ ఆఱవయేఁడు

### —: అరబ్బులను మార్కొనుట. :—

హిజ్రీ ఆఱవయేఁడు ప్రారంభమున గత్ఫాను తెగవారును సాలబా అన్మారు కుటుంబములవారును మదీనాపై దాడి వెడలుటకు సైన్యము సేకరించుచున్నారని పైగంబరులవారికిఁ దెలియఁగానే వారు 400 మంది శిష్యులతో శత్రువులను మార్కొనుటకై పయనమై నజ్దా అను ప్రదేశము చేరిరి. పైగంబరులవారు వచ్చుచున్నవార్త తెలిసి శత్రువులసైన్యము పాఱిపోయి కొండలలో దాఁగుకొనెను. ఆసమయమందే నమాజు చేయునపుడు ఆకస్మికముగా శత్రువులు పైఁబడుదురేమో అనుభయముచే సలాతెఖౌఫ్ (శత్రుభయము కాలమున చేయునమాజు) ధర్మము విధింపఁబడెను. (దానితీరు వివరముగా ఫిఖా శాస్త్రగ్రంథములో నున్నది.)

### —: ప్రాణశత్రువును క్షమించుట. :—

ఆప్రయాణమందు ఒకదినము పైగంబరులవారు తమ ఖడ్గము చెట్టునకు వ్రేలాడఁగట్టి దానిక్రింద పరుండియుండిరి. అపుడొక శత్రువు వచ్చి పైగంబరులవారు పరుండుట చూచి చెట్టులో నున్న ఖడ్గము దూసి వధించుటకు సిద్ధముగా నుండఁగా పైగంబరులవారు మేలుకొనిరి. ఖడ్గము దూసియున్న

శత్రువు "నిన్నెవరు రక్షింపఁగలరు?" అని ప్రశ్నింపఁగా "దేవుఁడు రక్షించును" అని వారు బదులు చెప్పిరి. అది వినినంతనే యాశత్రువు వణఁకసాగెను. వానిచేతినుండు ఖడ్గము జాఱి నేలఁబడెను. పైగంబరులవారు ఖడ్గము నెత్తుకొని "నిన్నెవరు రక్షింపఁగలరు?" అనియడుగఁగా "ఓమహానుభావా! నన్నురక్షింపుము" అని వేడుకొనెను. పైగంబరులవారు వానిని క్షమించి వదలిపెట్టఁగా అతఁడు ఇస్లాములో చేరి తన వంశము వారికి బోధించెను. వారు కూడ ముసల్మానులైరి. మరల పైగంబరులవారు మదీనాపురము వచ్చిచేరిరి. ఆప్రయాణమునే జాతుర్‌రిఖా గజ్వా అనుదురు.

పైగంబరులవారు ఆఱవయేఁట మదీనాపురమునకు చుట్టుపట్లనున్న వంశములవారు కుట్రలు సలుపుచుండ వారిని మందలించుటకై తమశిష్యుల ననేకులను పంపిరి.

—: అబూరాఫేయూదుని కుట్ర : —

ఖుదైజాయుద్ధములో హుయియాబిన్‌అఖ్తబు అను యూదుల నాయకుఁడు వధింపఁబడఁగా ఖైబరుయూదులు అబూరాఫేసలాము అనుయూదుని తమనాయకునిగా నియమించుకొనిరి. వాఁడు ఖైబరునకు సమీపముననున్న గత్ఫానుకుటుంబము మొదలైనవారిని మదీనాపురముపై దాడివెడలుటకై పురికొల్పుచు వారికి ధనసహాయము చేయుచు గొప్పసైన్యము కూర్చెను. పైగంబరులవారికి వాని కుట్ర తెలిసి ఆఱవయేఁట రమ్‌జానునెలలో అబ్దుల్లాబిన్‌అతీకుగారితో కొందఱిని తోడు చేసి ఖైబరున కంపిరి. అబ్దుల్లాబిన్‌అతీకుగారు ఖైబరుచేరి రాత్రియందు అబూరాఫేయూదుఁడు పరుండియుండఁగ వానిని

పథించి మదీనాపురము వచ్చిచేరిరి.

—: అసీరు యూదుని హత్య. :—

యూదులు సలాము పిదప అసీరు అను యూదుని నాయకునిగాఁ జేసికొనిరి. ఇతఁడు కూడ తనపూర్వికులవలె ముసల్మానులను నాశముచేయవలెనని ఖైబరుచుట్టు పట్లనున్న గ్రామములకుఁ బోయి మదీనాపురముపై దాడివెడల వలెనని గొప్పసైన్యము కూర్చుచుండెను. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి నిజము దెలిసికొనుటకై అబ్దుల్లాబిన్ రవాహాగారితో నిద్దఱిసితోడుచేసియంపిరి. వారు ఖైబరునకుఁ బోయి అసీరుతోఁ గలిసి మాటలాడి అతఁడు చేయుచున్న కుట్రను దెలిసికొని వచ్చి పైగంబరులవారికిఁ దెలిపిరి. అపుడు పైగంబరులవారు అబ్దుల్లాబిన్ రవాహాగారితో ముప్పదిమంది శిష్యులను తోడు చేసి అసీరు యుద్ధము మానుకొనిన ఖైబరు అధికారము అతనికియ్యఁబడును అనువార్త నిచ్చియంపిరి. అబ్దుల్లాగారు ఖైబరుచేరి పైగంబరులవారిచ్చిన వర్తమానము అసీరునకుఁ దెలిపిరి. అసీరు దానికి సమ్మతించి 30 మంది యూదులను తోడుకొని మదీనాపురమునకు పయనమాయెను. ఖర్ఖరా అనుప్రదేశము చేరిన పిదప అసీరు నమ్మకద్రోహము చేసి తనప్రక్కనున్న అబ్దుల్లాబిన్ ఉనైసుగారి ఖడ్గమును లాగుకొనుటకు ప్రయత్నించెను. వారు విడిపించుకొని "ఓదుష్టుఁడా! నమ్మకద్రోహము చేయయత్నించుచున్నావా?" అని తోలఁగిరి. కాని అసీరు తిరిగి వారిఖడ్గమును లాగుకొనుటకు ప్రయత్నింపఁగా అబ్దుల్లాగారు వానిని ఖడ్గముతోఁ గొట్టిరి. అంత యూదులును ముసల్మానులును కలహింపసాగిరి. తుదకు వారి

మధ్య యుద్ధము జరిగి యూదులలో ఒకఁడుతప్ప అందఱు వధింపఁబడిరి. అబ్దుల్లాబిన్ రవాహాగారు మదీనాపురమునకువచ్చి సంభవించిన విషయమంతయు పైగంబరులవారికిఁ దెలిపిరి.

## హుదైబియా సంధి.

—: ముసల్మానులు కాబాదర్శనమునకై వెడలుట. :—

హజ్రత్ పైగంబరులవారు హిజ్రీఆఱవయేఁట జూఖాదా నెలలో కాబామసీదు దర్శనము కొఱకు 1400 మంది శిష్యులతోఁ గూడి పయనమైరి. కాబామసీదు దర్శనమునకు మాత్రము పయనమైరి. కావున ఆయుధము లేవియు తీసికొన లేదు. ఖడ్గములు సామాన్యముగా ప్రయాణములో నుండునవి కావున అవిమాత్రము తీసికొని పైగంబరులవారును శిష్యులును కాబామసీదును దర్శింపవలెనను ఉత్సాహముతో వెడలిరి. దర్శనము (ఉమ్రా) యొక్క ధర్మముల ననుసరించి ఒంటెలమెడలలో వేయఁబడు బిళ్లలు కూడవేసి యావొంటెలను ముందుముందుగా తోలుకొనుచు పోవుచుండిరి. చూచువారికి కూడ పైగంబరులవారు కాబాదర్శనయాత్ర చేయుచున్నారను విషయములో నెట్టిసందేహము లేకుండెను. కాని ముందుగానే ఖురైషులవిషయము తెలిసికొనుటకుఁగాను ఖుజాఆవంశము వారిలో నొకని పంపిరి. అతఁడు మక్కాపురముచేరి విచారించి ఖురైషులు ముసల్మానులను కాబాదర్శనమునకై రానియ్యరు అనియు ముసల్మానులను అడ్డగించుటకై గొప్పసైన్యము కూర్చుకొనియున్నారనియు తెలిసికొని యావిషయము పైగంబరులవారికిఁ దెలిపెను.

ఖురైషులు ముసల్మానులను అడ్డగించుటకై ఖాలిదు

బిన్ వలీదును 200 మంది యోధులతో పంపిరి. అతఁడు మక్కా నుండి పయనమై గమీమ్ అనుప్రదేశము చేరెను. అది పైగంబరులవారికిఁ దెలిసి మార్గము తప్పించి వేఱుదారిని పోయి హుదేబియా అనుప్రదేశమున నిలిచిరి. హుదేబియా యొక బావిపేరు. ఆపేరుతోనే యచటి ప్రదేశమునకు కూడ హుదేబియా అనుపేరు కలిగెను. అదిమక్కాపురమునుండి 9 మైళ్లదూరమున నున్నది. అచటి బావులలో నీళ్లు లేనందున ముసల్మానుల కిబ్బంది కలిగెను. అప్పుడు పైగంబరులవారు వజూచేసి తమపుక్కిలి నీళ్లను బావిలో వేయఁగా వారిమహిమచే బావిలో నీళ్లు పొంగెను. దానివలన ముసల్మానులకు నీటివసతి గల్గెను.

—: ఖురైషులకు వర్తమానము పంపుట. :—

ఖుజాఆవంశమువారు ఇస్లాములో చేరకున్నను ముసల్మానులతో స్నేహభావముగా నుండిరి. పైగంబరులవారు హుదేబియాచోటున నిలిచియున్నారనువార్త విని ఖుజాఆకుటుంబమునకు పెద్దగానున్న బుదైలు కొంతజతతోఁగూడి పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చి "ఖురైషుల గొప్పసైన్యము మిమ్ము అడ్డగించుటకు వచ్చుచున్నది." అని విన్నవించెను. అపుడు పైగంబరులవారు "ఓబుదైలు! మేముయుద్ధము చేయుటకై రాలేదు. మేము కాబా మసీదు దర్శనము (ఉమ్రా) కొఱకు వచ్చియున్నాము. ఖురైషులు యుద్ధమాడి చాలనష్టము పొందియున్నారు. కావున వారు కొంతకాలము వఱకు మాతో సంధి చేసికొని మమ్ము తక్కిన అరబ్బులు మాల్కొనుటకై వదిలిపెట్టిన ఖురైషులకు మేలు కలుగును. అట్లు చేయు

టకు వారిష్టపడితె పోరుటకే సిద్ధమైనచో మా ప్రాణములున్నంతవఱకు మేము కూడ పోరుదుము. తుదకు దేవుఁడేమి చేయవలెనని యున్నాఁడో అట్లు జరుగును". అనిఖురైషులకుఁ దెలుపుము. అని పైగంబరులవారు చెప్పిరి. బుదైలు ఖురైషుల యొద్దకు పోయి "నేను ముహామ్మదువారి యొద్దనుండి వర్తమానము తెచ్చియున్నాను. మీరు సెలవిచ్చినచో విన్నవింతును" అని చెప్పెను. ఖురైషులలో కొందఱు తుంటరులు ముహామ్మదుని వర్తమానము మాకక్కఱలేదు. అనిచెప్పిరి. కాని వారిలో కొందఱు పెద్దలు వినుపింపుమని చెప్పిరి. అప్పుడు బుదైలు పైగంబరులవారు చెప్పిపంపిన వర్తమానము ఖురైషులకుఁ దెలిపెను.

—:సంధి రాయబారము:—

ఖురైషు పక్షమునుండి పైగంబరులవారితో సంధిని గూర్చి మాటలాడుటకై 'ఉర్వాబిన్‌మస్ఊదు' వచ్చెను. అతఁడు "ఓముహామ్మదు! నీవు ఖురైషులను నాశముచేసితివి. అనుకొనుము. దానివలన ప్రయోజనమేమి? తన తెగనునాశము చేసినవాని నుదహరింపవలెనన్న నీకంటె వేఱొకఁడు దొరకునా? అదియును గాక నీకపజయము గలిగిన నీతోనున్న ముసల్మానులు మమ్ముపలె నెగిరిపోరా?" అని చెప్పెను. ఉర్వా చెప్పిన మాటలువిని హజ్రత్ అబూబకరుగారు కుపితులై ఉర్వాను దూషించి "ఓయీ! మేము పైగంబరులవారిని విడి పరుగెత్తుదుమా? అట్లెన్నఁడును గానేరదు అని చెప్పఁగా ఉర్వావిని "ఈతడెవఁడు" అని పైగంబరులవారిని ప్రశ్నించెను. "అబూబకరు" అని పైగంబరులవారు చెప్పిరి. ఉర్వా అబూ

ఒకరు నాకు మేలు చేసియున్నాఁడు. దానిబదులు చేయలేదు. కావున అతని దూషణకు బదులియ్యనని చెప్పి యూరకుండెను.

—: శిష్యుల భక్తి. :—

ఉర్వా పైగంబరులవారితో సంభాషించి ఖురైషుల యొద్దకుఁ బోయి పైగంబరులవారి యందు ముసల్మానులకున్న భక్తినిట్లు చెప్పనారంభించెను. "ఓ ఖురైషులారా! నేను ఖైసరు కిస్రా నజాషీ మొదలైన రాజుల దర్బారులను చూచి యున్నాను. కాని ముహమ్మదు నందు ముసల్మానుల కున్న భక్తిని విధేయతను ఎచ్చటను చూడలేదు. ముహమ్మదు మాటలాడిన సభయంతయు నిశ్శబ్దముగానుండును. ముసల్మానులు తలలువంచుకొని ముహమ్మదు వారి వంక కన్నులెత్తియైన చూడరు. అతఁడు వజూచేసిన నీళ్లు నేలపై పడనీయక దానినితీసికొని ముఖముపై తుడుచుకొందురు. ముహమ్మదు ఉమ్మివేసినను దానినిభక్తులు నేలపై పడనీయక తీసికొని ముఖములకును చేతులకును పూసికొందురు. ఏమి యీముసల్మానుల భక్తి!"

పైగంబరులవారు ఖురాష్‌బిన్ ఉమయ్యాగారిని సంధిని గూర్చి మాటలాడుటకై ఖురైషులయొద్దకు నంపిరి. ఖురైషులు ఖురాష్‌గా రెక్కిపోయిన పైగంబరులవారి యొంటెను వధించి ఖురాషును కూడ వధించుటకు సిద్ధమైరి. కాని కొందఱు అడ్డుపడి వారినిరక్షింపఁగా వారు పైగంబరుల వారి యొద్దకు వచ్చి జరిగిన వృత్తాంతము తెలిపిరి.

దానితరువాత ఖురైషులు 50 మంది వీరులను ముసల్మానులను మార్కొనుటకు నంపిరి. కాని ఖురైషుల వీరులను

ముసల్మానులు పట్టుకొనిరి. పైగంబరులవారు ఖురైషులను మన్నించి శిక్షింపక విడిచిపెట్టిరి.

—: బైఅతుర్ రిజ్వాన్ :—

పైగంబరులవారు మరల సంధిని గూర్చి ఖురైషులతో సంభాషించుటకై హజ్రత్ ఉస్మాను గారిని పంపిరి. హజ్రత్ ఉస్మానుగారు తమయొక్క బంధువుల రక్షణలో మక్కాపురము ప్రవేశించి ఖురైషులకు పైగంబరులవారి రాయబారమును గూర్చి తెలిపిరి. ఖురైషులు హజ్రత్ ఉస్మానుగారిని తిరిగి పోనీయక మక్కాలోనే పట్టిపెట్టిరి. దానిచే హజ్రత్ ఉస్మానుగారిని ఖురైషులు వధించినారను వదంతి లేచెను. ఆవిషయము పైగంబరువారికిఁ దెలిసి "ఖురైషులు ఉస్మానును వధించియుండినచో ఆ హత్యకు ప్రతీకారము చేయవలెను." అని తమ శిష్యులకు నుపదేశించిరి. ఆయుపదేశ ప్రకారము మేము ప్రాణము లర్పించెదమను శపథము ముసల్మానులందఱు పైగంబరులవారి చేతిలో చెయ్యివేసి కావించిరి. ముసల్మానులు శపథము కావించునపుడు పైగంబరుల వారు ఒక రేగుచెట్టుక్రింద కూర్చుండియుండిరి. ఆశపథమునే 'బైఅతుర్ రిజ్వాన్' అనిచెప్పుదురు. దానిఁగూర్చి ఖురానెషరీపు యొక్క సూరె ఫత్హాలో నున్నది. తుదకు ఉస్మానుగనీ వధవార్త యబద్ధమని తెలిసెను.

ఖురైషులు 'సుహైలుబిన్ అమ్రమను' తనరాయబారిగా నంపిరి. అతఁడు మంచి వాగ్ధాటిగలవాఁడు "ముసల్మానులు ఈతూరి మక్కాపురము ప్రవేశింపక మరలి పోవలసినది" అని ఖురైషులు సంధికి ముఖ్యమైన షరత్తుగాఁ దెలిపిరి,

సుహైలు పైగంబరులవారితో సంధినిగూర్చి సంభాషించెను. తుదకు సంధి కుదిరెను.

సంధిషరత్తులు.

1. ముసల్మానులు ఈయేడు మరలి పోవలసినది.

2. రాంబోవు యేడు వచ్చి మక్కాపురములో మూడుదినములు మాత్రముండవలసినది.

3. యుద్ధసామగ్రులు తీసికొని రాకూడదు. కత్తులు మాత్రము తీసికొనిరావచ్చును, కాని ఆవిసంచులలో దాచి పెట్టవలెను.

4. పూర్వము నుండి మక్కాలో నివసించుచున్న ముసల్మానులను తమవెంట మదీనాకు దీసికొనిపోరాదు. మదీనాపురమునకు బోయిన ముసల్మానులలో నెవ్వరైన మక్కాలో నుండి వలంచిన అడ్డగింపరాదు.

5. కాఫర్లలో లేక ముసల్మానులలో నెవరైన మక్కాపురము నుండి మదీనాపురమునకు వచ్చిన యెడల వారిని తిరిగి మక్కాపురమునకు నంపివేయవలెను. కాని మదీనాపురము నుండి యెవ్వరైన ముసల్మానులు మక్కాపురమునకు వచ్చినచో వారుతిరిగి మదీనాపురమునకు పంపబడరు.

6. అరబ్బుల కుటుంబములవారు ఏపక్షమునైన చేరవచ్చును.

ఆఖన షరత్తును అనుసరించి ఖుజాఆ కుటుంబములవారు పైగంబరులవారి పక్షమున చేరిరి.

సంధిషరతులు పైకిజూచిన ముసల్మానులు లొంగి సంధిని సమ్మతించునట్లును ముసల్మానులకు నష్టకరములుగాను

తోఁచునవి. కాని యీసంధిషరతుల వలన ముసల్మానులకు చాలమేలు కలిగెను. దానిఁగూర్చి ముందు వ్రాయుదుము.

—: అబూజన్దలును ఓడార్పుట :—

సంధిషరత్తులు వ్రాయఁబడకముస్నే ఖురైషుల రాయబారిగా వచ్చియున్నట్టి సుహైలుయొక్క కుమారుఁడగు అబూజన్దలు ముసల్మానుఁడై కాఫర్లనుండి తప్పించుకొని ముసల్మానులయొద్దకు వచ్చెను. కాఫర్లు అతని హింసించుచు సంకెలలువేసి చాలబాధించుచుండిరి. సుహైలు సంధిషరత్తుల ప్రకారము అబూజన్దలును నాకప్పగించవలెనని పైగంబరుల వారితో చెప్పెను. పైగంబరులవారు సంధియింకను వ్రాయఁబడలేదే అని బదులు చెప్పిరి. సుహైలు అట్లయిన మాకు సంధి అక్కఱ లేదని చెప్పెను. పైగంబరులవారు అబూజన్దలును విడిచిపెట్టుమని చాలనలకు చెప్పిరి. కాని సుహైలు సమ్మతింపలేదు. తుదకు విధిలేక పైగంబరులవారు అబూజన్దలును సుహైలుచేతికిచ్చుటకు సమ్మతించిరి. అపుడు అబూజన్దలు ఖురైషులు తన్నుకొట్టినగాయములు ముసల్మానులకు చూపుచు "ముసల్మాను సోదరులారా! ఏమి తిరిగినన్ను దుష్టులచేతి కప్పగించుచున్నారా? 'అని యడుగఁగా ముసల్మానుల మనస్సు కరఁగెను. కాని యేమి చేయఁ గలరు? పైగంబరులవారి యాజ్ఞ నెవరు దాఁటఁగలరు? సంధి యైనది. దాని ప్రకారము చేసితీఱవలెను. కావున పైగంబరులవారు "ఓయి అబూజన్దలు! నీవు ఓర్చుకొనుము. దేవుఁడు నిన్ను రక్షించుమార్గము చూపును. సంధి యైనది. కావున దాని భంగపఱపలేము." అని యూఱడించిరి. తుదకు అబూజన్దలు సంకెళ్ల

తోనే తిరిగి మక్కాకు పోవలసివచ్చెను. సంధియైన పిదప పైగంబరులవారు కాబామసీదు దర్శనము (ఉమ్రా) లభింపనందులకు నచటనే ఖుర్బానీలు చేసి క్షౌరము చేసికొనిరి. పైగంబరులవారు చేసినట్లు ముసల్మానులు కూడ చేసిరి.

— : సంధియే గొప్ప విజయము. : —

ఆయాచారములు ముగించిన పిదప ముసల్మానులు మదీనాపురమునకు పయనమై పోవుచుండగా మార్గమందు దైవసందేశమిట్లు పైగంబరులవారికి వచ్చెను. ఇన్నాఫతహ్నాలక ఫత్హన్-ముబీనా (మేము నీకు స్పష్టమైన విజయము నొసంగితిమి). ముసల్మానులందఱు హుదైబియా సంధిని పరాజయముగా తలంచుచుండిరి. కాని దేవుడు దానినే విజయము అని సెలవిచ్చుచున్నాడు. దానివలన గలిగిన ఫలితమును బట్టిచూడ ఆసంధియే గొప్పవిజయమని ముసల్మానులు నిశ్చయించుకొనిరి. ఇంతవఱకు ముసల్మానులును కాఫర్లును ఒకరితో నొకరు కలియుటకు వీలు లేకుండెను. సంధియైనందున కాఫర్లు ముసల్మానులతోఁ గలిసి సంభాషించి ఇస్లాముధర్మములను దెలిసికొనుచుండిరి. వ్యాపారము కొఱకు కాఫర్లు మదీనాపురమునకు వచ్చుచుండిరి. పైగంబరులవారి యొక్కయు ముసల్మానుల యొక్కయు సుగుణములను సత్ప్రవర్తనమును వారుచూచి ఇస్లాము నవలంబించుచుండిరి. మక్కావిజయము హిజ్రీ యెనిమిదవయేఁట నాయెను. ఆమధ్య రెండుసంవత్సరములలో పెక్కురు కాఫర్లు స్వయముగానే ఇస్లాములో చేరిరి. సంధివలన దేశము శాంతముగా నుండెను. పైగంబరులవారికిని ముసల్మానులకును ఇస్లాము ప్రచారము చేయుటకు మంచియవ

కాశము లభించెను. అట్టియవకాశము చేకూరుట ఇస్లాము నకు గొప్పవిజయ సూచకమే గదా!

—: ఖురైషులు సంధినాలుగవ షరత్తును రద్దు చేయుట. :—

సంధిషరతులలో మక్కానుండి పాఱివచ్చిన ముసల్మానులను తిరిగి ఖురైషులకు నప్పగించవలసియుండెను. అందు పురుషులను మాత్రమే తిరిగి పంపవలసియుండెను. స్త్రీలను గూర్చి సంధిషరత్తులలో లేకుండెను. కావున కొందఱు ముసల్మానుస్త్రీలు మక్కానుండి వచ్చిరి. కాని తిరిగి వారిని మక్కావారికి కప్పగించలేదు. విధిలేక కొందఱు ముసల్మానులు మక్కాలోనే యుండిరి. ఖురైషులు వారిని చాల హింసించుచుండిరి. అందుచే ముసల్మానులు మక్కానుండి మదీనాకు పాఱి వచ్చుచుండిరి. సంధియైనపిదప మొట్టమొదట అబూబసీరు అనువారు మక్కానుండి మదీనాపురమునకు పాఱివచ్చిరి. ఖురైషులు పైగంబరులవారి యొద్దకు నిద్దఱిని పంపిరి. వారిద్దఱు సంధిషరతు ననుసరించి అబూబసీరును తిరిగి మక్కాపురమునకు పంపుఁడని పైగంబరులవారికి విన్నవించిరి. పైగంబరులవారు అబూబసీరును ఖురైషుల కప్పగించిరి. అబూబసీరు విధిలేక మహాదుఃఖముతో ఖురైషులవెంట పయనమయ్యెను. జుల్‌హలైఫా అనుచోటు చేరినపిదప అబూబసీరు ఒక కాఫరును వధించెను. రెండవవాఁడు తప్పించుకొని పైగంబరులవారి యొద్దకు వచ్చి అబూబసీరు కావించిన విషయము తెలిపెను. అంతలో అబూబసీరు కూడ పైగంబరులవారి యొద్దకు వచ్చి "ఓమహానుభావా! మీరు మీవిధిప్రకారము నన్ను అప్పగించితిరి. మీధర్మము నెఱవేఱెను. నేను శత్రు

వులచేతినుండి తప్పించుకొనుట కట్లు చేసితినని విన్నవించి మదీనానుండి వెడలి సముద్రతీరమందున్న 'ఈసు' అను ప్రదేశ మున వసింపసాగెను. అబూబసీరు 'ఈసు' అనుచోట బసచేసి యున్నవార్త విని మక్కాలోనుండి ఖురైషులచే హింసింపఁబడుచున్న ముసల్మానులు పాఱిపోయి 'ఈసు' ప్రదేశము చేరుచుండిరి. కొద్దిదినములపిదప చాలమంది ముస ల్మానులు ఈసుప్రదేశమున చేరిరి. వారు సిరియాదేశము నుండి వచ్చు ఖురైషుల వర్తకులను మార్గ్యాచు తమ జీవనోపా యము జరుపుకొనుచుండిరి. అట్లు జరుగుటచూచి ఖురైషు లు విసిగి మక్కానుండి ముసల్మానులు మదీనాకు పోవచ్చును. మేము అడ్డగింపము. కావున సంధిలోనున్న యీషరతును రద్దుచేయవలెనని పైగంబరులవారికిఁ దెలిపిరి. పైగంబరులవా రు దానికి సమ్మతించి ఈసుప్రదేశములో నున్న ముసల్మానుల ను మదీనాకు రప్పించుకొనిరి. అప్పటి నుండి ఖురైషువర్తకుల కెట్టియాటంకము కలుగకుండెను.

## —: రాజులకు ఇస్లామును గూర్చి లేఖలు పంపుట :—

హుదైబియాసంధి యగుటచే పైగంబరులవారికి ఇస్లాము ప్రచారము చేయుటకై యవకాశము లభించెను. ఒకదినము శిష్యులందఱిని సభగావించి "ఓజనులారా! దేవుఁడు నన్ను సర్వజగత్తుకై ప్రవక్తగాఁ జేసిపంపియున్నాఁడు. ఏసు క్రీస్తుగారి శిష్యులవలె నాపక్షము నుండి దైవసందేశము లోక మంతకును దెలుపుఁడు" అని పైగంబరులవారు ఉపన్యసించిరి. దానిపిదప చుట్టుపట్లనున్న దేశపురాజు లందఱికిని ఇస్లామును గూర్చి యుత్తరములు తమశిష్యులచేతనిచ్చి పంపిరి. వాని

గూర్చి యిఁక వ్రాయుదుము.

—: రోమను రాజునకు లేఖ. :—

రోమను దేశపు రాజగు హిర్కలు (ఖైసరు) యొద్దకుహాజ్రత్ దెహియా కల్బిగారు ఉత్తరము తీసికొనిపోయిరి. రోమను రాజు క్రైస్తవుఁడు. కొన్ని సంవత్సరములకు ముందు ఈరాను దేశపురాజు రోమను దేశమును కొంతవఱకు జయించియుండెను. తిరిగి పగతీర్చుకొనుటకై హిర్కలురాజు గొప్పసైన్యము సేకరించుకొని ఈరాను రాజును ఓడించెను. రోమనురాజు విజయము గలిగెనని మహావైభవముతో జైతుల్ ముఖద్దసునకు వచ్చి యచట దేవునికి కృతజ్ఞత చెల్లించుటకై బసచేసియుండెను. ఆసమయమందే పైగంబరులవారి యుత్తరమును దెహియాకల్బిగారు హిర్కలురాజున కందఁజేసిరి. రాజు వారిని చాల గౌరవించెను. పైగంబరులవారి విషయము విచారించుటకై గొప్పదర్బారుగావించి వ్యాపారముకొఱకు సిరియా దేశమునకు వచ్చియుండిన ఖురైషులవర్తకులను పిలిపించెను. ఆవర్తకుల లో ఖురైషుల నాయకుఁడై యిస్లామును విరోధించుచున్న అబూసుఫ్యాను కూడ నుండెను. హిర్కలురాజు ఖురైషుల వర్తకులతో "మీలో నెవఁడు ముహమ్మదునకు దగ్గఱిబంధువు?" అని ప్రశ్నించెను. అబూసుఫ్యాను "నేను అతని దగ్గఱిబంధువుఁడను" అనిచెప్పెను. "నేను అతనిగూర్చి యడుగునది నిజముగా పలుకుము." అనిరాజుచెప్పి మిగిలిన ఖురైషుల వర్తకులను వెనుక నిలువఁబెట్టి "అబూసుఫ్యాను అబద్ధము చెప్పిన మీరు దానిరద్దు చేయుఁడు." అని యాజ్ఞాపించెను. మరల

జరిగెను.

హిర్క్లు:—ముహమ్మదు వంశ మెట్టిది?

అబూసుఫ్యాను:—చాల శ్రేష్ఠమైన గొప్ప వంశము.

హి:—ఆయనవంశములో నింతకు పూర్వ మెవండైన నేను ప్రవక్తయని పలికియున్నాడా?

అ:—లేదు.

హి:—ఆయనవంశములో నెవండైన రాజై యున్నాడా?

అ:—లేదు.

హి:—ముహమ్మదు మతమునుపట్టిన వారు సాధువులైన పేదలా? లేక గర్వులా?

అ:—పేదలును సాధువులును.

హి:—అతనిశిష్యులసంఖ్య హెచ్చుచున్నదా? లేక తగ్గుచున్నదా!

అ:—దినదినము హెచ్చుచున్నది.

హి:—ప్రవక్త పదవికి పూర్వమతండు ఎప్పుడైన అబద్ధము పలికియున్నాడా?

అ:—లేదు.

హి:—అతండు కావించిన యొడంబడికకు వ్యతిరేకముగాం జేసినాడా?

అ.—లేదు. ఇంతవఱకుం జేయలేదు. అతనికిని ఖురైషులకును సంధిజరిగియున్నది. దానింగూర్చి యేమిచేయునో తెలియదు.

హి:—మీరు అతనితో నెప్పుడైన యుద్ధమాడినారా?

అ:—యుద్ధమాడినాము.

హి:—యుద్ధముల ఫలితమేమి యాయెను?

అ:—ఒకప్పుడు మేమును మఱొకప్పుడు అతఁడును విజయము పొందియున్నారము.

హి:—అతఁడేమి బోధించును?

అ.—దేవుఁడు ఒక్కఁడే యనియు, దేవునినే పూజింపవలెననియు విగ్రహారాధన చేయకూడదనియు నమాజు (ప్రార్థన) చేయుఁడు అనియు భక్తిగలిగి సత్యము పలుకుఁడు అనియు బంధువులకు మేలుచేయుఁడనియు సత్ప్రవర్తకులై యుండుఁడనియు బోధించును.

ఆసంభాషణ ముగిసినపిదప హిర్ఖలురాజిట్లు ఖురైషుల వర్తకులతోఁ జెప్పెను. "మీరు ముహమ్మదు వంశము శ్రేష్ఠమైనది యని చెప్పితిరి. వాస్తవముగ ప్రవక్తలు శ్రేష్ఠమైన వంశములోనే పుట్టుదురు. మీరు ముహమ్మదు వంశములో ప్రవక్తయని చెప్పినవాఁడు లేఁడని చెప్పితిరి. అట్లు కానిచో ముహమ్మదు కూడ నతని పూర్వికులవలె ప్రవక్తయని పలుకుచున్నాఁడని నేను తలంచియుందును. కాని అట్లు తలంపలేను. ముహమ్మదు వంశములో నెవఁడును రాజుకాలేదని మీరు చెప్పితిరిగదా! అటులైనచో నతనికిని పూర్వికులవలె రాజ్యమందు ఆశయున్నదని తలఁచియుందును. కాని అట్లు తలఁచుటకు వీలులేదు. ముహమ్మదు ఎన్నఁడును అబద్ధము పలుకలేనిద మీరు చెప్పియున్నారు. మనుష్యుల విషయమే అబద్ధము పలుకనివాఁడు దేవునివిషయమై అబద్ధమెన్నఁడును పలుకఁడు. పేదలును సాధువులును ముహమ్మదు శిష్యులగుచున్నారని

మీరు చెప్పితిరి. అవును మొట్టమొదట నిరుపేదలే ప్రవక్తలను అనుసరింతురు. ముహమ్మదు శిష్యులసంఖ్య హెచ్చుచున్నది. అని మీరు పలికితిరి. అవును సత్యమైన మతము దినదినము వృద్ధిపొందును. ముహమ్మదు ఎన్నడును ఆడినమాట తప్పలేదని మీరు చెప్పితిరిగదా! నిజముగ ప్రవక్తలు మోసగింపరు. ఆడినమాట తప్పరు. ముహమ్మదు భక్తిసత్ప్రవర్తనము గూర్చి బోధించును. అని మీరు చెప్పితిరిగదా! అట్లైనచో తప్పక నేనున్నస్థలము సతనిక్ వశమగును. ఒక ప్రవక్త రానున్నాడని తలంచియుంటిని. కాని ఆయన అరబ్బులలో పుట్టునని తలంచియుండలేదు. నేను ఆయన సమ్ముఖమునకుఁ జేరఁగలిగినచో ఆతనిపాదములను కడిగియుందును". అని పలికి పైగంబరులవారి యుత్తరమును సింధు దర్బారులో చదువుటకై హిర్ఖలురాజు ఆజ్ఞాపించెను. పైగంబరులవారి యుత్తరమిట్లు రాజసభలో చదువఁబడెను.

"బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్ మిన్ ముహమ్మదిన్ అబ్దుల్లాహి వరసూలిహీ_ఇలాహిర్ఖలి_అజీమిర్_రూమ్_సలాముఁ_అలామనిత్_తబఅల్ హుదా_అమ్మా_బాదు_ ఫయిన్నీ అద్_ఊకబదిఆయతిల్ ఇస్లామి_అస్లిమ్_తస్లిల్_యూతి_కల్లాహు_అజ్రక_మర్రతైని_ఫయిన్_తవల్లైత_ఫఅలైక_ఇస్మల్ అరీసీయీన_వయూఅహ్లల్ కితాబి_తఆలౌ_ఇలాకలిమతిన్ సవా_ఇన్ బైననా_వబైనకుమ్_అల్_లా_నాబుద_ఇల్_లల్లాహా_వలా నుష్రిక_బిహీ షైఅన్ వలాయత్తఖిజ_బాజునా_బాజన్_ అర్బాబన్_మిన్ దూనిల్లా_హి_ఫయిన్ తవల్లౌ_ఫఖూలుష్_హదూ_

బిఅస్మాన్ముస్లిమూన్ పరమదయాలుఁడును ప్రేమించువాఁడును అగు అల్లాపేరుతో—

దేవునిసేవకుఁడును ప్రవక్తయును అగుముహామ్మదు నుండి రోమును దేశపు గొప్పసర్దారగు హిర్ఖలునకు వ్రాయఁ బడినలేఖ. సన్మార్గము ననుసరించువారికి మోక్షములభించును. నేను నిన్ను ఇస్లాము తరపున పిలుచుచున్నాను. ఇస్లాముఁలో చేరుము. నీవు ముక్తి పొందుదువు. దేవుఁడు నీకు రెండు పుణ్యము లొసఁగును. (ఒకటి నీవు ఇస్లాములో చేరునది. రెండవది నీవలన నీప్రజలు ఇస్లాములో చేరునది.) నీవు తిరస్కరించితివా నీప్రజల పాపము నీపై నుండును. ఓగ్రంథము (బైబలు) గలవారా! మాయొద్దను మీయొద్దను సమమైన ఒక మాటవై పున రండు. అదేమన మనము దేవుని ఆరాధింపవలెను. దేవునికి సాటికల్పింపవలదు. మనలో నెవ్వఁడును దేవునివిడిచి యితరదైవములను కల్పింపరాదు. మఱిమీరు తిరస్కరించిన చో మేము దేవుని విధేయులమని సాక్ష్యమిండు.

హిర్ఖలురాజు అబూసుఫ్యానుతోఁ గావించిన సంభాషణవలననే దర్బారులోనుండిన క్రైస్తవపండితులు, పాద్రీలు, కుపితులై యుండిరి. తిరిగి పైగంబరులవారి లేఖ చదివినందున క్రైస్తవ పాద్రీలకు మఱింతకోపము గలిగెను. అందుచే రాజు ఖురైషులవర్తకులను దర్బారునుండి పంపివేసెను. పైగంబరుల వారి విషయము సత్యము తెలిసియు రాజ్యముపోవునను భీతిచే నతఁడు ఇస్లాములో చేరకపోయెను.

ఈరాను (పారసీ) రాజగు ఖుస్రోపర్వీజుకిస్రాకు వ్రాయఁబడిన పైగంబరులవారి యుత్తరమును అబ్దుల్లాబిన్ హుజాఫాగారు తీసికొనిపోయిరి. ఈరాను దేశస్థులు అగ్నిని పూజించు మజూసీలు.

పైగంబరులవారు ఈరాను రాజునకు వ్రాసిన లేఖ.

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్- మిన్—ముహమ్మదిన్—రసూలిల్లాహి- ఇలాకిస్రాఅజీమి-ఫారస్-సలామున్-అలామనిత్తబఅల్-హుదా-వఆమన-బిల్లాహి-వరసూలిహి-వఅష్-హద—అల్-లాయిలాహ-ఇల్—లల్లాహు-వఅన్నీరసూలుల్లాహి—ఇలన్నాసి—కాఫ్ఫతన్—లియున్జిర-మన్-కాన-హయ్యన్-అస్లిల్-తస్లిమ్-ఫయిన్-అబైత.-ఫఅలైకఇస్ముల్-మజూస్—(పరమదయాళువును ప్రేమించువాఁడును అగు అల్లా పేరుతో దేవుని ప్రవక్తయగు ముహమ్మదునుండి పారసుదేశపు సర్దారుఁడగు కిస్రాకు వ్రాయఁబడిన లేఖ. సన్మార్గమనుసరించి దేవునిని అతని ప్రవక్తను విశ్వసించి దేవుఁడు ఒక్కఁడే యనియు, సర్వజగత్తునకు భయభక్తులబోధ నిచ్చుటకై నన్ను దేవుఁడు ప్రవక్తగా పంపియున్నాఁడనియు సాక్ష్యమిచ్చువానికి సల్లాములు. (మోక్షము లభించును.) ఇస్లాములో చేరుము. రక్షణపొందుదువు. నీవు ఇస్లాములో చేరక తిరస్కరించితివా? మజూసీల పాపము నీపై నుండును.

పైగంబరులవారి యుత్తరమును కిస్రారాజు చూచి తనపేరునకు ముందు పైగంబరులవారి పేరుండుటను చూచి మహాకోపముతో లేఖను తునుకలు తునుకలుగా చింపివేసెను.

దాని పిదప యమను దేశమునకు గవర్నరుగానున్న బాజానునకు "ముహమ్మదును పట్టి నాయొద్దకు శీఘ్రకాలములోనే పంప వలసినది" అని యుత్తరువు పంపెను. బాజాను దానికొఱకు బాబవై ఖర్ ఖుస్రో అను ఇద్దఱిని మదీనాపురమునకు పంపెను. వారిద్దఱు పైగంబరులవారి యొద్దకువచ్చి "లోక చక్రవర్తి యగు క్రిస్రా మిమ్ము రమ్మని ఆజ్ఞాపించియున్నాఁడు. మీరు రానిచో క్రిస్రా చక్రవర్తి మిమ్మును మీదేశమును నాశము చేయును" అనిచెప్పిరి. పైగంబరులవారదివిని "మీరు పొండు. ఇస్లాము రాజ్యము మీక్రిస్రా ముఖ్యపట్టణము వఱకు వ్యాపించును. మఱియు మీరాజు నేటిరాత్రి తన కుమారునిచే వధింపఁబడియున్నాఁడు" అనిచెప్పి వారిద్దఱిని పంపివేసిరి. వారిద్దఱు యమను వచ్చిచేరిరి. పైగంబరులవారు చెప్పినట్లుగ క్రిస్రారాజు తనకుమారునిచేత వధింపఁబడి అతని వధించిన కుమారుఁడే రాజ్యమునకు వచ్చియున్నాఁడను వార్త వినిరి. యమను గవర్నరగు బాజాను పైగంబరులవారిని గూర్చి విచారించి వారి మాహాత్మ్యము నెఱింగి ఇస్లాములో చేరెను. అతని దేశస్థుల నేకులు గూడ ముసల్మానులైరి. హజ్రత్ పైగంబరులవారు "క్రిస్రాయొద్దకు లేఖ నిచ్చి పంపిన రాయబారి తిరిగి మదీనా వచ్చి క్రిస్రారాజు లేఖను చింపిన సమాచారము పైగంబరుల వారికి విన్నవించెను. పైగంబరులవారు 'క్రిస్రా నా లేఖను తునుకలు చేసినట్లు వానిరాజ్యము కూడ తునుకలై పోవును' అనిపలికిరి. వారు వచించినట్లే కొద్ది సంవత్సరములలోనే పారసు రాజ్యము నశించెను.

—: అబిసీనియా రాజునకు లేఖ. :—

అబిసీనియా (హబషు) రాజగు నజాషీ యొద్దకు హజ్రత్ అమ్రబిన్ ఉమయ్యాగారు పైగంబరులవారియుత్తరము ను తీసికొనిపోయిరి. నజాషీరాజు పైగంబరులవారి యుత్తరమును చాల గౌరవించి "మీరు దేవుని ప్రవక్తలని విశ్వసించు చున్నాను." అని పైగంబరులవారికి బదులు వ్రాసి ఇస్లాములో చేరెను.

—: ఉమ్మెహబీబాగారి వివాహము. :—

పైగంబరులవారు మక్కాలో నున్నప్పుడు కొందఱు ముసల్మానులు మక్కావిడిచి అబిసీనియాకు పోయి యుండిరిగదా. వారిలో బీబీఉమ్మెహబీబాగారు (హజ్రత్ అమీరుమ ఆవియాగారిచెల్లెలు) నుండిరి. వారిభర్త మరణించెను. పైగంబరులవారు ఉమ్మెహబీబాగారి వివాహమును గూర్చి నజాషీ రాజునకు వర్తమానమంపిరి. ఆరాజు పైగంబరులవారి యుత్తరము ప్రకారము బీబీఉమ్మెహబీబాగారి వివాహము పైగంబరులవారికి చేయించి ఉమ్మెహబీబాగారిని మదీనాపురమునకు పంపెను.

—: ఈజిప్టురాజునకు లేఖ. :—

ఈజిప్టురాజగు మఖోఖస్ యొద్దకు హాతిబ్ బిన్ బల్తా గారు పైగంబరులవారి యుత్తరమును గొనిపోయిరి. ఆలేఖలోం గూడను ఇస్లాములో చేరుమనియే బోధయుండెను. ఆరాజు రాయబారిని చాల గౌరవించెను. పైగంబరులవారికి కానుకగా విలువైనవస్త్రములును దుల్ దుల్ అను పేరుగల కంచరగాడిదయును, గొప్ప వంశస్థురాలైన యిద్దఱుకన్యలను పంపె

ను. ఆయిద్దఱు కన్యలును ఇస్లాములో చేరిరి. వారిద్దఱిలో బీబీమారియా ఖిబ్తియాగారిని పైగంబరులవారు వివాహమాడిరి. ఈజిప్టురాజు పైగంబరులవారి లేఖను గౌరవముగా తన బొక్కసములో పెట్టెను. అతఁడు ఇస్లాములో చేరలేదు. ఆరాజు ఇస్లామును గూర్చి యోచించెదను. అని పైగంబరులవారి రాయబారితో చెప్పెను.

—: యమామా దేశపు సర్దార్లకు లేఖ. :—

యమామా దేశపుసర్దార్లయొద్దకు సలీతుబిన్ ఉమరు గారు పైగంబరులవారి లేఖను తీసికొనిపోయిరి. ఆసర్దార్లలో హౌజాబిన్ అలీ అనునతఁడు "మీరు చెప్పుమాట బాగుగానే యున్నది. నాకు మీరాజ్యములోఁ గొంత భాగమిచ్చినచో ఇస్లాములో చేరుదు"నని పైగంబరులవారికి బదులు వ్రాసెను. 'ఇస్లాములో చేరుట భక్తి కొఱకే గాని రాజ్యముపై నాసకొఱకుఁగాదు. కావున ఒకయంగుళము భూమికూడ నియ్యఁబడదు' అని పైగంబరులవారు తెలిపిరి.

—: సిరియా సర్దార్లకు లేఖ. :—

సిరియా (షామ్) దేశపు సరిహద్దులకు సర్దారుగానున్న హారిసెగస్సానీ యొద్దకు షుజాబిన్ వహాబుగారు పైగంబరుల వారి లేఖను తీసికొనిపోయిరి. అతఁడు లేఖను చూచి చాల కోపించుకొని మదీనాపై దాడివెడలుటకై సేనకాజ్ఞాపించెను. దాని ఫలితమే మూతా తబూకు యుద్ధములు. (వానిగూర్చి యిఁకమీఁద వ్రాయుదుము)

ములలో శాంతము కలిగెను. ఖురైషులపక్షమున ముసల్మానుః లకు విరోధముగ యుద్ధమాడిన ఖురైషునాయకులలో ఖాలిదుబిన్ వలీదుగారు ముఖ్యులు. వారిప్రయత్నము వలననే ఒహాదుయుద్ధములో ముసల్మానులకు చాల నష్టము గలిగెను. అట్టి వారొకదినము మదీనాపురమునకు పయనమై పోవు చుండిరి. మార్గమందు అమ్రుబిన్ ఆసుకనబడి "ఎక్కడికిపోవు చున్నా"రని ఖాలిదును ప్రశ్నించెను. నేను ఇస్లాములో చేరుటకై మదీనాకు పోవుచున్నానని ఖాలిదు చెప్పెను. నేను కూడను అదే యుద్దేశించి పోవుచున్నాను అని అమ్రుబిన్ ఆసుబదులిడెను. వారిద్దఱు పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చి ఇస్లాములో చేరిరి. వారిద్దఱు ఇంతవఱకు ముసల్మానులకు విరుద్ధముగ శత్రువుల పక్షమున చూపుచున్న తమ శౌర్యము నిపుడు ముసల్మానుల పక్షమున చూపసాగిరి. చూచితిరా ఇస్లాము మహిమము!

## హి జ్రీ యే డ వ యేఁ డు

—: గత్ఫాను వారు దోఁచుట :—

జీఖరద్ అనుచోటున పైగంబరులవారి యొంటెలు మేయు చుండును. ఆచోటు గత్ఫాను తెగవారుండు దేశమునకు సమీపముగా నున్నది. మొహర్రముమునెలలో గత్ఫాను వారు వచ్చి పైగంబరులవారి యిరువదియొంటెలను దోఁచుకొని ఒంటెలకాపరిని వధించి యతని భార్యను పట్టుకొనిపోయిరి. ఆసంగతి మొట్టమొదట సల్మాబిన్ అక్వాగారికిఁ దెలిసి శత్రువులను వెంబడించి యొంటెలను విడిపించుకొనివచ్చిరి. వారు మంచి విలుకాండ్రు కావున శత్రువులు పాఱిపోవునట్లు

బాణముల వర్షము కురిపించిరి. వారు మరలివచ్చుచుండఁగా పైగంబరులవారు కూడ నెదురు పడి సల్మాగారు చూపిన శౌర్యమును మెచ్చుకొని తిరిగి మదీనాపురము వచ్చిచేరిరి.

—: ఖైబరుయుద్ధము. :—

ఖైబరుపట్టణము మదీనాపట్టణమునుండి సిరియా (షామ్) దేశమువైపున దాదాపు 200 మైళ్లు దూరమున నున్నది. అచటిభూమి చాలసారవంతమైనది. అచట యూదులు గొప్ప గొప్ప కోటలు కట్టుకొని వసించుచుండిరి. మదీనానుండి పోయిన యూదులు ఖైబరుచేరి ఇస్లామును నాశము చేయవలెనని కుట్రలు చేయుచుండిరి. వారి కుట్రల వలననే ఖన్దఖుయుద్ధము జరిగెను. దాని గూర్చియు యూదులు గావించిన ద్రోహములను గూర్చియు వ్రాసియున్నాము. పైగంబరులవారు హిజ్రీ యేడవ సంవత్సరము మొహర్రము నెలలో 1400 కాలిబంటులను 200 మంది రౌతులను దీసికొని అచటికి పయనమైరి.

మదీనాపురము నందు సిబాబిఁ అర్ఫాను అధికారిగా నుంచిరి. గత్ఫాను తెగవారు యూదులకు యుద్ధమందు తోడు పడవలెనని తలఁచి పయనమైరి. కాని వారు ముసల్మానుల సైన్యము గత్ఫాను వారుండు ప్రదేశములకును ఖైబరునకును మధ్యనున్న రజీఅను చోటున ముఖాముచేసి యుండుట చూచి తిరిగి తమ యిండ్లకు పోయిరి. ముసల్మానుల సైన్యము ఖైబరుపట్టణము సమీపించెను. ఖైబరు కోటలలో ముఖ్యమైనవి (1) నాయిమ్ (2) కతీబా (3) సలబు (4) షిఖ్ (5) ఖమూస్ (6) వతాత్ (7) సతీహ్ (8) సలాలిమ్ అను

నవి యొనిమిది.

యూదులు ముసల్మానులసైన్యము వచ్చినది అని విని స్త్రీలందఱిని ఒకకోటలోను ధాన్యము మొదలైనసామగ్రి నాయిమ్ అనుకోటలలోను యుద్ధసైన్యమును నతాతు ఖమూసు అనుకోటలోను నుంచిరి. యూదులును యుద్ధమునకై సిద్ధమైరి. మొట్టమొదట నాయిమ్ అనుకోటను ముసల్మానులు ముట్టడించిరి. మహమ్మదుబిన్ సల్మాగారు గొప్పసైన్యముతో యుద్ధమాడిరి. వేడిమి తీవ్రముగా నున్నందున మహమ్మదుబిన్ సల్మాగారు అలసట తీర్చుకొనుటకై కోటగోడ నీడను కూర్చుండియుండిరి. కనానాబిన్ రబీ అనుయూదుఁడు కోటగోడపై నుండి వారితలపై నొకవిసరురాతి బండను వేసెను. ఆదెబ్బచే వారు పరలోకము చేరిరి. దాని పిదప శీఘ్రకాలములోనే ముసల్మానులు నాయిమ్ అనుకోటను జయించిరి. దానిపిదప నొకటితరువాత నొకటిగా అన్నిటిని ముసల్మానులు సులభముగా జయించిరి. కాని ఖమూసు అనుకోటను జయించుటకు రెండుమూఁడు దినములుపట్టెను. ఆకోటలో గొప్పగొప్ప యుద్ధవీరు లుండిరి. వారిలో మురహ్హాబు అను వాఁడు వేయి మందికి సమానుఁడు. ఖమూసుకోట ముట్టడించి కొన్నిదినములాయెను. విజయము లేకుండెను. పైగంబరులవారొక రాత్రి "నేను రేపు ఎవ్వని చేతిలో యుద్ధపు జెండానిచ్చెదనో యతఁడు ఖమూసు కోటను జయించును. అతనియందు దేవునికిని ప్రవక్తకును ప్రీతి కలదు. అతఁడు కూడ దేవునియందును ప్రవక్తయందును భక్తిగలవాఁడు" అని చెప్పిరి. అదివిని శిష్యులందఱును ఆభాగ్యమెవరికి లభించునో యని

రాత్రి యంతయు చాల తహతహపాటుతో గడపిరి. రాత్రి గడచి తెల్లవాఱెను. ప్రతిశిష్యుఁడునుఆభాగ్యము నాకులభించు నేమో యని యెదురుచూచుచుండెను. అంతలో పైగంబరుల వారు 'అలీయెక్కడ" అని పలికిరి. అలీగారికి కంటికలఁక వచ్చియుండెను. ఆబాధచే కన్నులు తెఱవలేకుండిరి. అందు చే యుద్ధము చేయలేకుండిరి. పైగంబరులవారి సమ్ముఖమునకు హజరత్ అలీగారు వచ్చి నిలువఁగా పైగంబరులవారు తమ యుమ్మిని దీసి అలీగారి కన్నులకు తగిలించిరి. పైగంబరుల వారి మహిమచే అలీగారి కన్నులు స్వస్థత నొందెను. బాధ తొలఁగెను. పైగంబరులవారు అలీగారిచేతికి జెండా నిచ్చి "మొట్టమొదట యూదులకు ఇస్లాములో చేరుఁడని చెప్పుము. వారుసమ్మతింపక యుద్ధమునకై సిద్ధమైనచో వారిని మా ర్కొనుము" అని చెప్పి యాశీర్వదించి యుద్ధభూమికి నంపిరి. యూదులు ఇస్లాములో చేరుటకుఁగాని లేక సంధికూర్చుటకుఁ గాని సమ్మతింపక యుద్ధమునకే సిద్ధమైరి. హజ్రత్ అలీగారు కూడ మార్కొనుటకై సిద్ధమైరి. వేయిమందితో సమానుఁ డైన మురహ్హాబు యూదుఁడు "ఖద్అలిమత్ ఖైబరు అన్నీ మురహ్హాబు-షాకీయుస్సిలాహిబతలున్-ముజర్రబు (నేను మురహ్హాబు అనుసంగతి ఖైబరువారికి తెలియును. నేను వీరుఁడను. అనుభవము గలవాఁడను. యుద్ధాయుధములు ధరించినవాఁడ ను" అనుగీతము పాడుచు కోటనుండి యుద్ధభూమికి వచ్చి "నన్ను మార్కొనువాఁడు గలఁడా?" యని పలికెను. హజ్ రత్ అలీగారు "అనల్లజీ సమ్మత్నీ ఉమ్మీ హైదరా-కలై సిల్ గాబాతిన్-కరీహిల్ మన్జరా- "నాతల్లి నాకు సింహామని పేరిడి

నది భయంకరమైన అడవిసింహము వంటివాఁడను" అని పాడుచు మురహ్హాబును మార్కొనిరి. హజ్రత్ అలీగారు తమఖడ్గముతో మురహ్హాబు తలపైఁ గొట్టిరి. ఆదెబ్బచే వానిశిరస్త్రాణముతెగి తలతెగి వాఁడు నేలపైఁగూలెను. ఆయుద్ధవీరుఁడు వధింపఁబడిన పిదప ద్వంద్వయుద్ధము జరిగెను.

యుద్ధము జరిగి తుదకు యూదులు ఓడిపోయిరి. ఖమూసు కోటను హజ్రత్ అలీగారు జయించిరి. ఆయుద్ధములో 93 మంది యూదులు వధింపఁబడిరి. ముసల్మానులు 15 మందివీరులు స్వర్గలోకము చేరిరి. ఖైబరు యుద్ధములో ముసల్మానులకు విజయము గలిగినపిదప విజయప్రసాత్తును అచటి భూములును ఖర్జూరపుతోఁటలును ముసల్మానులకు వశమాయెను. యూదులు ఖైబరు విడిచి పోవలసియుండెను. కాని యూదులు సేద్యము సంగోరుతో చేయుదుము. అని పైగంబరులవారికి విన్నవించిరి. పైగంబరులవారు దానికి సమ్మతించి మేమెప్పుడు కోరుదుమో అప్పుడుమీరు ఖైబరు వదలిపోవలసినది. అని యూదులతో ఖరారునామా చేసికొనిరి.

—: సఫియ్యాగారి వివాహము. :—

యూదులసర్దారగు హుయాబిన్ అఖ్తబు కుమార్తెయగు సఫియ్యా ఖైదీలలో పట్టఁబడెను. యుద్ధములో ఆమె తండ్రియు భర్తయు వధింపఁబడియుండిరి. ఆమెను గౌరవించుటకై పైగంబరులవారు ఆమెను వివాహమాడిరి. దానివలన ఆమెకుఁ గలిగినమనస్తాపము నశించెను.

—: ఒక యూదు స్త్రీ పైగంబరులవారికి విషము పెట్టుట :—

ఖైబరుయుద్ధము ముగిసిన పిదప పైగంబరులవారు

కొన్ని దినము లచట నిలిచిరి. ఆసమయమందు జైనబులనుఒక యూదుస్త్రీ పైగంబరులవారికిని కొందఱుశిష్యులకును విందు చేసెను. పైగంబరులవారును కొందఱుశిష్యులును విందుకొఱకు పోయిరి. ఆయూదుస్త్రీ భోజనములో విషము గలిపియుంచెను. పైగంబరులవారు ఒకమెతుకు నోటిలో పెట్టుకొని దీనిలో విష మున్నదే యని యుమ్మివేసిరి. శిష్యులందఱు అన్నము తినక విడిచిపెట్టిరి. కాని బిష్రబిన్ బరా అనువారు కొన్ని మెతుకులు తినిరి. తరువాత వారు దానిబాధచే మరణించిరి. పైగంబరులవారు ఆయూదుస్త్రీతో విషమెందుకు పెట్టితివి. అనిఅడిగిరి. ఆమె తాను చేసిన తప్పిదము నొప్పుకొని యిట్లు చెప్పెను. "మీరు దేవుని ప్రవక్తలైనచో మీకు దేవుఁడు తెలుపును. మీకు నష్టము గలుగదు. కానిచో మీరు మరణింతురు.. అపుడు మాకు సుఖము గలుగును." అది విని పైగంబరులవారు ఆమెను మన్నించిరి. కాని పిదప బిష్రబిన్ బరాగారు ఆవిషముచే మృతినొందినందులకు హత్యకుబదులుగా నామె వధింపఁబడెను.

—: ఫి ద కు యూ దు లు . :—

ఖైబరుయూదులు యుద్ధములో నోడిపోయిన విషయము ఫిదకులోనుండు యూదులకుఁ దెలిసి పైగంబరులవారి యొద్దకు "మాభూమి రాఁబడిలో సగము మీకిచ్చెదము. అని రాయబారము నంపిరి. పైగంబరులవారు దానికి సమ్మతించి యొడంబడిక గావించిరి.

—: వా ది ల్ ఖు రా యూ దు లు . :—

ఖైబరుకును తైమాకును మధ్య కొన్ని పురములు

గలవు. వానిని వాదిల్ ఖురా అనుదురు. అచట యూదులు కాపురముండుచుండిరి. పైగంబరులవారు ఖైబరు నుండి మరలి వాదిల్ ఖురా వైపునకు పయనమైరి. ఆవిషయము యూదులకుఁ దెలిసి యుద్ధమునకు సిద్ధమైరి. పైగంబరులవారిపై బాణములు వేసిరి. పైగంబరులవారి బానిస మిద్ అమ్ అనునతఁడు పైగంబరులవారి ఒంటెపై అంబారిని దింపుచుండఁగ యూదులు వేసిన బాణముచే మరణించెను. తుదకు యుద్ధము జరిగి ఖైబరుయూదులు గావించిన ఒడంబడిక వలె వాదిల్ ఖురా యూదులును గావించుకొనిరి. అచటి నుండి పైగంబరుల వారు మరలి మదీనాపురము వచ్చిచేరిరి.

## —: కొన్ని సరియ్యాలు. :—

హిజ్రియేడవయేఁట పైగంబరులవారు హజ్రత్ అబూబకరును బనీఫజారా తెగను మార్కొనుటకై కొద్దిసైన్యముతో నంపిరి. ఆ తెగవారు యుద్ధమాడి తుదకు నోడిపోయిరి. పైగంబరులవారు ముప్పదిమందిని తోడుచేసి హజ్రత్ ఉమరును తుర్బా అనుప్రదేశమునకు పంపిరి. అచటనుండి హవాజను తెగవారు పాఱిపోయిరి. అందుచే హజ్రత్ ఉమరుగారు తిరిగి మదీనాపురము వచ్చిచేరిరి. అటులే మఱికొందఱిని ప్రచారము చేయుటకై పంపిరి.

## —: కాబాదర్శనము :—

పైగంబరులవారు హుదైబియాసంధి ననుసరించి కాబాదర్శనము కొఱకు యేడవయేఁట జీఖాదానెలలో నుద్దేశించి గడచిన సంవత్సరము పయనమైనవారందఱు కూడ రావలసినదని ప్రకటించిరి. ఆప్రకటన విని 2000 మంది ముసల్మానులు

పెష్టైనా పయనమైరి. పైగంబరులవారు మక్కానుండి 8 మైళ్ల దూరమున నున్న బత్నెనాహిజ్ అనుచోటున యుద్ధాయుధము లన్నియు వేసి 200 మందిని కాపుదలగా విడిచి మక్కాపురము ప్రవేశించిరి. మక్కా ఖురైషులు మదీనాగాలి సరిపడక ముసల్మానులు బలహీనులైనారని చెప్పుకొనుచుండిరి. అది విని పైగంబరులవారు ముసల్మానులు కాబామసీదు ప్రదక్షిణించు నప్పుడు మొదటిమూడు చుట్లలో నిక్కుచు నడువవలెనని యుపదేశించిరి. అటులనే ముసల్మానులందఱు ప్రదక్షిణముతో మొదటి మూడుచుట్లు నిక్కుచు నడువసాగిరి. ఖురైషులు అది చూచి ముసల్మానులు బలహీనులని యుద్దేశించునది పొరపాటు అని తలంచిరి. ముసల్మానులు మహా వైభవముతో కాబామసీదును దర్శించుచుండిరి. అది ఖురైషుల నాయకులు చూచి సహింపలేక మక్కానుండి దూరము నకు పోయి బస చేసిరి. హుదైబియాసంధి షరతు ననుసరించి మూడు దినములు మాత్రము పైగంబరులవారు మక్కాలో నుండిరి. దాని తరువాత మక్కా విడిచి సరిఫ్ అనుచోటున ముఖాముచేసిరి.

మక్కాలో నున్న మూడుదినములలో పైగంబరుల వారు బీబీమైమూనాగారిని వివాహమాడిరి. పైగంబరుల వారు బీబీమైమూనాగారితోఁగూడి పయనమై మదీనాపురము జుల్‌హాజ్ నెలలో వచ్చిచేరిరి.

—: బనీసలీము వారి యుద్ధము. :—

పైగంబరులవారు జుల్‌హాజ్ నెలలో 'ఇబ్నెఅబిల్ ఔజా' అనువారిని నాయకులుగాఁజేసి 50 మంది ముసల్మానుల

ను బనీసలీము తెగయొద్దకు ఇస్లాము ప్రచారము చేయుటకై పంపిరి. ముసల్మానులు పోయి బనీసలీమువారికి బోధించిరి. వారు ఇస్లాములో చేరక ముసల్మానులతో యుద్ధమాడిరి. బనీసలీము తెగవారు చాలమంది యుండుటచే యుద్ధములో ఇబ్నెఅబిల్ ఔజా తప్ప మిగిలిన ముసల్మానులందఱు వధింపఁబడి స్వర్గలోకము చేరిరి.

హిజ్రీ యెనిమిదవయేఁడు.

—: కాఫర్లు బోధకులను వధించుట. :—

పైగంబరులవారు హిజ్రీయెనిమిదవయేఁట మదీనాపురమునకు చుట్టుపట్లనున్న కుటుంబములవారికి ఇస్లామునుగూర్చి బోధించుటకు తమశిష్యుల నంపిరి. కాబుబిన్ ఉమైరుగారిని 15 మందితో ప్రచారమునకై పంపిరి. వారు సిరియా (షామ్) దేశములో నున్న "జాతెఇత్తైలా" అను ప్రదేశము చేరి యచటనున్న కాఫర్లకు బోధించిరి. వారు బోధను సమ్మతింపక ముసల్మానులతో యుద్ధమాడి వారిని వధించిరి. ముసల్మానుల లో ఒకఁడు మాత్రము బ్రతికెను. ఆయన వచ్చి యావిషయము పైగంబరువారికిఁ దెలిపెను. ఆసంగతి వినిన పైగంబరుల వారికి చాల దుఃఖము కలిగెను. కాఫర్లను మార్కొనుటకై గొప్పసైన్యము పంపవలెనని పైగంబరులవారు తలఁచిరి. కాని ఆకాఫర్లు వేఱుచోటికి పోయిరనువార్త విని సైన్యమును పంపలేదు.

—: మూతాయుద్ధము. :—

మూతా అనుచోటు సిరియా (షామ్) దేశములో నున్నది. అది బైతుల్ ముఖద్దసు నుండి రెండు దినముల ప్ర

ప్రాణములో నున్నది. పైగంబరులవారు ఇస్లామును గూర్చి యుత్తరములు చుట్టుపట్లనున్న రాజులకు నంపియుండిరి. వానిలో నొకయుత్తరము హారిసుబిన్ ఉమైరుగారి చేతనిచ్చి బుస్రారాజునకు పంపిరి. బుస్రారాజుయొక్క గవర్నరగు షురహ్బీలు అనునతఁడు రాయబారిగా పోయిన హారిసును వధించెను. ఆకాలములోఁగూడ రాయబారులను వధించుట అధర్మమైయుండెను. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి యాహత్యకు బదులు తీసికొనుటకై హిజ్రీయెనిమిదవయేఁట జుమాదల్ ఊలా నెలలో మూఁడువేల సైన్యము సిరియాదేశముపై నంపిరి. బానిసగానుండి పైగంబరులవారిచే విడుదలఁగావింపఁబడిన జైదుబిన్ సాబిత్తు ఆసైన్యమునకు అధిపతిగానుండెను. ఆసైన్యములో గొప్ప గొప్ప మహాజిర్లును అన్సారులును ఉండిరి. అయిన నేమి? ఇస్లాము హెచ్చుతగ్గులను పోఁగొట్టునదిగదా!

సైన్యమును వీడుకొలుపునపుడు "జైదుయుద్ధములో వధింపఁబడి స్వర్గలోకముచేరిన జాఫరుత్తయ్యారు సేనాధిపతి కావలెను. జాఫరు వధింపఁబడి పరలోకముచేరిన 'అబ్దుల్లాబిన్ రవాహా' సేనాధిపతి కావలెను. అబ్దుల్లాబిన్ రవాహా వధింపఁబడి స్వర్గలోకము చేరిన సైన్యము ఎవనిని గోరునో అతని సేనాధిపతిగఁ జేసికొనవచ్చు"నని పైగంబరువారు ఉపదేశించిరి. సైన్యము పయనమాయెను. అపుడు "కొందఱు భక్తులు గుళ్లలో నుందురు. వారిని స్త్రీలను బిడ్డలను రోగులను వృద్ధులను చంపఁ గూడదు"అనియు "ముందు శత్రువులను ఇస్లాములో చేరుడని బోధించుఁడు. వారు సమ్మతించిన యుద్ధమాడఁగూడదు. వారు సమ్మతింపక యుద్ధమాడిన మీరు

కూడ మూర్ఖుఁడు” అనియు సైన్యమునకు పైగంబరుల వారు బోధించిరి. ముసల్మానుల సైన్యము వచ్చుచున్నదను వార్త షురహీల్యులనకుఁ దెలిసి అతఁడొక లక్షసైన్యము సేకరించి యుద్ధమునకై సిద్ధమైయుండెను. ఒకలక్షశత్రువులసైన్యమును మూఁడు వేల ముసల్మానులసైన్యము మార్కొనవలసివచ్చెను.

రెండు పక్షముల సైన్యములకు మూతాయనుచోటున యుద్ధము జరిగెను. పైగంబరులవారు ఉపదేశించుచున్నట్లు మొట్టమొదట యుద్ధములో జైదుగారువధింపఁబడిరి. వారి పిదప జాఫరుగారు వధింపఁబడిరి. వారి పిదప అబ్దుల్లాబిన్ రవాహాగారు వధింపఁబడిరి. వారిపిదప ముసల్మానులు హజ్రత్ ఖాలిదుబిన్ వలీదు గారిని సేనాధిపతిగాఁ జేసికొనిరి. హజ్రత్ ఖాలిదు యుద్ధ భూమిలో గొప్ప శౌర్యము చూపిరి. ఆయుద్ధములో వారిచేత 8 ఖడ్గములు విఱిగెను. తుదకు ఏఁడుదినముల వఱకు ఘోర యుద్ధము జరిగి శత్రువులే మరలిపోఁగా ముసల్మానులు కూడ తిరిగి మదీనాపురము వచ్చిచేరిరి.

—: పైగంబరులవారి దివ్యదృష్టి. :—

మూతాయుద్ధము జరుగుచున్నపుడు పైగంబరులవారు మదీనామసీదులో కూర్చుండి తమదివ్యదృష్టితో యుద్ధభూమిలో జరుగుచున్న విషయములు చూచుచు తమశిష్యులకు నిట్లు తెలిపిరి. “జైదు వధింపఁబడెను. జాఫరు సేనాధిపత్యము వహించి వధింపఁబడెను. అబ్దుల్లాబిన్ రవాహా సేనాధిపతియై యుద్ధమాడి వధింపఁబడెను. దేవునిఖడ్గములలో నొక ఖడ్గము (ఖాలిదుబిన్ వలీదు) సేనాధిపత్యము వహించెను. ముసల్మానుల సైన్యము రక్షింపఁబడెను.” ఆయుద్ధములోనే

ఖాలిదుబిన్ వలీదుగారికి "సైఫుల్లా" (దేవునిఖడ్గము) అనుబిరుదు పైగంబరులవారొసంగినది. అప్పటి నుండి యిప్పటి వఱకును ఖాలిదుగారు ఆబిరుదుతోనే పిలువఁబడుచున్నారు.

## మక్కా విజయము.

### బనూబకరువారును ఖురైషులును గావించినహత్య.

హుదైబియాసంధి ననుసరించి 'ఖుజాఅ' తెగవారు పైగంబరులవారి పక్షమున చేరిరి. ఖుజాఅ శత్రువులైన బనూబకరు తెగవారు ఖురైషులపక్షమున చేరియుండిరి. ఆ రెండు తెగలలో పూర్వము నుండి కలహములును యుద్ధములును జరుగుచువచ్చుచుండెను. కాని ఇస్లాము ప్రచారము వలన వారిరువురి మతకలహములు కొంతవఱకుమాని ముసల్మానులను మార్చుటకే యత్నించుచుండిరి. హుదైబియాసంధి యగుటచే దేశములో శాంతము కలిగెను. బనూబకరువారు తమ పూర్వవిరోధుల పై పగ దీర్చుకొనుటకు నిదేసమయమని ఆకస్మికముగ 'ఖుజాఅ' తెగవారి పైఁబడి వధింపసాగిరి. బనూబకరువారికి ఖురైషులు యుద్ధసామగ్రులిచ్చి సహాయమొసర్చిరి. అబూజెహల్ కుమారుఁడగు ఇక్రమా సఫ్వాను, సుహైలు మొదలైన ఖురైషునాయకులు మాఱువేషములతో బనూబకరువారి పక్షమున చేరి 'ఖుజాఅ' వారితో యుద్ధమాడిరి. ఆయుద్ధములో 'ఖుజాఅ' తెగవారికి చాల ప్రాణనష్టము గలిగెను. అట్లు హుదైబియాసంధికి విరుద్ధముగ ఖురైషులు బనూబకరువారికి తోడుపడి సంధిషరతుల నతిక్రమించిరి.

ఖుజాఆ తెగవారు సంధిలో ముసల్మానుల పక్షమున చేరినవారు. కావున 'ఖుజాఆ' తెగ వారిలో నలుబది మంది మదీనా పురమునకు వచ్చి ఖురైషులును బనూబకరువారును గావించిన ఘోరహత్యను తెలిపి పైగంబరులవారి సహాయము గోరిరి. ఆహత్యా విషయము పైగంబరులవారు విని చాల వ్యసనపడిరి

—: సంధి రద్దగుట. :—

పైగంబరులవారు మక్కా-ఖురైషుల యొద్దకు "వధింపం బడినవారి హత్యాపరాధము ఇయ్యవలసినది. లేక ఖురైషులు బనూబకరువారిని వీడవలసినది. లేక హుదైబియా సంధి రద్దుచేయంబడవలసినది" అని వాయబారము పంపిరి. ఖురైషులు మూడవ షరతులలో హుదైబియా సంధిని రద్దుపఱచుటకు సమ్మతించిరి. కాని తిరిగి ఖురైషులు పైగంబరులవారి యొద్దకు హుదైబియాసంధిని క్రొత్తగాం జేయుటకై అబూసుఫ్యానును పంపిరి. అబూసుఫ్యాను పైగంబరులవారి సమ్ముఖమునకు వచ్చిసంధిని గూర్చియడిగెను. పైగంబరులవారు దానికి బదులు చెప్పక యూరకుండిరి. పిదప అబూసుఫ్యాను హజ్రత్ అబూబకరుగారిని హజ్రత్ ఉమరుగారిని పైగంబరువారియొద్ద సిఫారసు చేయుండని కోరెను. వారు మేముచేయలేమని చెప్పిరి. అపుడు అబూసుఫ్యాను పైగంబరుల వారి కుమార్తెలగు బీబీ ఫాతిమాగారి సన్నిధికి వచ్చెను. అచట హజ్రత్ హసన్ గారు (పైగంబరులవారి మనుమలు) కూర్చుండియుండిరి. అపుడు వారికి అయిదేండ్ల వయస్సు. అబూసుఫ్యాను "హసను సంధి గూర్చిచెప్పిన యీదినమునుండి అరేబియానాయకుడని పిలు

వంబడు"నని చెప్పెను. దానికి బీబీఫాతిమాగారు 'సంధిని గూర్చి చెప్పుట పిల్లలపనికాదు." అనిపలికిరి. తుదకు హజ్రత్ అలీ యొద్దకు రాగా వారు "నీవే మసీదులో పోయి నేనే అభయ మొసంగితినని చెప్పిపొమ్ము. దానికి మించినది వేఱునీవు చేయ లేవు"అని చెప్పిరి. అబూసుఫ్యాను అటులే చేసి మదీనా నుండి మక్కాపురము చేరెను. మదీనాలో జరిగినవిషయము ఖురైషులు విని"నీవుపోయినది వృథ యాయెను. నీవు అభయమొసగిన ఫలమేమి? దానికి ముహమ్మదు సమ్మతించెనా?" అని వానిని చీవాట్లుపెట్టిరి.

—:హాతిబుగారి లేఖ.:—

పైగంబరులవారు మక్కాపురముపై దాడి వెడలుటకై సిద్ధమైరి. వారిపక్షమున నున్నవారి కందఱికిని దెలిపిరి. ఆవిషయము మాత్రము మక్కాఖురైషులకుఁ దెలియలేదు. 'హాతిబ్ బిన్ బల్తా' రహస్యముగా ఖురైషులకు "పైగంబరులవారు మక్కాపై దండెత్తుటకై సిద్ధపడుచున్నారు." అని వ్రాసి యాలేఖను ఒకస్త్రీచేతనిచ్చి పంపెను. ఆరహస్య విషయము పైగంబరులవారికి దేవుఁడు తెలిపెను. అపుడు పైగంబరులవారు హజ్రత్ అలీగారిని మఱిద్దఱిని తోడుచేసి యాలేఖను తీసికొనివచ్చుటకై పంపిరి. వారు గుఱ్ఱముపై నెక్కిపోయి లేఖను తీసికొనిపోవుచున్న స్త్రీని పట్టుకొనిరి. ఆమె నాయొద్దలేదని పలికె తుదకు బెదరింపఁగా కొప్పులోనుండి లేఖను తీసియిచ్చెను. ఆలేఖ పైగంబరులవారియొద్దకు గొని వచ్చిరి. ఆలేఖను వ్రాసిన హాతిబుగారిని పిలిచి పైగంబరుల వారు దానిఁగూర్చి యడిగిరి. వారు "ఓప్రవక్తా! నేనుచేసిన

తప్పిదము ఒప్పుకొనుచున్నాను. నాబంధువులు మక్కాలో నున్నారు. వారికె తోడుపడువారెవరును లేరు. అందుచే లేఖ వ్రాసి ఖురైషులకు మేలుచేసిన వారు నాబంధువులను కాపాడుదురని తలంచి అట్లుచేసితినని విన్నవించిరి. అపుడు పైగంబరులవారు వారిని క్షమించిరి.

—: ముసల్మానులు దాడి వెడలుట :—

హిజ్రీ యెనిమిదవయేంట రమ్జాను నెలలో పైగంబరులవారు 10,000 సైన్యముతో పయనమై మక్కాపురమునకు నొకదినము ప్రయాణమున నున్న 'మజ్జిజహారాను' అను ప్రదేశమున ముఖాముచేసిరి. ఖురైషులకు పైగంబరులవారు వచ్చుచున్నారనువార్త తెలిసి నిజము తెలిసికొనుటకై అబూసుఫ్యానును మఱికొందఱిని పంపిరి. వారు పైగంబరులవారి సైన్యము ముఖాము చేసియున్న చోటునకు సమీపించి సైన్యము కాల్చుచున్న పదివేల పొవ్వులను చూచి యింత గొప్పసైన్యము యెక్కడ నుండివచ్చెనో యని భీతిల్లిరి. రాత్రియందు అబూసుఫ్యాను ముసల్మానుల సైన్యమును సమీపింపఁగా పైగంబరులవారి గుడారమును కాపుదల చేయుచున్నభటులు అబూసుఫ్యానును గుర్తించి పట్టుకొని పైగంబరులవారియొద్దకుఁ దీసికొనివచ్చిరి. హజరత్ అబ్బాసుగారు పైగంబరులవారి యొద్దకు పోయి అబూసుఫ్యానునకు 'నేను అభయమొసంగితి" నని చెప్పిరి. అబూసుఫ్యాను గావించియున్న కుట్రలును విరోధములును పెక్కులు గలవు. వానింబట్టి చూచిన అతఁడు అభయమొసఁగఁబడఁగినవాఁడు కాఁడు. అయిన పైగంబరులవారు అతఁడు పూర్వము గావించిన విరోధములన్నిటిని

క్షమించి ప్రాణరక్షణ మొసంగి "ఓఅబూసుఫ్యాను! ఇంకను 'దేవుఁడు ఒక్కఁడే' యని విశ్వసింపలేదా? నేను దేవునిప్రవక్త నని ఇంకను నీవుఁ దెలియలేదా?" అని ప్రశ్నింపఁగా "నేను దేవుఁడు ఒక్కఁడేయని విశ్వసించితిని" అని పలికి ఇస్లాములో చేరెను. ఆయన తుదకు గొప్ప విశ్వాసముగల ముసల్మానుఁ డాయెను. ముసల్మానులసైన్యము మక్కాపురమునకు పయ నముకాఁగా పైగంబరులవారు అబూసుఫ్యానునకు సైన్యము చూపుఁడని హజ్రత్ అబ్బాసుగారితోఁ జెప్పిరి. అబ్బాసు గారు అతని నొకకొండతిప్పపైకి తీసికొనిపోయి సైన్యము చూ పుచుండిరి. అబూసుఫ్యాను సైన్యమును చూచుచు వారి కుటుంబములను గూర్చి అబ్బాసుగారినడుగుచుండెను. వారు సైన్యములవారి కుటుంబములను గూర్చి చెప్పుచుండిరి. అన్సా రులు మహావైభవముతో పోవుచుండిరి. సాదుబిన్ ఉబాదా గారు అన్సారుల సైన్యమునకు నధిపతిగానుండిరి. వారు అబూ సుఫ్యానును సమీపించి చూచి "ఈదినము ఘోరయుద్ధము సంభవించును. కాబామసీదులో యుద్ధమాడుట ధర్మ ముగును" అని చెప్ప సాగిరి. అందఱికన్న వెనుక పైగంబరుల వారుండిరి. పైగంబరులవారు అబూసుఫ్యానుండు చోటు సమీపింపఁగా ఓమహానుభావా! దీనికిముందు సాదుబిన్ ఉబాదా పలికినమాటలు మీరువిన్నారా అని విన్నవించెను. అపుడు పైగంబరులవారు "సాదు చెప్పినది నిజముగాదు. ఈదిన ము కాబామసీదు చాలగౌరవింపఁబడును" అని చెప్పి సాదు చేతిలో నున్ననాయకత్వపు జెండాను అతనికుమారునిచేత ని చ్చుటకు నాజ్ఞాపించిరి. పైగంబరులవారు "ఖాలిదుబిన్ వలీదు

గారికి మక్కా పురములో క్రిందివైపు నుండి ప్రవేశించుటకై యాజ్ఞాపించి తాము మక్కా పురములో పైభాగము నుండి ప్రవేశించిరి. పైగంబరులవారు "అబూసుఫ్యాను గృహములో ప్రవేశించి శరణుచొచ్చువాఁడును, తనయింటి తలుపు మూసికొనువాఁడును, తనయాయుధములు నేలపడవేయువాఁడును, కాబామసీదులో ప్రవేశించువాఁడును రక్షింపఁబడును" అని ప్రకటన గావించిరి. అట్టిప్రకటన గావింపఁబడినను కొండఱు ఖురైషులు యుద్ధమాడుటకై యుద్దేశించి ఖాలిదుబిన్ వలీదును మార్కొనిరి. ఖాలిదుబిన్ వలీదునకును ముసల్మానుల సైన్యమునకును ఖురైషులు యుద్ధమాడునంతవఱకు యుద్ధము ప్రారంభింపఁ గూడదని పైగంబరులవారు ఆజ్ఞాపించి యుండిరి. దాని ననుసరించి ఖాలిదుగారు యుద్ధమునకై సిద్ధముగా లేకుండినను ఖురైషులే ప్రప్రథమమున ముసల్మానులపైఁబడి వధింపసాగిరి. ఇద్దఱు ముసల్మానులు పరలోకము చేరిరి. అదిచూచి ఖాలిదుగారును మార్కొని యుద్ధమాడి ఖురైషులను తఱుమఁగొట్టిరి. ఖురైషులు పాఱిపోయిరి. వారిలో అబూజెహాల్ కుమారుఁడగు ఇక్రమా యుండెను. ఆయుద్ధములో 13మంది ఖురైషులు వధింపఁబడిరి. పైగంబరులవారు మక్కా పురములో శాంతముగా నెట్టియాటంకము లేక ప్రవేశించి కాబామసీదునకు వచ్చిరి. కాబామసీదులో 360విగ్రహము లుండెను. వానినన్నిటిని పడఁగొట్టిరి. పడఁగొట్టునపుడు "సత్యమువచ్చెను. అసత్యమునశించెను. నిశ్చయముగా నసత్యము నశించునదియే!" అని చెప్పుచుండిరి. కాబామసీదు గోడలపైఁ గూడబొమ్మలు చిత్రింపఁబడి యుండెను. వానినన్ని

టిని తుడిపించిరి. కాబామసీదు నుండి విగ్రహములను దీసి బొమ్మలను దుడిచి శుద్ధి గావించిన పిదప పైగంబరులవారు కాబామసీదులో ప్రవేశించి నమాజు చేసిరి. దాని పిదప కాబామసీదు ద్వారమున నిలిచి యిట్లు ఉపన్యసించిరి.

ఉ ప న్యా స ము .

దేవుఁడు అద్వితీయుఁడు అతనికి సాటిలేదు. దేవుఁడు తనసేవకున కిచ్చిన విజయవాగ్దానము పూర్తిచేసి తోడుపడెను. దేవుఁడు శత్రువుల సైన్యముల పరాజితమొనర్చెను. వినుఁడు అన్ని అహంకారములును పురాతన హత్యలపగయును పూర్వాపరాధములును నాపాదముల క్రింద త్రొక్కఁబడినవి. కాని కాబామసీదు ధర్మకర్తృత్వమును ఆధిపత్యమును యాత్రికుల కు నీళ్లిచ్చు నధికారమును పూర్వమువలె జరుగును. ఓఖురైషు వంశీయులారా! ఇపుడు దేవుఁడు మీపురాతనాహంకారమును వంశజాతి భేదముల ఘనతను నశింపఁజేసెను. మానవు లందఱును మూలపురుషుఁడగు ఆదము సంతతివారలే. ఆదము మట్టితో సృజింపఁబడెను. (కావున నెట్టిజాతి భేదములుండ కూడదు) దేవుఁడిట్లు ఖురానెషరీఫులో సెలవిచ్చుచున్నాఁడు. ఓమానవులారా! మేము మిమ్ము స్త్రీపురుషులనుండి సృజించితిమి. మీరు గుర్తింపఁబడుటకై తెగలుగను వంశములుగను సృజించితిమి. మీలో నెవఁడు ఎక్కువభక్తిగలవాఁడో వాఁడే దేవునికి చాల ప్రియుఁడు.

ఉపన్యాసములో ముఖ్యమైన అంశములను పైగంబరులవారు ఉపన్యసించిరి. ఇస్లాములో ముఖ్యమైనది అద్వితీయత (తౌహీదు) దాని గూర్చి ప్రప్రథమమునఁ జెప్పిరి.

అరబ్బులలో నొకప్రాచీన దురాచారముండెను. ఎవఁడైన ఒకని వధించినచో వధింపఁబడిన వానిబంధువులు హత్యగావించినవానిని వధించుటయే గాక వాని వంశములవారిని అన్యాయముగా వధించుచుండిరి. ఆహత్యలవలన పెక్కుతరముల వఱకుఁ దీర్చుకొనుచుండిరి. ఆహత్యాదోషము తీర్చుకొనుట మహాగౌరవముగాఁ దలఁచి దెబ్బలు కొట్టుకొనుచుండిరి. కావున పైగంబరులవారు ఇట్టి అహంకారములను రద్దుచేసిరి.

—: జాతిభేదములుండకూడదు :—

ఇతర దేశములలో నున్నట్లు ప్రాచీన అరేబియా దేశములో కూడ జాతిభేదములు గలవు. వాని ననుసరించి కొందఱు హీనస్థితిలో నుండిరి. నిజము చూచిన అందఱు మానవులే. ఒక స్త్రీపురుష జాతి నుండి పుట్టినవారే! పుట్టుటలో సృష్టినిబట్టి యెట్టి భేదములు లేవు. గుణశీలములను బట్టి ఘనత లభించును గాని యొకజాతిలో పుట్టిన మాత్రముననఘనత లభింపదు. అందఱుమానవులును జాతిభేదములు లేక సమానమైన దర్జాగలిగి సోదరభావముతో నుండవలెనని ఇస్లాము యొక్క ముఖ్యధర్మము. దానిని గూర్చి పైగంబరులవారు ఉపదేశించి జాతిభేదములను నశింపఁజేసిరి.

—: లోఁబడిన శత్రువులను క్షమించుట :—

ఉపన్యాసము ముగిసిన పిదప అచటనున్న వారి వైపు పైగంబరులవారు చూచిరి. ఆజనసమూహములో ముసల్మానులను నాశము చేయవలెనని గొప్ప హింసలు గావించిన ఖురైషు నాయకు లుండిరి. పైగంబరులవారు ఆఖురైషులను చూచి "మీవిషయమైనేనేమి చేయనున్నానోమీకుఁ దెలియునా?"

అని ప్రశ్నించిరి. ఖురైషులు కనులయ్యు పైగంబరువారి స్వభావము తెలిసినవారు గావున అఖున్ కరీమున్ నబ్నుఅఖిన్ కరీమిన్ మీరు గొప్పవారైన సహోదరులు. గొప్పసహోదరుని కుమారులు. మీరు కనికరింతురనియే మానమ్మకము అని బదులుచెప్పిరి. పైగంబరులవారు "మిమ్ముక్షమించితిని. మీపై నెట్టి నేరము మోపను. మిమ్ము విడిచి పెట్టితిని" అని పలికిరి.

—: ఖురైషులు ఇస్లాములో చేరుట. :—

అంతలో నమాజువేళ కాంగా హజ్రత్ బిలాలు గారు "అజాను" ఇచ్చిరి. దానిపిదప నమాజు చేసిరి. నమాజు ముగిసిన పిదప పైగంబరులవారు సఫాఅను కొండ దగ్గఱ ఎత్తు ప్రదేశమున కూర్చుండి యుండిరి. ఇస్లాములో చేరువారు వచ్చి పైగంబరులవారి చేతిలో చేయివేసి ఇస్లాము మతములో స్థిరముగా నుందుమనియు దేవునికి సాటికల్పింపమనియు దొంగిలింపమనియు, వ్యభిచారము చేయమనియు, అన్యాయముగ హత్యలుకావింప మనియు, ఆడుబిడ్డలను వధింప మనియు ఎవ్వనిపై అపనింద మోపమనియు, ఖరారు చేయుచుండిరి. పురుషులు ఖరారుచేసినపిదప స్త్రీలువచ్చి ఇస్లాములో చేరుచుండిరి. ఆస్త్రీలలో పైగంబరులవారి పినతండ్రియగు హజ్రత్ హంజా యొక్క గుండెకాయను ఒహుదు యుద్ధములో నమలిన హింద బుర్ఖావేసికొనివచ్చెను. ఆమెధైర్యముతో పైగంబరులవారి నిట్లుప్రశ్నించెను. "ఓ దేవుని ప్రవక్తా! మేమే విషయమునుగూర్చి ఖరారుచేయవలెను! పైగంబరులవారు "దేవునికి సాటికల్పింప మనియు దొంగిలింపమనియు ఆడుబిడ్డలను

నష్టంపమనియు" అని బదులుచెప్పిరి. అట్లు స్త్రీలును పురుషులును ఇస్లాములోచేరిరి.

—: పాఱిపోయిన ఖురైషులను క్షమించుట. :—

ఖురైషులలో కొందఱు పాఱిపోయిరి. వారిలో సఫ్వాను బిన్ ఉమయ్యా అనునతఁడు జిద్దాపురమునకు పాఱిపోయెను. అతఁడు పోయిన విషయము ఉమైర్ బిన్ వహాబు పైగంబరుల వారికిఁ దెలిపెను. అపుడు పైగంబరులవారు అభయసూచకముగా తమతలపాగ నొసంగిరి. ఉమైరు జిద్దాపురమునకుఁబోయి సఫ్వానును పిలిచికొని మక్కాపురమునకు వచ్చెను. అబ్దుల్లా బిన్ జబారా అనుకవి పైగంబరులవారిని తనపద్యకావ్యములో దూషించుచుండెను. అతఁడు నజ్రాను దేశమునకు పాఱిపోయి తిరిగివచ్చి ఇస్లాములోచేరెను. అబూజెహాలు కుమారుఁడగు ఇక్రమా యమను దేశమునకు పాఱిపోఁగా అతనిభార్య పైగంబరులవారి నుండి అభయపత్రము దీసికొనిపోయి యతని యమనుదేశము నుండి పిలిచికొనివచ్చెను. పిదప ఇక్రమా ఇస్లాములో చేరెను. ఇఁక మేము అతనిని హజ్రత్ ఇక్రమా అనిపిలుతుము. చూచితిరా పైగంబరులవారి క్షమాపణ సుగుణము! శత్రువులను శిక్షించుటకై శక్తిగలిగియు క్షమించిరి. అట్టివారుండుట అరుదుగదా!

కాబామసీదులో నున్న బొక్కసమును అట్లేయుంచిరి. పైగంబరులవారు మక్కావిజయమైన పిదప 15 దినములవఱకు మక్కాపురములో నుండిరి.

—: ఖుజైమా వారి నోడార్చుట. :—

మక్కానగరము విజయమైన పిదప షవ్వాలునెలలో

ఖుజైమా వంశమువారికి ఇస్లాము బోధించుటకై ఖాలిదుబిన్ వలీదుగారికి 350మంది తోడుగ నంపిరి. ఖుజైమావారుండు చోటు మక్కాపురము నుండి యొకదిన ప్రయాణమున నున్నది. ఖుజైమావారు ఇస్లాములో చేరిరి. కాని ముసల్మానులైతిమని స్పష్టముగాఁ జెప్పలేక సబానా (మేమితరమతము లో చేరితిమి) అని చెప్పిరి. అది తెలియక ఖాలిదుగారు వారిలో కొందఱిని వధించి మఱికొందఱిని ఖైదీలుగాఁ బట్టిరి. ఆసంగతి పైగంబరులవారికిఁ దెలిసి ఖాలిదుగావించిన ఘోర పాటునకు కోపించి తమ రెండు చేతులెత్తి 'ఓదేవా నేను ఖాలిదును బోధించుటకు మాత్రము పంపితిని. యుద్ధమాడుటకు పంపలేదు. ఖాలిదు గావించిన హత్య నాకిష్టముగానిది." అని చెప్పి దేవుని ప్రార్థించిరి. దాని పిదప పైగంబరులవారు హజ్రత్ అలీగారి చేత సొమ్మిచ్చి ఖుజైమావారి వంశములో వధింపఁబడిన వారికి హత్యాపరాధముగ సొమ్మిచ్చి యోదార్చుటకై పంపిరి. హజ్రత్ అలీగారు పైగంబరులవారి యాజ్ఞ ప్రకారము ఖుజైమావారి యొద్దకు వచ్చి వారికి సొమ్మిచ్చి యోదార్చిరి. ఆహత్యలో నొక కుక్క గూడ వధింపఁ బడియుండెను. దానికిఁగాను ధనమొసంగిరి. అట్లువారిని ఓదార్చి హజ్రత్ అలీగారు పైగంబరులవారి సన్నిధికి వచ్చి చేరిరి. చూచితిరా పైగంబరులవారి ధర్మపాలనము!

## హునైను యుద్ధము.

మక్కాపురమునకు చుట్టుపట్లనున్న అరబ్బుల కుటుంబములవారు ఖురైషులు ఓడిపోయి మక్కాపురమును పైగంబరులవారు జయించినచో వారు నిజముగ దేవుని ప్రవక్తలే

యని తలంచి దానికిఁ దాను ఏమియు చేయుచుండెను. మక్కా-
విజయము కాఁగానే గుంపులు గుంపులుగా జనమువచ్చి ఇస్లా
ములోఁ జేరినారు. కాని హవాజిను సకీఫు అను పెద్దకుటుంబ
ములవారు ఇస్లాము వృద్ధిని చూచి సహింపలేక యెట్లైన
ఇస్లామును నాశనము చేయవలెనని యెంచి గొప్పసైన్యము
కూర్చిరి. మక్కాపురము జయింపఁబడినది. ఇపుడైన ఇఁక
ముసల్మానులకు సనకాశమియ్యరాదు. ఇప్పుడేవో వారి వృద్ధిని
అడ్డగించుటకు నెవరికిని శక్యముగాదు అని తలంచి యుద్ధమునకై
సిద్ధమై మక్కాపై దాడి వెడలి హునైను అనుచోటను
ముఖాముచేసిరి. వారికి సేనాధిపతిగా ఔఫ్బిన్ మాలికు ఉండె
ను. వారికి నాలుగువేల సైన్యముండెను. హునైను ప్రదేశము
మక్కాపురమునకును తాయెఫుపట్టణమునకు మధ్యనున్నది.
ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి సహింపలేక శత్రువులను
మాఱ్కొనుటకై హిజరీసనిమిదవయేట షవ్వాలు నెలలో
పయనమైరి. 12 వేలమంది సైన్యముండెను. ఆసైన్యములో
2 వేలమంది క్రొత్తగా ఇస్లాములోఁ జేరినవారు గూడ నుండిరి.
“మేము 12 వేలమంది యున్నాము. మమ్మెవరు మాఱ్కొనఁ
గలరు?” అను అహంకారవాక్యములు ముసల్మానులు పలికిరి.
ఆమాట దేవునికి ప్రీతికాదుగదా! అందుచే యుద్ధము ప్రారం
భముకాఁగానే, శత్రువులు కురిపించిన బాణములచే నిలువలేక
ముసల్మానులు చెల్లాచెదరై పోయిరి. ఆయుద్ధభూమిలో పై
గంబరులవారు ఒంటరిగా నిలిచియుండి అనన్నబియ్యులాకజిబ్
వఅనబ్నుఅబ్దుల్ ముత్తలిబ్ ” (నేను నిజముగా దేవునిప్రవక్తను.
అబద్ధముగాదు. నేనుఅబ్దుల్ ముత్తలబు యొక్క పుత్రుఁడను.)

అని పలుకుచుండిరి. అట్టి సమయములో స్థిరులై నిలిచియుం డుట పైగంబరులవారి మహిమయే గదా! అపుడు పైగంబ రులవారు కుడిప్రక్కను యెడమప్రక్కను చూచి ఓఅన్సారు లారా అని పిలువఁగా వచ్చితిమి వచ్చితిమి అనిచెప్పుచు పై గంబరులవారిని చుట్టుకొనిరి. పైగంబరులవారి పినతండ్రియగు హాజరత్ అబ్బాసుగారు పైగంబరులవారి సవారికళ్లెము పట్టు కొనియుండిరి. ముహాజిర్లను అన్సారులను పిలుచుటకై అబ్బా సుగారి నాజ్ఞాపించిరి.

—: ముసల్మానుల విజయము. :—

అబ్బాసుగారు పిలువఁగా నందఱు శిష్యులు యుద్ధ భూమిలో తిరిగి వచ్చి పైగంబరులవారిచుట్టు నిలిచి మహా శౌర్యముతో శత్రువులను మార్కొనిరి. అపుడు యుద్ధముతీరు మారిపోయెను. శత్రువులు పరాజితులై పాఱిపోయిరి. పట్టువడి న వారిచేతులకు సంకెలలు వేయఁబడెను. తుదకు ముసల్మా నులకు విజయము లభించెను. ఓడిపోయిన సైన్యములో కొం దఱు తాయెఫు కోటలోనికిఁ బోయిదాఁగుకొనిరి. మఱికొంద ఱు ఔతాసు అనుచోటు చేరిరి. తాయెఫు చేరినవారిలో యుద్ధవీరులును సేనాధిపతియగు ఔఫుబిన్ మాలికు నుండిరి. ఔతాసు చేరినవారిలో శత్రువుల ఆలుబిడ్డలును వారిసొత్తులు నుండెను.

—: ఔతాసయుద్ధము. :—

పైగంబరులవారు ఔతాసులో నున్నశత్రువులను మా ర్కొనుటకై అబూఆమిర్ గారిని సేనాధిపతిగాఁజేసి కొంత సేనను పంపిరి. వారు ఔతాసుచేరఁగా నచట శత్రువులు వారి

తో యుద్ధమాడెను. అబూఆమిర్‌గారు యుద్ధములో వధింపఁబడి స్వర్గలోకము చేరెను. వారిపిదప అబూమూసా అష్అరీగారు సేనాధిపత్యము వహించి యుద్ధమాడి శత్రువులను ఓడించి వారిపాత్రలను ఆలుబిడ్డలను భూములను పట్టుకొనిరి. ఆవిషయము పైగంబరులవారికి దెలిసి ఖైదీలను విజయపు సొత్తును "జయిఱ్రానా" అను ప్రదేశమునకు తీసికొనిపోయి జాగ్రత్త పఱుపుఁడని ఆజ్ఞాపించిరి. ఆప్రకారమే హునైను నుండి ముసల్మానులు ఖైదీలను సొత్తును జయిఱ్రానకు దీసికొని పోయి యచట ముఖాముచేసిరి.

—: తా యె ఫ కో ట ము ట్ట డి .:—

పైగంబరులవారు హునైనుయుద్ధము ముగిసిన పిదప తాయెఫులోనున్న సైన్యమును మార్కొనుటకై పయనమై తాయెఫుకోటను ముట్టడించిరి. శత్రువులు కోటబురుజుల నుండి బాణములు ముసల్మానులపై వేయసాగిరి. దానిచే కొందఱు ముసల్మానులు వధింపఁబడి స్వర్గలోకము చేరిరి.

ముసల్మానులు 20 దినముల వఱకు విడువక కోటను ముట్టడించియుండిరి. కాని విజయము లభింప లేదు. పైగంబరులవారు నౌఫిల్ బిన్ముఆవియాగారిని పిలిచి ముట్టడిని గూర్చి యాలోచింపఁగా అతఁడు "నక్క బిలములో దూఱినది. ప్రయత్నించిన పట్టువడును. లేక విడిచి పెట్టినను యేమియు భయము లేదు" అనిచెప్పెను. అదివిని పైగంబరులవారు సైన్యము కోటముట్టడిచాలించి జయిఱ్రానాకు పయనము కావలెనని యాజ్ఞాపించిరి. ముసల్మానులు శత్రువులను శపింపుఁడని పైగంబరులవారితో విన్నవించిరి. కాని పైగంబరులవారు

శాపమునకు బదులుగా "అల్లాహుమ్మ, ఇహ్దీ-సఖీఫన్, వాతి బిహిమ్ (ఓ దేవా! సఖీఫువారికి సన్మార్గము చూపి నాయొద్దకు వారు వచ్చునట్లు చేయుము) అని శత్రువులను దీవించిరి. (తుదకు పైగంబరులవారు దీవించినట్లే సఖీఫువారు పైగంబరులవారి సన్నిధికి వచ్చి ఇస్లాములో స్వయముగానే చేరిరి.)

పైగంబరులవారు తాయెఫుకోటముట్టడి చాలించి జిఇర్రానాకు పోయి జూల్ఖాదా నెల 5వ తేదిని చేరిరి.

--: విజయసొత్తు. :--

యుద్ధములో పట్టువడిన ఖైదీలును, స్త్రీలును, బిడ్డలును కలిసి 6 వేలమంది యుండిరి. 24 వేలు ఒంటెలును, 40 వేలు మేకలును, 40 వేలుతులముల యెత్తు వెండియు విజయపుసొత్తుగా ముసల్మానులకు లభించినది. ఆసొత్తు యుద్ధధర్మప్రకారము సైనికులకు పంచిపెట్టఁబడెను. బానిసలుగా వచ్చిన ఖైదీల విషయము వారిబంధువులు వత్తురేమో యని పైగంబరులవారు ఎదురుచూచి యెవరును రానందున యుద్ధధర్మప్రకారముగ ఖైదీలను బానిసలుగా సైన్యమునకు నొసంగిరి. క్రొత్తగా ఇస్లాములో చేరిన మక్కా-ఖురైషులకు బహుమానముగా పైగంబరులవారు వందవంద ఒంటెలు హెచ్చుగా నిచ్చిరి. అది చూచి కొందఱు అన్సారులు ఖురైషులకు నెక్కుడు సొత్తునిచ్చి మాకియ్యలేదని చెప్పుకొనిరి. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి అన్సారులందఱిని పిలిచి వారువిన్నవార్తను గూర్చి ప్రశ్నించిరి. అపుడు అన్సారులలోని పెద్దవారు లేచి "మీరువినినది నిజమే. మనలో పెద్దవారట్లు పలుకలేదు. కాని యువకులు పొరపాటుతో నట్లుచెప్పిరి." అనివిన్నవించిరి.

అదివిని పైగంబరులవారు "ఓ అన్సారులారా! క్రొత్త
గా ఇస్లాములో చేరిన ఖురైషులనాయకులకు బహుమానము
లిచ్చి వారిని ప్రోత్సాహపఱచుటకై యొసంగితిని. వారు సొ
త్తును తీసికొని పోవుచున్నారు. మీరు మీవెంట దేవునిప్రవ
క్తను తీసికొనిపోవుటకు ప్రీతిపడరా?" అని బోధింపఁగా అన్సా
రులు మాకు సమ్మతమే అని వినయభక్తులతో విన్నవించిరి.

—: ఖైదీలను విడిపించుట. :—

ఖైదీలను విడిపించుటకై హవాజనువారి రాయబా
రులు పైగంబరులవారి సన్నిధికి వచ్చి దాని గూర్చి ప్రశ్నిం
చిరి. అపుడు పైగంబరులవారు "సొత్తు కావలెనా? లేక ఆలు
బిడ్డలు కావలెనా? రెండింటిలో నేదైనా నొకటి సమ్మతిం
పుఁడు" అని యుపదేశింపఁగా వారు ఆలుబిడ్డలు కావలెనని
పలికిరి. పైగంబరులవారు తమభాగములోను తమబంధువుల
భాగములోను వచ్చిన ఖైదీలను విడుదలచేసిరి. మిగిలిన సైన్య
మువారి భాగములో వచ్చిన ఖైదీలను గూర్చి ముసల్మా
నులతో వదలుఁడని హవాజనుగారి కొఱకు సిఫారసు చేసిరి.
ముసల్మానులు పైగంబరులవారి సిఫారసు చొప్పున తమతమ
భాగములలో వచ్చిన ఖైదీలను విడిచిపెట్టిరి. అట్లు పైగంబ
రులవారి దయచే బానిసలుగా నున్న 6 వేలమంది ఖైదీలు
విడువఁబడిరి.

--: దాదిహలీమాగారికుమార్తెను గౌరవించుట. :--

ఆఖైదీలలో పైగంబరులవారి దాదిహలీమాకుమార్తె
షీమా యుండెను. పైగంబరులవారు ఆమెను చాలగౌర
వించి తమదుప్పటి పఱచి యామెను కూర్చుండఁబెట్టిరి.

ఆమెకు గొప్ప బహుమానములిచ్చి "యిష్టపడినచో నాయొద్ద నుండవచ్చును లేక కుటుంబమువారి వెంటపోవచ్చు"నని పైగంబరులవారు చెప్పిరి. ఆమె తనకుటుంబమువారితో పోవుటకు సమ్మతించగా గొప్పమర్యాదలు గావించి పంపిరి.

పైగంబరులవారు జయిర్రానా చోటునందు 13 దినముల వఱకుండి యచటనుండి కాబామసీదును దర్శించుటకు పయనమై మక్కాపురిము ప్రవేశించిరి. దర్శనము (ఉమ్రా) ముగిసిన పిదప మక్కావారికి ఇస్లాము ధర్మములు నేర్పుటకై మఆజుబిన్ జబలుగారిని నియమించి మదీనాపురమునకు పయనమైరి.

## —: ఇబ్రాహీము పుట్టుట. : —

హిజ్రీయెనిమిదవయేట నే పైగంబరులవారికి బీబీమారియాగారి యందు పుత్రుడు గలిగెను. ఆయనకు ఇబ్రాహీము అనిపేరు పెట్టిరి. పైగంబరులవారు ఇబ్రాహీమును చాల ప్రేమించుచుండిరి. హిజ్రీపదియవయేట ఒకటిన్నర సంవత్సరముల వయస్సులోనే ఇబ్రాహీము మరణించెను. ఆదినము సూర్యగ్రహణము సంభవించెను. ప్రజలు పైగంబరులవారి పుత్రుడు మరణించినందున సూర్యగ్రహణ మాయెనని చెప్పుకొనసాగిరి. అది పైగంబరులవారికి దెలిసి ప్రజలసభ గావించి "సూర్యచంద్రాదులు దేవునిశక్తి చిహ్నములు. ఒకనిపుట్టుకచే లేకచావుచే వానికి గ్రహణము పట్టదు" అని బోధించిరి. దాని పిదప నమాజు చేసిరి.

## —: పైగంబరువారి కుమార్తె మరణించుట. : —

పైగంబరులవారి కుమార్తెయగు బీబీజైనబు హిజ్రీ యెనిమిదవయేట మరణించెను.

పైగంబరులవారు హిజ్రీయెనిమిదవయేఁట చుట్టుపట్లనున్న కుటుంబములవారికి బోధించుటకై తమశిష్యుల నంపుచుండిరి. వారి బోధనచే ననేకకుటుంబములవారు ఇస్లాములో చేరుచుండిరి.

## హిజ్రీ తొమ్మిదవ యేఁడు.

### —: జకాతు ధర్మము. :—

హజరత్ పైగంబరులవారు తొమ్మిదవయేఁట మొహరమునెలలో ధనవంతులలో జకాతునకై చుట్టుపట్లనున్న గ్రామములకు వసూలు చేయువారి నంపిరి. ఆయేఁట నే జకాతు ధర్మము విధింపఁబడెను.

### --: తాయివంశము. :--

పైగంబరులవారు హజరత్ అలీగారిని తాయివంశము వారి యొద్దకు 150మందిని తోడు చేసిపంపిరి. తాయివంశమువారిలో హాతిమ్‌తాయి కుమారుఁడు సిరియాదేశమునకు పాఱిపోయెను. మిగిలినవారు పట్టుపడిరి. ఆఖైదీలలో హాతిమ్ తాయి కుమార్తె యుండెను. పైగంబరులవారి సన్నిధిని ఆమె తనతండ్రి విషయము విన్నవింపఁగా నామెను పైగంబరులవారు విడుదలగావించిరి. ఆమె ఇస్లాములో చేరి సిరియాదేశమునకుఁబోయి తనయన్నను పిలిచికొని పైగంబరులవారి సన్నిధికి రాఁగా నతఁడు కూడ ఇస్లాములో చేరెను.

### —: స్త్రీలను మందలించుట. :—

హిజ్రీ తొమ్మిదవయేఁట హజరత్ పైగంబరులవారు తమభార్యలతో ఒకనెలవఱకు కలియక వేఱుగానుండిరి.

దానికి కొన్నికారణములు గలవు. విజయ ధనము వచ్చుచుం
డినను పైగంబరులవారు తమసంసారము కొఱకు నెక్కువగాఁ
దీసికొనక చాలఇబ్బందితో జరుపుకొనుచు ఇతరులకు సౌఖ్య
ము కలుగఁజేయుటకై దానము చేయుచుండెడివారు. అందుచే
వారిస్త్రీలు ఖర్చులకుఁగాను హెచ్చుగా నడుగుచుండిరి. వారి
స్త్రీలలో పెద్దపెద్దనాయకుల కుమార్తెలుండిరి. వారు చాల
సౌఖ్యము పొందియుండినవారు. పైగంబరులవారు పరలోక
సౌఖ్యమును గూర్చి పాటుపడుచు ఇహలోక సౌఖ్యములను
లెక్కచేయనివారు. అట్లు పైగంబరులవారి స్త్రీలు ఖర్చులకు
గాను తమభర్తను తొందఱ పెట్టుచుండిరి. మఱియు హజ
రత్ పైగంబరులవారికి తేనె యందు చాలఇష్టము. వారు
కొన్నిదినములవఱకు తమభార్యయగు బీబీజైనబుగారి గృహ
ములో నుండిన తేనె త్రాగుచుండిరి. అదిపైగంబరులవారి
యితర భార్యలకుఁదెలియఁగా సవతులకేర్పడు సహజరోషము
వారికిఁగూడఁ గలిగెను. బీబీఆయిషాగారును బీబీహఫ్సాగారు
ను।ఏకీభవించి పైగంబరులవారు తేనె త్రాగివచ్చిన "మీనో
టినుండి మగాఫరు (ఒకవిధమైనబంక) వాసన వచ్చు
చున్నదే" యని అడుగవలయునని రహస్యముగా
మాటలాడుకొనిరి. అటులే పైగంబరులవారు రాఁగాఁజెప్పి
రి. పైగంబరులవారు 'నేను తేనె త్రాగితిని. దానివాసన మంచి
దికానిచో దానిని ఇఁక త్రాగను' అని పలికిరి. అట్లు పైగంబ
రులవారి స్త్రీలు తొందఱలు కలుగఁ జేయుచుండినందున
స్త్రీలను మందలించుటకై వేఱుగృహములో ఒకనెలవఱకుండిరి.

దానిచే పైగంబరులవారి స్త్రీలు గావించుచుండిన తొందఱలు మానుకొని "మాకు పరలోక సౌఖ్యము కావలెను. ఇహలోక సౌఖ్యము లక్కఱలేదు, మీయనుగ్రహమే గొప్పభాగ్య" మని భర్తతో విన్నవించిరి. ఒకనెల పిదప పైగంబరులవారు యథాప్రకారము తమస్త్రీలయొద్ద నుండసాగిరి. ఆవిషయమునుగూర్చి ఖురాను షరీఫుయొక్క సూరెతె హ్రీములో నున్నది.

## — : తబూకు దండయాత్ర. : —

తబూకు అనుచోటు మదీనాపురమునుండి 14 దినముల ప్రయాణదూరమున మదీనా దిమష్కు పురములకు మధ్య నున్నది. మూతాయుద్ధము జరిగినప్పటి నుండి రోమనులు అరేబియాదేశముపై దాడివెడలుటకు యత్నించుచుండిరి. రోమనురాజునకు లోఁబడి సిరియాదేశములో రాజ్యముచేయుచుండిన గస్సానీ వంశస్థుఁడు క్రైస్తవుఁడగుటచే రోమనురాజు అరేబియాపై దాడివెడలుటకై గస్సానీరాజును నియమించెను. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి హిజ్రీ తొమ్మిదవ యేఁట రజబునెలలో దాడివెడలుటకై తమవారికాజ్ఞాపించిరి. ఆకాలమున చాల కఱవుండెను. వేసవి తీవ్రముగానుండెను. అందుచే దాడివెడలుట దుష్కరముగా నుండెను. వంచకులు తాము వెడలక యితరులను కూడ "తీవ్రమైన యెండకాలమున్నది. వెడల కూడదు" అని అడ్డగించుచుండిరి. రోమనుల గొప్పసైన్యమును మార్కొనవలసియుండునని పైగంబరులవారు చుట్టుపట్లనున్న అరబ్బులకుటుంబములవారు యుద్ధమునకై వెడలవలసినది అని చాటించిరి. సైనికుల ఖర్చులకుఁ

గాను ధనవంతుల నుండి చందాలు పుచ్చుకొనిరి. అందు ముసల్మానులు గొప్పగొప్ప చందాలిచ్చిరి. హజ్రత్ ఉస్మానెగనీగారు 300 ఒంటెలును 1000 దీనారములును చందాగా నిచ్చిరి. హజ్రత్ అబూబకరుగారు తమయింటి సొత్తు అంతయు చందాగా నిచ్చిరి. హజ్రత్ ఉమరుగారు తమయింటి సొత్తులో సగము దెచ్చిచందాగా నిచ్చిరి. ముసల్మానులందఱు తమతమ శక్తి కొలంది చందాలు చెల్లించిరి. అట్లు 30 వేల సైన్యము పయనమాయెను. ముసల్మానులను రోమనురాజు నాశముచేయును. వారు మరలి రారు అని చెప్పుకొనుచు వంచకులు సంతసించుచుండిరి. పైగంబరులవారు ఆలుబిడ్డల సంరక్షణార్థమై హజ్రత్ అలీగారిని మదీనాలోనే విడిచి పోయిరి. ముసల్మానులలో కొందఱు వెడలుటకు శక్తి లేనందున మహాదుఃఖముతో నిలిచిపోయిరి. కాని ముగ్గురు ముసల్మానులు శక్తిగలిగియు రేపు పోవచ్చును మఱునాడు పోవచ్చును అని సోమరితనముచే సైన్యముతో పోక మదీనాలోనే నిలిచిపోయిరి. ఆముగ్గురి క్షమాపణ గూర్చిన విషయము ఇంకమీఁద వ్రాయుదుము.

పైగంబరులవారు 30 వేల సైన్యముతో పయనమైరి. మధ్యలో నీటివసతి లేక యాహార సామగ్రి తఱిగి సైన్యమునకు చాలకష్టము సంభవించెను. సైనికులు దానికి సహించుచు తబూకనుచోటునకుఁబోయి 20 దినములవఱకు ముఖాము చేసిరి. కాని రోమనుల సైన్యము రాలేదు. యుద్ధము సంభవింపలేదు. ఆమధ్యలో 'యేలా' దేశపుసర్దారుఁడు యోహాన్న పైగంబరులవారి సన్నిధికి వచ్చి కొన్నికానుకలొసంగి

కష్టము కల్గునని చెప్పుకొనెను. ఆదేవిధముగా జర్బా అజ్రా దేశపు క్రైస్తవులు పన్ను కట్టెదమని చెప్పుకొనిరి. పైగంబరులవారు ఖాలిదుబిన్ వలీదును 420 మందితో దౌమతుల్ జన్దల్ అను చోటునకు పంపిరి. ఆచటిసర్దారుని ఉకీదురు పట్టుబడి పైగంబరులవారి యొద్దకు వచ్చి పన్నుకట్టెదనని సమ్మతించి తన దేశమునకు పోయెను. పైగంబరులవారు తబూకు నుండి మరలి మదీనాపురమునకు వచ్చిచేరిరి.

—: వంచకుల కపటమసీదు. :—

వంచకులు ఒక మసీదు కట్టించిరి. అచట వారు పైగంబరులవారికి విరుద్ధముగా కుట్రలు సలుపుచుండిరి. పైగంబరులవారు తబూకునకు పోవునప్పుడు వంచకులు వచ్చి మేము మసీదు కట్టినాము. మీరు దయచేసి శుభము కొఱకు వొక పూట నమాజు సలుపుడు అని పైగంబరులవారితో విన్నవించిరి. పైగంబరులవారు "నేనుతబూకునకు పోవుచున్నాను. ఇప్పుడు వీలులేదు. మరలి వచ్చినప్పుడు చూచెదను" అని బదులు చెప్పిరి. పైగంబరులవారు తబూకు నుండిమరలి మదీనాపురమునకు వచ్చిన పిదప వంచకులు గావించిన కుట్రమసీదును కాల్చివేయుటకై ఆజ్ఞాపించిరి. ఆకుట్రమసీదును గూర్చి ఖురానెషరీఫులో కూడనున్నది.

—: వంచకులను క్షమించుట. :—

పైగంబరులవారు తబూకునుండి మరలి వచ్చిన పిదప వంచకులు "మీవెంబడి మేము కూడ వచ్చియుందుము గాని మాకు శక్తిలేనందున రాలేకపోతిమి. క్షమింపుడు" అని పలువిధములైన వినయవాక్యములు చెప్పుచు క్షమాపణ

కోరిరి. పైగంబరులవారు వారిని సమ్మతించి మన్నించిరి.

—: తబూకు యాత్రకు రాని ముగ్గురు ముసల్మానులు. :—

కాబుబిన్ మాలికు మురారా హిలాలు అనుముగ్గురు ముసల్మానులు కొంత సోమరితనముతో సైన్యము వెంబడి పోలేదు. ఆముగ్గురు తమవల్ల జరిగిన పొరపాటునకు చాలదుఃఖించిరి. వంచకుల వలె ఆముగ్గురు నెపముగా వచ్చి క్షమాపణకోరలేదు పైగంబరులవారు ఆముగ్గురి విషయమై దేవునాజ్ఞ కలుగునంత వఱకు ముసల్మానులు వారితో మాటలాడకూడదు. సలాము చేయకూడదు అని ఆజ్ఞాపించిరి. వారిముగ్గురి భార్యలుకూడ వేఱుగానుండవలెనని సెలవిచ్చిరి. అందుచే ఆముగ్గురికి చాలఇబ్బంది గలిగి మహాదుఃఖముతో పశ్చాత్తాప పడుచుండిరి.

—: కాబుగారికి గస్సానీరాజు వ్రాసిన లేఖ. :—

ఆకాలములో గస్సానీరాజు కాబుబిన్ మాలికుగారికి నిట్లు వ్రాసెను " మీవారు మిమ్ము సంఘబహిష్కారము చేసి యవమానించినట్లు వింటిమి. మీరు మాయొద్దకు దయచేయుండు. మిమ్ము చాల గౌరవించెదము." అది చదివి కాబుబిన్ మాలికుగారు లేఖను దెచ్చినవానిఎదుటనే యాలేఖను కుంపటిలో వేసికాల్చి "మీరాజు వ్రాసిన లేఖకు సిదే జవాబు. మా పైగంబరులవారి కోపము మీరాజు అనుగ్రహముకన్న మాకు చాల ప్రీతియైనది." అని చెప్పి పంపిరి. చూచితిరా భక్తుల స్థిరబుద్ధియు విశ్వాసమును.!

—: దేవుఁడు ముసల్మానులను క్షమించుట. :—

అట్లా ముగ్గురు భక్తులు మహాదుఃఖముతో 50దినములు

గజెసిరి. పిదప దేవుడు నాకు క్షమించెను. అని సందేశము (వహీ) పంపగా ఆమున్ఘరు మహాసంతోషముతో ముసల్మానులతో కలిసిరి. కాబట్టికీ మూలికిసగారు తనఆస్తిలో మూడింట ఒకపాలు దానముచేసి దేవుడు క్షమించినందులకు కృతజ్ఞత చెల్లించిరి.

—: ఆబూబకరుగారు కాబాయాత్ర చేయుట. :—

హిజ్రీ తొమ్మిదవ యేట మక్కాపురము జయించబడినను కాఫర్లు కాబాయాత్ర చేయుచునే యుండిరి. ఇంకను దేశములో పూర్తిగా శాంతము కలుగక యుండెను. అందుచే ముసల్మానులును కాఫర్లును కలిసి కాబాయాత్ర (హజ్) చేయుచుండిరి. హిజ్రత్ తొమ్మిదవ యేట దేశములో పూర్తిగా శాంతము గలిగెను. అందుచే పైగంబరులవారు తబూకు నుండి మరలి వచ్చిన పిదప మదీనానుండి 300మంది శిష్యులను కాబాయాత్ర కొరకు జూల్ఖాదా నెలలో పంపిరి. వారిలో హజ్రత్ అబూబకరుగారు సర్దారుగానుండిరి. వారి వెంబడి హజ్రత్ అలీగారిని ప్రకటన గావించుటకై నియమించి పంపిరి. వారి వెంట 20ఒంటెలు ఖుర్బానీ కొరకుండెను. హజ్రత్ అబూబకరుగారు మక్కాపురము చేరి కాబాయాత్ర (హజ్) యొక్క ఆచారములను ప్రజలకు దెలిపిరి. అపుడు హజ్రత్ అలీగారు సూరెబరాతు యొక్క నలువది వాక్యములు చదివి యాత్రికులకు వినిపించి "ఇప్పటి నుండి కాఫర్లు కాబా మసీదులో ప్రవేశింపగూడదు. ఎవ్వరును దిగంబరులై కాబా యాత్ర చేయగూడదు. కాఫర్లతో గావింపబడియున్న యొడంబడికలు 4నెలల వఱకుండును. దాని పిదప నవి చెల్లవు"

అని ప్రకటించిరి. ఆప్రకటనను హాజరత్ అబూహురైరా గారు కూడ తమనోంతు కేకలుపోవునట్లుగ నిలిచి ప్రకటించిరి. హాజరత్ అబూబకరుగారును ముసల్మానులును కాబాయాత్ర ముగిసిన పిదప మదీనాపురము వచ్చిచేరిరి. ఆప్రకటన తరువాత పెక్కుమంది కాఫర్లు ఇస్లాములో చేరిరి.

—: వడ్డి వ్యాపారము నిషేధింపఁబడుట. :—

హిజ్రీతొమ్మిదవయేఁట వడ్డి వ్యాపారము నిషేధింపఁబడెను. దాని గూర్చి పైగంబరులవారు హిజ్రీ పదియవయేఁట కావించిన కాబాయాత్ర(హాజ్) కాలమున ప్రకటన గావించిరి.

—: రాయబారములు వచ్చుట. :—

మక్కాపురము జయింపఁబడిన పిదప చుట్టుపట్లనున్న దేశములవారు ఇస్లాములో చేరుటకై పూని తమతమ రాయబారములను పైగంబరులవారి సన్నిధికి పంపుచుండిరి. ఆరాయబారములలో కొన్ని మాత్రము రాచటికి విషయములఁగూర్చి యొడంబడికలు గావించుటకై వచ్చుచుండెను. హిజ్రీతొమ్మిదవయేఁట పైగంబరులవారు తబూకు నుండి మరలివచ్చిన పిదప పెక్కు రాయబారములు వచ్చెను. అందుచే ఆసంవత్సరమును ఆముల్ వఫూద్ (రాయబారములసంవత్సరము) అని చెప్పుదురు. రమారమి 60 రాయబారములు వచ్చెను. వానిలో కొన్ని హిజ్రీతొమ్మిదవయేఁడునకు మునుపు వచ్చియుండెను. ఇఁక కొన్ని ముఖ్యమైన రాయబారములను గూర్చి వ్రాయుదుము. అన్నిటిని గూర్చి వ్రాయవలెనన్న గ్రంథము పెరుఁగును. హిజ్రీ తొమ్మిదవయేఁడునకు మునుపు వచ్చిన వానిని ముందువ్రాయుదుము.

—: ముజైనా రాయబారము. :—

ముజైనా వంశము అరబ్బులలో గొప్పకుటుంబము. వారిలో హిజ్రీ అయిదవయేఁట 400 మంది రాయబారులుగా పైగంబరులవారిసన్నిధికి వచ్చి ఇస్లాము స్వీకరించిరి.

—: బనూతమీము రాయబారము. :—

బనూతమీము వంశమువారు చాలబలమైన కుటుంబములవారు. ఆవంశములోని పెద్దపెద్దసర్దార్లు మహావైభవముతో రాయబారులుగా పైగంబరులవారి సన్నిధికివచ్చిరి. వారు తమరాకను గూర్చి పైగంబరులవారికిఁ దెలిపి కొన్నివిషయములఁగూర్చి సంభాషించి ఇస్లాములో చేరిరి.

—; బనూసాదు రాయబారము. :—

బనూసాదు తెగవారు జమాముబిన్‌సాలబాను రాయబారిగా పైగంబరులవారి సన్నిధికి పంపిరి. అతఁడు పైగంబరులవారితో నిట్లు సంభాషించెను. "ఓముహమ్మదూ నేను కొన్నివిషయములను గూర్చి కఠినముగా నడుగుదును. కోపపడవలదు" అని పలుకఁగా పైగంబరులవారు ఇష్టము వచ్చినట్లు అడుగవచ్చును అని బదులు చెప్పిరి. అప్పుడతఁడు నిజముగా దేవుఁడు మిమ్ము జగత్తునకంతయు ప్రవక్తగాఁ జేసిపంపినాఁడా? అయిదుపూఁటలు నమాజు చేయవలెనని దేవుఁడాజ్ఞాపించినాఁడా? జకాతును ఉపవాసమును కాబాయాత్ర (హాజ్) ను దేవుఁడు విధించినాఁడా అని ప్రశ్నింపఁగా "అవును" అని పైగంబరులవారు బదులు చెప్పిరి. అతఁడు ధర్మములు తెలిసికొనిన పిదప "నేను జమాముబిన్ సాలబాను. నా తెగవారు నన్నుమీయొద్దకు రాయబారిగా పంపియున్నారు.

నేను వారియొద్దకు పోయి మీరుపదేశించిన ధర్మములను హెచ్చుతగ్గులులేక బోధింతును అని పలికి పయనమాయెను. అప్పుడు పైగంబరులవారు ఈతండు పలుకునది నిజముగా నున్నచో నితఁడు ముక్తి పొందును అని యుపదేశించిరి. జమాము తన తెగవారి కొరకుపోయి, లాతు, ఉజ్జాఅను విగ్రహములు పనికిమాలినవి. అవి లాభములుగాని నష్టములుగాని చేయలేవు అని పలుకఁగా వారు "ఏమి నీకు పిచ్చి పట్టినదా" అని నిందించిరి. అపుడతఁడు "నేను దేవుని, అతని ప్రవక్తయగు ముహామ్మదువారిని నమ్మితిని" అనిచెప్పెను. తుదకు నతని బోధచే బనూసాదు తెగవారు ఇస్లాములో చేరిరి.

—: అష్అరీరాయబారము. :—

అష్అరీ అనువంశము యమను దేశములో చాలా ప్రసిద్ధికెక్కినది. అబూమూసాఅష్అరీ అనువారు ఆవంశములో చేరినవారే. ఆ తెగవారు హజ్రత్ ముహామ్మదు వారినిగూర్చి విని మదీనాపురమునకు 53 మంది పయనమైరి. వారు ఓడ నెక్కి సముద్రపుదారిని వచ్చుచుండిరి. గాలి విరుద్ధముగా వీచినందున వారు అబిసీనియారేవు చేరిరి. అచట హజ్రత్ జాఫరు (హజ్రత్ అలీయొక్క అన్న) గారితో కలిసిరి. అచటి నుండి హజ్రత్ జాఫరును ఆ 53 మంది అష్అరీ తెగవారును పైగంబరులవారి యొద్దకుపోవుటకై పయనమైరి. ఆసమయములో పైగంబరులవారు ఖైబరుయుద్ధమునకై పోయి దాని జయించియుండిరి. హజ్రత్ జాఫరును వారితోడివారును ఖైబరునకు పోయి యచట పైగంబరులవారిని దర్శించిరి. వారు పైగంబరులవారితో లోకసృష్టిని గూర్చి

అడుగఁగా "ముందు దేవుఁడుండెను. ఏదియును లేకుండెను. ఆతని పీఠము జలముపై నుండెను." అని యుపదేశించిరి.

—: దౌసు రాయబారము :—

హిజ్రీ యేడవయేట దౌసు తెగవారు పైగంబరులవారు ఖైబరులో నున్నప్పుడు వచ్చి దర్శించిరి. పైగంబరులవారు మక్కాపురములో నుండినప్పుడు తుఫైలుబిన్ అమ్రు అనువారు ఇస్లాము స్వీకరించియుండిరి. దానిని గూర్చి వ్రాసియున్నాము. తుఫైలు దౌసిగారు తమ దేశమునకు పోయి యిస్లామును గూర్చి బోధించిరి. ఆ తెగవారు ఎక్కువగా వ్యభిచారులు. ఇస్లాములో చేరిన ఆ దుర్గుణమును మానుకొనవలసి వచ్చును. అని వారు ఇస్లాములో చేరకయుండిరి. అది చూచి తుఫైలు దౌసీగారు పైగంబరులవారియొద్దకు వచ్చి తమ తెగ వృత్తాంతము తెలుపఁగా వారు ఓ దేవా దౌసీ తెగవారికి సన్మార్గము నవలంబించునట్లు చేయుము అని ప్రార్థించి నెమ్మదిగాను ప్రేమతోను ఇస్లామును గూర్చి బోధింపుఁడు అని తుఫైలు దౌసిగారిని పంపిరి. తుఫైలుగారు మరలి తమ దేశమునకు పోయి బోధింపఁగా దేవుని యనుగ్రహమువలన వారి తెగవారందఱును ఇస్లాములో చేరిరి. అట్లు వారు ఇస్లాములో చేరి పైగంబరులవారిని దర్శించుటకై పెద్ద రాయబారము నంపిరి. ఆరాయబారములో హజరత్ అబూహురైరాగారు కూడనుండిరి.

—: అష్జఈ రాయబారము :—

పైగంబరులవారు తాయెఫు కోట ముట్టడి చాలించి మరలి నపుడు అష్జఈ తెగవారి విషయమై దీవించియుండిన దానిని గూర్చి వ్రాసియున్నాము. తాయెఫు నాయకులలో ఉర్వాబిన్

మస్ఊదు అనుసరించక స్వయముగా పైగంబరులవారి సన్నిధికి వచ్చి ఇస్లాము స్వీకరించెను. అతడు పోయి తనతెగవారికి ఇస్లామును గూర్చిబోధింపగా వారతనినిచాల నిందించిరి. ఉర్వాగారు ప్రాతఃకాలమున నమాజుచేయుటకై "అజాను" ఇయ్యంగా వారితెగవారు బాణములు వేసిరి. వానిలో నొక బాణము ఉర్వాగారికి తగిలి మరణించి స్వర్గలోకము చేరిరి. కొన్ని దినముల పిదప సఖీఫు తెగవారికి బుద్ధి గలిగి ఇస్లాములో చేరుటకై యొకరాయబారము పైగంబరులవారి సన్నిధికి పంపిరి. ఆరాయబారము హిజ్రీ తొమ్మిదవయేంట మదీనాపురము చేరెను. ఆరాయబారమున అబ్దయాలీలు అను సర్దారుడు నాయకుడుగా నుండెను. ఆరాయబారులను మసీదు ముంగిట పైగంబరులవారు నిలిపిరి. ప్రతిదినము ముసల్మానులు నమాజు సలుపుటను చూచి యారాయబారుల మనస్సుమృదువగుచుండెను. కొన్ని దినముల పిదప సఖీఫు తెగవారు ఇస్లాములో చేరుటకై యిష్టపడి "మాకొఱకు వ్యభిచారము నిషేధింప కూడదు. వడ్డివ్యాపారము వలన మాజీవనము జరుగుచున్నది. కావున వడ్డితీసికొనుటమాకు ధర్మముగా నుండవలెను. మేము సారాయి త్రాగువారలము. వాని నిషేధింపకూడదు. అను షరతులు సమ్మతించిన ఇస్లాములో చేరుదు"మని పైగంబరులవారితో చెప్పిరి. అపుడు పైగంబరులవారు "అట్లు కానేరదు. వ్యభిచారమును వడ్డి వ్యాపారమును సారాయి మొదలైనవి త్రాగుటను వదలవలసినది." అని యుపదేశించిరి. అది విని సఖీఫువారు ఆషరతులు మేము వాపసు తీసికొనుదుము. కాని మాపెద్ద

దేవతయగు "లాతు" (తాయెఫులోని పెద్దవిగ్రహము) ను
గూర్చి యేమి చెప్పెదరు అని ప్రశ్నించఁగా "దానిని పడఁగొ
ట్టవలెను." అని పైగంబరులవారుపదేశించిరి. అది విని సఖీఫు
వారు "మహాశ్చర్యముతో ఎవరు దాని పడఁగొట్టఁగలరు.
ఈ మన యుద్దేశ మా దేవతకుఁ దెలిసినచో పట్టణమంతయు
నాశనముచేయునే" అని జవాబిచ్చిరి. అది విని హజరత్
ఉమరుగారు అది రాతివిగ్రహము మాత్రమేగదా! ఏమి
చేయఁగలదు!" అని చెప్పఁగా సఖీఫువారు మేము మీతో
మాట్లాడు చుండుటలేదు నడుమ నడుమ మీరేల మాటాడె
దరు? అని చెప్పి పైగంబరులవారితో ఆదేవతా విగ్రహమును
మేము పడఁగొట్టఁజాలము. మీరే దాని నేమిచేయవలెనో
చేయుఁడు అని విన్నవించిరి. పైగంబరులవారు "అట్లే మేమే
దానిని పడఁగొట్టుటకు మాశిష్యులను పంపుదుము. మీరు
భయపడ నక్కఱ లేదు." అని పలికి సఖీఫువారు "నమాజు
జకాతు యుద్ధములఁగూర్చి మమ్ము క్షమింపవలెను." అని
పైగంబరులవారితో విన్నవింపఁగా "నమాజు దినమునకు
అయిదుపూఁటలు చేసితీరవలెను." అని పైగంబరులవారుప
దేశించిరి. జకాతు సంవత్సరములో నొకతూరి భాగ్యవంతులు
మాత్రమే యియ్యవలసినది. యుద్ధములో కొందఱుచేరిన మిగి
లినవారి ధర్మము కూడ నెఱవేఱును. వారే ఇస్లాములో చేరిన
పిదప సంతోషముతో ఆరెండు ధర్మములను ఆచరింతురు.
కావున ఆరెంటిని గూర్చి పైగంబరులవారు నొక్కిచెప్పలేదు.
పిదప సఖీఫువారు ఇస్లాములో చేరిరి. వారి నాయకుఁడగు
గైలానుబిన్‌సల్మాకు పదుగురు భార్యలుండెరి. అతఁడు ఇస్లా

ములో చేరిన పిదప నలుగురు భార్యలు తప్ప మిగిలిన వారిని విడిచి పెట్టెను. సకీఫు తెగవారి విగ్రహమును పడఁగొట్టుటకై మదీనానుండి కొందఱు ముసల్మానులు తాయెఫు పట్టణమునకు పోయి దానిని పడఁగొట్టిరి.

—: బనూహారిసు రాయబారము. :—

బనూహారిసు వంశము నజ్రానుదేశములో మిగుల ప్రసిద్ధిగాంచినది. హజరత్ పైగంబరులవారు ఖాలిదుబిన్ వలీదుగారిని బనూహారిసు తెగవారియొద్దకు నంపిరి. ఖాలిదుగారు పోయి ఇస్లామును గూర్చి వారికి బోధించిరి. ఆవంశమువారు గొప్పభక్తితో ఇస్లాములో చేరిరి. వారు ముసల్మానులైన పిదప పైగంబరులవారి సన్నిధికి తమ రాయబారము పంపిరి. వారి రాయబారి మదీనాపురము చేరి పైగంబరులవారితో సంభాషించెను. పైగంబరులవారు ఖైసుగారిని వారిపై అధికారిగా నియమించిరి.

—: తాయి రాయబారము. :—

యమను దేశములో తాయివంశము చాలగొప్పది. అందు జైదుల్ ఖైల్ అనునతఁడు పెద్దగా నుండెను. జైదు గొప్పకవి. దానముచేయునతఁడు. గొప్ప యుద్ధవీరుఁడు. హిజ్రీ తొమ్మిదవయేఁట జైదును మఱి కొందఱు సర్దార్లును పైగంబరులవారి సన్నిధికి వచ్చిరి. పైగంబరులవారు వారికి ఇస్లామును బోధింపఁగా వారు గొప్పభక్తితో ఇస్లాము స్వీకరించి తమదేశమునకు మరలి పోయిరి.

—: నజ్రాను రాయబారము. :—

మక్కాపట్టణము నుండి యమను దేశపు దిక్కున

నేడు దినముల ప్రయాణదూరమున ఒకపెద్దపల్లె గలదు. దాని
పేరు నజ్రాను. అచటివారు క్రైస్తవులు. అచట వారికి పెద్దగుడి
యుండెను. అందు గొప్ప మతవిద్వాంసులుండిరి. అరేబియాదేశ
ములో నజ్రానచటి క్రైస్తవులు గొప్పవారుగా నుండిరి. హజ్రత
త్ పైగంబరులవారు నజ్రాను క్రైస్తవులకు ఇస్లామును గూర్చి
లేఖ వ్రాసిరి. అందుచే నజ్రాను క్రైస్తవులలో అఱువది
మంది గొప్పపండితులు పైగంబరులవారితో సంభాషించుటకై
మదీనాపురమునకు వచ్చిరి. పైగంబరులవారు క్రైస్తవులకు
ఇస్లాములో చేరుటకై బోధింపఁగా మేము పూర్వమునుండియే
ముసల్మానులముగా నున్నాము అని బదులు చెప్పిరి. పైగంబరు
లవారు "మీరు సిలువపూజను మానుకొని ఏసుక్రీస్తు దేవుని
కుమారుఁడు అనునమ్మికను వదలిపెట్టునంతవఱకు మీరు ము
సల్మానులు కానేరరు" అనియుపదేశించిరి. క్రైస్తవులు ఇస్లాము
లో చేరుటకు సమ్మతింప నందున దేవునాజ్ఞచే పైగంబరుల
వారు "మేము మాయాలుబిడ్డలను దీసికొనివత్తుము. మీరు
మీయాలుబిడ్డలను దీసికొనిరండు. ఎవరు అబద్ధము లాడుచు
న్నారో వారిని దేవుఁడు నాశము చేయుఁగాత అని శపించు
కొందము" అని క్రైస్తవుల పండితులను పిలిచిరి. (దాని
నే ముబాహాలాఅనుదురు.) పిదప పైగంబరులవారు
బీబీఫాతిమాను అజ్రత్ హాసన్ హుసైనులను దీసికొని
ముబాహాలాచేయుటకై రాఁగా క్రైస్తవులలో నొకఁడు
"మేమట్లు ముబాహాలా చేయరాదు. నిజముగా ముహ
మ్మదు దేవుని ప్రవక్తయైనచో మావంశము నశించును. అట్లు
మనము శపించుకొనుట యుక్తము గాదు. కావున

కప్పము కట్టుదుమని యొడంబడిక చేసికొందుము” అనిసలహా చెప్పెను. అందఱు దానికి సమ్మతించి కప్పము కట్టుదుమని యొడంబడిక గావించికొని తమదేశమునకు పోయిరి. దానిగూర్చి ఖురానేషరీఫు యొక్క సూరెఆలెయిమ్రానులో నున్నది.

—: బనూ అసదు రాయబారము. :—

బనూఅసదు కుటుంబములవారు పైగింబరులవారికి విరుద్ధముగా యుద్ధములలో శత్రువులకుఁ దోడుపడుచుండిరి. ఆకుటుంబములవారు హిజ్రీతొమ్మిదవయేఁట ఇస్లాములో చేరి తమరాయబారము పంపిరి. ఇంకను వారియందు పూర్వ ముండిన గర్వము పోకుండెను. కావున వారు పైగంబరుల వారి సన్నిధికి వచ్చి “మేము స్వయముగానే ఇస్లాములో చేరితిమి. మీరు మాయొద్దకు బోధకుల నంపలేదు. అది మేము గావించిన ఉపకారమేగదా” అని పలికిరి. అందుకు దేవుఁడు దాని గూర్చి యిట్లు ఖురానెషరీఫులో సెలవిచ్చెను. “ఓప్రవక్తా! ఇస్లాములో చేరి మీకుపకారముచేసితిమి అని వారు చెప్పుచున్నారు. మీరు ఇస్లాములో చేరి నాకు మేలు చేసితి రని చెప్పకుఁడు. దేవుఁడే మిమ్ము ఇస్లాములో చేర్చి మీకు మేలు చేసెను. అని చెప్పుము.”

—: బనూ ఫజారా రాయబారము. :—

బనూఫజారా వంశమువారు చాలబలవంతులై యుండి రి. పైగంబరులవారు తబూకు నుండి మరలి మదీనాకు వచ్చి నపుడు ఆవంశమువారు తమరాయబారము నంపి ఇస్లాములో చేరిరి.

అబ్దుల్‌ఖైసు వంశము అరబ్బులలో ప్రసిద్ధికెక్కినది యే. ఆ తెగవారు తమరాయబారులను పంపఁగా వారు పైగంబరులవారి సన్నిధికి వచ్చిరి. వారిని పైగంబరులవారు చాల గౌరవించి వారికి మతధర్మములు బోధించిరి. వారు భక్తితో ఇస్లాములో చేరి తమదేశమునకు పోఁగా వారికుటుంబ మంతయు ఇస్లాము స్వీకరించెను.

—: కిందావారి రాయబారము. :—

యమను దేశములోని హాజర్ మౌతు నందున్న జిల్లాలలో నొకటి కిందా అనునది. అచటివారు తమరాయబారమును పైగంబరులవారి సన్నిధికి పంపి ఇస్లాములో చేరిరి.

—: బనూ ఆమిరు రాయబారము. :—

బనూ ఆమిరు కుటుంబమువారు తమరాయబారము పైగంబరులవారి యొద్దకు నంపిరి. ఆరాయబారములో ఆమిరు అర్బదు అనువిద్దఱు ఉండిరి. వారిద్దఱు ఒకకుట్రచేసిరి. ఆమిరు "నేనుముహమ్మదువారితో మాటలాడుచుందును. ఆసమయములో నీవు ముహమ్మదును వధింపుము" అని అర్బదుతో చెప్పెను. పైగంబరులవారితో ఆమిరు మాటలాడుచుండెను. కాని అర్బదు పైగంబరులవారిని చూచి భీతిల్లి తనకృత్యమును నెఱవేర్పలేకపోయెను. అపుడు వారిద్దఱు లేచిపోయిరి. పైగంబరులవారు "ఓ దేవా వీరిద్రోహము నుండి నన్ను రక్షింపుము" అని ప్రార్థించిరి. ఆమిరు దైవవిధిగా ప్లేగురోగముతగిలి హీనంపు చావుచచ్చెను. బనూఆమిరు రాయబారములో జబ్బారుండెను. అతఁడు ఇస్లాములో చేరి తనప్రజలను గూడ ఇస్లాములో చేర్చెను.

—: హిమ్యర్ వంశమువారి రాయబారము. :—

పూర్వము హిమ్యర్ వంశమువారు యమను దేశమును పాలించుచుండిరి. పైగంబరులవారి కాలమున వారిరాజ్యము పెక్కుభాగములుగా విభజింపఁబడి పెక్కురు రాజ్యము చేయుచుండిరి. ఆరాజులు తమతమ రాయబారముల నంపి ఇస్లాములో చేరిరి. పైగంబరులవారు వారికి ధర్మములను దెలుపుటకై తమశిష్యుల నంపిరి. యమను దేశమునుండి బనీ హమ్దా బనీఆలీ బనీముర్రా బనీఖౌలాను మొదలైన వంశముల వారు తమతమ రాయబారములనంపి ఇస్లాములో చేరిరి. దేవుని యనుగ్రహము వలన అరేబియా దేశములోను దానికి చుట్టుపట్లనున్న దేశములలోను ఇస్లాము వ్యాపించెను.

-: వంచకుల నాయకుండగు అబ్దుల్లాబిన్ సలూలు చచ్చుట :-

హిజ్రత్ తొమ్మిదవయేఁట జూఖాదా నెలలో వంచకుల నాయకుండగు అబ్దుల్లాబిన్ సలూలు మరణించెను. అతఁడు బదరుయుద్ధములో ఖైదీలుగా వచ్చిన హజ్రత్ అబ్బాసు (పైగంబరులవారిపినతండ్రి) గారికి ధరించుటకై తనచొక్కాయ నిచ్చియుండెను. అతఁడు గావించిన ఉపకారమునకు గాను పైగంబరులవారు తమ చొక్కాయను దీసి అబ్దుల్లాబిన్ సలూలు యొక్క శవమునకుతొడుగుటకై యొసంగిరి. పైగంబరులవారు అబ్దుల్లాబిన్ సలూలును గొప్పమర్యాదలతో సమాధి గావించిరి. అది చూచి యితరవంచకులు తమవంచనము వదలి నిజముగ ముసల్మానులైరి. చూచితిరా! పైగంబరులవారు తమశత్రువుయెడ గావించిన గౌరవము!

హిజ్రీ తొమ్మిదవయేఁట షాబానునెలలో పైగంబరుల వారి కుమార్తె బీబీఉమ్మెకుల్సూముగారు స్వర్గలోకము పొందిరి. ఆమె హజరత్ ఉస్మానెగనీగారి భార్య.

## హిజ్రీ పదియవయేఁడు.

### —: పైగంబరులవారి బోధన. :—

హిజ్రీ పదియవయేఁట హజరత్ పైగంబరులవారు అబూమూసాఅష్అరీగారిని ముఆజుగారిని యమను దేశమునకు నంపిరి. వారిద్దఱిని పంపునపుడిట్లు బోధించిరి. "మీరు ఇస్లామును గూర్చి శాంతితో బోధింపవలెను. ఎట్టిదౌర్జన్యము చేయకూడదు. ప్రజలు ఇస్లాములో చేరిన పిదప నమాజు చేయుటకు నాజ్ఞాపింపవలెను. భాగ్యవంతుల నుండి దానము (జకాతు) పుచ్చుకొని దానిని నిఱుపేదలకు పంచవలెను. ప్రజలు ఇస్లాముధర్మములకు లోఁబడి నడచుకొనిన' వారిపై నెట్టిదౌర్జన్యము చేయరాదు. దానము (జకాతు) పుచ్చుకొనునపుడు మేలైనసొత్తే తీసికొనకూడదు. మధ్యమమగు సొత్తును పుచ్చుకొనవలెను. ఎవరిమనస్సును నొప్పింపరాదు. నొప్పి దగిలి శపించువారి శాపమునకు భయపడవలెను."

### —: ఖాలిదుగారి ప్రచారము. :—

హిజ్రీపదియవయేఁట పైగంబరులవారు ఖాలిదుబిన్ వలీదుగారిని యమనుదేశములోని నజ్రాను కుటుంబమగు అబ్దుల్ముదాను యొద్దకు ఇస్లాముప్రచారమునకై పంపిరి. ఖాలిదుగారు పోయి వారికి బోధింపఁగా నచటివారందఱు ముసల్మానులైరి. ఖాలిదుగారు ఆవార్తను పైగంబరులవారికిఁ దెలుపఁగా పైగంబరులవారు ఆవంశములోని కొందఱి

సి వెంటఁబెట్టుకొని మదీనాపురమునకు వచ్చుటకై ఖాలిదుగారి కవ్రాసిరి. అటులే ఖాలిదుగారు ఖైసుబిన్‌హాసన్ మొదలైన వారిని పిలుచుకొని మదీనాపురమునకు వచ్చిరి. అబ్దుల్ముదా ను తెగవారు కొన్నిదినములు పైగంబరులవారి అతిథులుగా నుండి మరలి తమ దేశమునకు పోయిరి. పైగంబరులవారు ఖైసును వారి కధికారిగాఁజేసి పంపిరి.

—: అలీ గారు యమను నకు పోవుట. :—

హిజ్రీపదియవయేఁట పైగంబరులవారు హాజ్రత్ అలీ గారిని కూడ యమను దేశమునకు 320 మందిని తోడుచేసిపంపిరి. వారు యమను దేశమునకు పోయి మరల పైగంబరులవారి యాత్రచే కాబాయాత్రకొఱకు పైగంబరులవారు మక్కాపురము పోయి యున్నపుడు వచ్చి చేరిరి.

—: రాయబారములు. :—

హిజ్రీపదియవయేఁట ఖౌలాను సలామాను గామిదు అను తెగవారి రాయబారులు పైగంబరులవారి సన్నిధికి వచ్చి తమతమకుటుంబముల వారు ఇస్లాములో చేరినవార్తను దెలిపిరి. పైగంబరులవారు ఆరాయబారులను గౌరవించి గొప్పగొప్ప బహుమానము లిచ్చిపంపిరి.

—: కాబాయాత్ర. :—

హిజ్రీ పదియవయేఁట సంభవించిన విషయములలో పైగంబరులవారు గావించిన కాబాయాత్ర(హాజ్) ముఖ్యమైనది. చుట్టుపట్ల నున్న దేశములలో శాంతి గలిగి ప్రజలు ఇస్లాములో చేరి తమతమరాయబారములను పంపిరి. మక్కాపురమునుండి మదీనాపురమునకు వచ్చిన పిదప పైగంబరుల

వారు కాబాయాత్ర(హజ్) చేయలేరు. అందుచే హిజ్రీపది యవయేంట జూఖాదా నెలలో కాబాయాత్ర కొఱకు పైగంబరులవారు పయనమగుదురు. రాఁగోరియున్న ముసల్మానులు రావచ్చును అని చాటింపఁబడెను. ఆప్రకటన ననుసరించి ముసల్మానులు వేలకొలఁది మదీనాలో కూడిరి. హజ్రత్ పైగంబరులవారు జూఖాదానెల 25 వ తేది శనివారము నాఁడు స్నానముచేసి లుంగీ దుప్పటము ధరించి జుహరునమాజు సలిపి మదీనాపురములోనుండి పయనమై 6 మైళ్లదూరమున నున్న జుల్ హలైఫా అనుచోటున ముఖాము చేసిరి. వారి వెంట వారిస్త్రీలందఱు నుండిరి. చుట్టుపట్ల నుండి వచ్చిన ముసల్మానులు ఒకలక్షయిరువదినాలుగువేల పజకుండిరి. పైగంబరులవారు జుల్ హలైఫాలో నొకరాత్రి బసచేసి ఆదివారము నాఁడు మరలస్నానముచేసి అత్తరుపూసికొని రెండురకాతులు నమాజు సలిపి ఇహ్రాము(కాబాయాత్ర కొఱకు సంకల్పించుట) నుద్దేశించి లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్ లాషరీకలక లబ్బైక్ ఇన్నల్ హమ్దువన్-నేమత-లక్ వల్ ముల్కు లాషరీకలక్. ఓదేవా మేము నీసన్నిధికి వచ్చియున్నాము. ఓదేవానీకు సాటి లేదు. మేము వచ్చి(హాజరు)యున్నాము. సర్వస్తోత్రములకు నీవేయర్హుఁడవు. నీవేఅనుగ్రహించువాఁడవు. నీదేయీసమస్తరాజ్యము. ఎవ్వఁడును నీకుభాగస్థుఁడు లేడు. అని వచించిరి. అచటి నుండి పైగంబరులవారును వారిశిష్యులను పయనమై ఆదివారము నాఁడుఉదయము జుల్ హజ్ నెల 4-వ తేది మక్కాపురమున ప్రవేశించిరి. మదీనా నుండి మక్కాపురము తొమ్మిది దినములలో వచ్చిచేరిరి. పైగంబరులవారు మక్కాపురము

ప్రవేశించు నప్పుడు కాబామసీదు కనంబడగానే "ఓ దేవా నీవు ఈ గృహమునకు మఱి హెచ్చు గౌరవమును ఘనతను దయ చేయుము" అని వేడిరి. పైగంబరులవారు కాబామసీదును ప్రదక్షిణించిరి. దాని పిమ్మట ముఖామె ఇబ్రాహీమ్ అనుచోటున రెండురకాతులు నమాజు సలిపి సఫా అను కొండతిప్ప పై నెక్కి అచ్చటి నుండి కాబామసీదు కనంబడగా "లాఇలాహా ఇల్లల్లాహు వహ్దాహూ-లాషరీక లహూ-లహుల్ ముల్కు వలహుల్-హమ్దుయుహ్యీ-యూ-వయుమీతు-వహువ-అలాకుల్లి షయ్యిన్-ఖదీర్-లా-ఇలాహ -ఇల్-లల్లాహువహ్దహూ-అన్జ జనావహూ నసర. అబ్దహూ-వహజమల్ అహ్జాబ వహ్దహూ. దేవుని కంటె మించినది లేదు. అతనికిసాటి లేదు. అతనిదే రాజ్యము. అతండే సర్వస్తోత్రములకు అర్హుండు. అతడే ప్రాణ మిచ్చుచున్నాండు. అతండేచావునిచ్చుచున్నాండు. అతండే సర్వ శక్తుండు. దేవుండు అద్వితీయుండు. అతనికంటె నితర దైవము లేదు. దేవుండు తనవాగ్దానము నెఱవేర్చెను. తన సేవకునికి (పైగంబరులవారికి) తోడుపడెను. అతండే శత్రుసైన్యములను ఓడించెను." పిదప పైగంబరులవారు సఫాకొండతిప్పనుండి దిగివచ్చి మర్వా అను కొండతిప్పనెక్కి ముందు పఠించిన వాక్యములే పఠించిరి. పైగంబరులవారు సఫా మర్వా మధ్యచేయవలసిన యాత్రికధర్మములను నిర్వర్తించిరి. మునల్మానులందఱును యాత్రయందలి ఆచారములన్నియు చేసిరి. హజ్రత్ అలీగారు యమనుదేశము నుండి ఖుర్బానీ కొఱకు ఒంటెలు తీసికొని మక్కాపురము వచ్చి పైగంబరులవారితో కలిసి కొనిరి. యమను నుండి అనేక యాత్రికులుకూడ వచ్చి

చేసిరి. మక్కాపురము యాత్రికుల సమూహములతో నిండి పోయెను. ఎచటచూచిన భక్తులు దేవుని స్తుతించు శబ్దములే వినఁబడుచుండెను. వారిధ్వనులచే కొండలు ప్రతిధ్వనింప సాగెను. పైగంబరులవారు జుల్‌హజ్ నెల 8-వ తేది గురువారమునాఁడు తమశిష్యులతోఁ గూడి "మినా" అనుచోటునకు పోయి ముఖాము చేసిరి రెండవదినము శుక్రవారము (9 జుల్‌హజ్) నాఁడు ప్రాతఃకాలమున నమాజు చేసి "మినా" నుండి పయనమై "అరఫాత్" అనుమైదానము చేరి ముఖాము చేసిరి. ఆమైదానమంతయు భక్తులతో నిండిపోయెను. ఎచట చూచిన గుడారములు కనఁబడుచుండెను. పైగంబరులవారు "నమిరా" అను చోటున కంబళిగుడారములో నిలిచిరి. మధ్యాహ్నమైనపిదప పైగంబరులవారు "ఖస్వా" అనుఒంటె నెక్కి అరఫాతు మైదానములో నిలిచియున్న వేలకొలఁది శిష్యుల నెదుట నిట్లుపన్యసించిరి.

—: ఉపన్యాసము :—

"ఓజనులారా? నామాటల నాలకింపుఁడు రాఁబోవు సంవత్సరము ఈమైదానమందు మీరు నన్ను చూడలేరేమో? ప్రజలారా? ముసల్మానుల ప్రాణములను సొత్తులను మానములను కాపాడవలెను. వానిఁగూర్చి యెట్టిహత్యను గావింపఁగూడదు. ఈనెల, ఈదినము, ఈపురము (మక్కా) ఎట్లు గౌరవనీయములో యట్లే ముసల్మానుల ప్రాణములు సొత్తులు, మానములు గౌరవనీయములు. నేను మీకు ధర్మములను బోధించితినిగదా? ఓదేవానీవు సాక్షిగానుండుము. మీ యొద్ద నెవరి సొత్తు అమానతుగా నుండునో దానిని సొత్తువానికి నప్పగిం

చనలెను. (నమ్మికద్రోహము చేయరాదు) పూర్వకాలమున్న వడ్డీ వ్యాపారము ఈదినము రద్దుచేయఁబడెను. పూర్వము వడ్డీబాకీగా నున్నదంతయు త్రోసివేయఁబడుచున్నది. మొట్ట మొదట నాబంధువులలో నాపినతండ్రియగు అబ్బాసుగారికి రావలసిన వడ్డీ త్రోసివేయుచున్నాను. పూర్వము ప్రాణహత్యలు గావింపఁబడిన వానిగూర్చిన శిక్ష క్షమింపఁబడుచున్నది. మొట్టమొదట నాబంధువుఁడగు అమిరును వధించినట్టి హుజైలువారిని క్షమించుచున్నాను. పూర్వవైరములన్నియు వదలివేయుఁడు. పూర్వకాలపు మూఢాచారము లన్నియు రద్దుచేయఁబడినవి. కాని కాబామసీదుధర్మకర్తృత్వమును యాత్రికులకు నీరిచ్చు నుద్యమము పూర్వప్రకారమే యుండును. ఓప్రజలారా? ఈప్రాంతమందు విగ్రహారాధన జరుగునను ఆశ సైతాను వదలి పెట్టెను (అనఁగా విగ్రహారాధన తుదముట్ట నశించినది) కాని విగ్రహారాధన తప్ప మిగిలిన వానిలో సైతాను మిమ్ముబొంకింపఁగలను ఆశగలిగి యున్నాఁడు. (కావున మీరెట్టిపాపములు గూడ చేయరాదు) స్త్రీలవిషయమున దేవుని శిక్షకుభయపడుఁడు. వారిని గౌరవింపుఁడు. వారిని గూర్చి యెట్టి అన్యాయము చేయనలదు. మీరు స్త్రీలనుదేవునాజ్ఞవలన గ్రహించియున్నారు. స్త్రీలను అమానతుగా దేవుఁడు మీకు నొసంగియున్నాఁడు. కావున వారికి చాల మర్యాదలు చేయుఁడు. మీకొకటి చెప్పుచున్నాను దానిని స్థిరముగా ననుసరించినచో మీరు సన్మార్గమందుండుదురు. దుర్మార్గము నుండి రక్షింపఁబడుదురు. అదే దేవుఁడొసంగిన ఖురానుగ్రంథము. దాని ననుసరింపుఁడు. నేను మీకు దేవునాజ్ఞలు వినిపిం

చితిని గదా! ఓ దేవా నేను నీధర్మములను ప్రజలకుఁ దెలిపితిని. నీవేసాక్షిగ నుండుము. ఓప్రజలారా! దేవుఁడు అద్వితీయుఁడు. సాటి లేని వాఁడు. మీరందఱుఒకతండ్రి సంతానము. మీరందఱు ఆది పురుషుఁడగు ఆదమునొక్క పుత్రులు. దేవుఁడు ఆదమును మట్టితో సృజించెను. ఎవ్వఁడు భక్తిలో నెక్కువవాఁడో వాఁడు దేవుని యొద్ద గొప్పవాఁడు. జాతిభేదములుండఁగూడదు. అజ్మీ(అరబ్బులుకానివారు) లకన్న అరబ్బులు గొప్పవారు కారు. అందఱును సమానులే. దేవుని యందు గల భక్తినిబట్టి గొప్పతనము లభించును. దేవునాజ్ఞలుమీకుఁ దెలిపితిని గదా! ఓదేవా నీవేసాక్షిగనుండుము. నాయుద్యమము నెఱవేర్చితిని. మునల్మానులందఱు సహోదరులు, సోదర భావము గలిగియుండ వలెను. మీబానిసల విషయమున జాగ్రత్త పడుఁడు. మీరుభుజించునట్టిదే వారికి బెట్టుఁడు. మీరు ధరించువస్త్రములట్టివే వారికి తొడిగింపుడు.” దానిపిదప పైగంబరులవారు ఓముసల్మానులారా దేవుఁడు మీతో నావిషయము ప్రశ్నించును. మీరేమి జవాబు చెప్పెదరు అని పలుకఁగా నందఱును “తాము దేవుని సందేశము మాకు పూర్తిగా నందజేసి మీ యుద్యమము నెఱవేర్చితిరి” అని చెప్పెదుమని విన్నవించిరి. అదివిని పైగంబరులవారు “ఓదేవా నీవుసాక్షిగ నుండుము” అని మూఁడుపర్యాయములు పలుకుచు తమ చూపుడువేలును ఆకాశము వైపున కెత్తిరి. దానిపిదప పైగంబరులవారు “ఇచ్చట కూడియున్న ప్రజలు పోయి ఇచ్చటికి రాఁకయున్నవారి బోధింపుఁడు. విన్నవి విన్నట్లు వారికి వినిపించిన నందలి తత్వము మీకంటె నెక్కువ గ్రహింపఁగలుగు

వారెందఱో యుండఁగలరు గాన వారిపట్ల మీప్రచారము చాల ఫలవంతమగును.” అనుసమయమున దేవుని సందేశము (వహీ) వచ్చెను. అదియేమన! అల్‌యౌమ-అక్‌మల్తు-లకుమ్-దీనకుమ్-వ-అత్‌మమ్తు-అలైకుమ్-నేమతీ-వరజీతు లకుముల్ ఇస్లామ-దీనా—(ఈదినము మీకొఱకు మతమును సంపూర్ణముగఁ జేసితిని. నాయనుగ్రహమును మీపై పూర్తిచేసితిని. మీకొఱకు ఇస్లామును మతముగా సమ్మతించితిని.) పైగంబరుల వారు జొహరు అసరు నమాజులు చేసి సూర్యాస్తమానము వఱకు నిలిచి యచట దువా (ప్రార్థన) చేసి అరఫాతు మైదానము నుండి పయనమైరి. జనసమూహమును మెల్లమెల్లగ పోవుటకుపదేశించుచు పయనము సాగించి ముజ్దలఫా అను చోటున ముఖాముచేసి అచట మగ్‌రిబ్ ఇషా నమాజుచేసి యారాత్రి యచటనే నిద్రపోయిరి. పైగంబరులవారు ప్రాతఃకాలమున మేలుకొని శిష్యులందఱితోఁ గలిసి నమాజు చేసి సూర్యోదయమునకు ముందే యచటి నుండి పయనమై జమ్రా అను చోటునకు వచ్చి యచటి యాచారములు సలిపి “మినా” అను ప్రదేశము చేరిరి. అచట పైగంబరులవారు ఒక లక్ష యిరువదినాలుగువేల జనసమూహము మధ్యనిలిచి గొప్ప యుపన్యాసము గావించి కాబాయాత్ర (హజ్) ధర్మములను దెలిపిరి. ఆయుపన్యాసములోని కొన్నివిషయముల నిచట వ్రాయుదుము. “ఓప్రజలారా వినుఁడు. నాపిదప మీరు దుర్మార్గులై ఒకొరినొకరు వధించుకొనఁగూడదు. మీరు దేవుని సన్నిధికి పోవలసియున్నవారు. దేవుఁడు మీకర్మములను విచారించును. చెవియొగ్గి వినుఁడు. నేరము చేయువాఁడే దానికి

బాధ్యుఁడు. (జిమ్మాదారుఁడు) తండ్రి చేసిన నేరమునకు కు
మారుఁడు బాధ్యుఁడు కాఁడు. కుమారుని నేరమునకు తండ్రి
జవాబుదారుఁడు కాఁడు. (పూర్వము తండ్రిచేసిన నేరమునకు
కుమారుని శిక్షించుచుండిరి. అట్లే కుమారుని నేరమునకు
తండ్రిని శిక్షించుచుండిరి. ఆయన్యాయమును పైగంబరుల
వారు రద్దుచేసిరి.) ఓప్రజలారా మీరు దేవునినే యారాధింపుఁ
డు. అయిదుపూఁటలు నమాజు చేయుఁడు. రమజానునెల
పూర్తిగ ఉపవాసము (రోజా) చేయుఁడు. నాయాజ్ఞల ననుస
రింపుఁడు. మీరు స్వర్గము (జన్నత్) పొందుదురు. ఒకవేళ
ముక్కు తెగిన హబ్షీబానిస మీపై యధికారము పొంది మి
మ్ము ఖురానెషరీఫు ధర్మముల ననుసరించి నడిపించినచో మీ
రతని మాటప్రకారము నడచుకొనవలెను. ఉపన్యాసము ము
గిసిన పిదప పైగంబరులవారు తమ వందఖుర్బానీ ఒంటెలలో
అఱువదిమూఁడును తమచేతులారా జబాచేసిరి. మిగిలినవానిని
హజరత్ అలీగారు జబాచేసిరి. ఆవందయొంటెల మాంసము
ను చర్మములను దానముచేసిరి. పైగంబరులవారు ఒక యా
వును తమ స్త్రీలతరపున ఖుర్బానీ చేసిరి. పైగంబరులవారు
ఖుర్బానీ చేసిన పిదప క్షౌరము చేయించుకొని తమ తలవెం
డ్రుకలను ముసల్మానులకిచ్చిరి. భక్తులు మహాభక్తితో ఆవెం
డ్రుకలను పుచ్చుకొనిరి. పిదప మినా నుండి మక్కాపుర
ము వచ్చి కాబామసీదును ప్రదక్షిణించి "జమ్‌జమ్" అను
బావి యొద్దకువచ్చి దానిలోని నీళ్లను త్రాగిరి. అచటి నుండి
మరలి మినా చోటునకు వచ్చి జొహరు నమాజు సలి

పిరి. పైగంబరులవారు మినా లో మూఁడుదినముల వఱ
కు ముఖాము చేసిరి. నాలుగవ దినము జుల్‌హాజ్ నెల 13వ
తేది మంగళవారమునాఁడు ప్రొద్దు వాలిన పిదప "ముహాస్స
బు" అను చోటున ముఖాము చేసి యారాత్రి యచటనే
పరుండిరి. ఆచటి నుండి వేకువజామున లేచి మక్కాపురమున
కు వచ్చి కాబామసీదును ప్రదక్షిణించి నమాజు (ఫజర్) చే
సిరి. దాని పిదప యాత్రికు లందఱు తమతమ పురములకు
పయనమైరి.

—: మదీనాపురమునకు మరలుట. :—

పైగంబరులవారు ముహాజిర్లను అన్సారులను వెంబడి
దీసికొని మదీనాపురమునకు పయనమైరి. పైగంబరులవారుదారి
మధ్యలో గదీరెఖుమ్ అనుచోటున ఒకయుపన్యాసము గావిం
చిరి. పైగంబరులవారు మదీనాపురము సమీపించి జుల్ హాలైఫా
అనుచోటున రాత్రిబసచేసి సూర్యోదయకాలమున మదీనాపుర
ము ప్రవేశించిరి. పైగంబరులవారు మదీనాపురము ప్రవేశిం
చునపుడు ఇట్లువచించిరి. "అల్లాహుఅక్బరులాయిలాహాఇల్
లల్లాహునహ్దాహులాషరీకలహూ-లహుల్ ముల్కు-వలహుల్ హా
మ్దు-వహువఅలాకుల్లి-షయ్యిన్-ఖదీర్-ఆయిబూన-తాయిబూ
న-ఆబిదూన-సాజిదూన-లిరబ్బినా--హామిదూన-సదఖల్లాహు
వాదహు-వనసర-అబ్దహువహాజమల్-అహాజాబ-వహ్‌దహు-
(అల్లా సర్వాధికుఁడు. అతనికంటె నితర దైవము లేదు. అతనికి
సాటిలేదు. అతనిదే రాజ్యము-అతఁడే సర్వస్తోత్రములకు అర్హుఁడు
-అతఁడు సర్వశక్తుఁడు. మేము క్షమాపణకోరుచు దేవుని

ఆరాధించుచు, సాష్టాంగనమస్కారములు(సిజ్దా) చేయుచు దేవుని స్తుతించుచు మరలివచ్చుచున్నాము. దేవుఁడు తనవాగ్దానము నెఱవేర్చెను. తనసేవకుని (పైగంబరులవారి) కీ తోడుపడెను. అతఁడే శత్రుసైన్యములను ఓడించెను. ఇది పైగంబరులవారు గావించిన కడపటి కాబాయాత్ర(హజ్) గావున దీనిని "హజ్జతుల్ వదా" అనుదురు.

హిజ్రీ పదునొకండవయేఁడు.

—: పరలోకధ్యానము. :—

హిజ్రీపదియవయేఁట సూరెఫత్హ (మక్కావిజయమునుగూర్చినవాక్యము) వలన పైగంబరులవారు ఇహలోకమును త్వరలోనే వీడిపోవుదురనువిషయము గ్రహింపఁబడెను. సూరెఫత్హ:—దేవుని సహాయమును విజయమును లభించి దేవుని మతము (ఇస్లాము)లో ప్రజలుగుంపులు గుంపులుగా వచ్చి చేరుట నీవుచూచినపుడు నీప్రభువును స్తుతించుము. అతని క్షమాపణ కోరుము. అతఁడేక్షమించువాఁడు.

పదియవయేఁట కాబాయాత్ర సమయమున అరఫాతు మైదానములో అల్ యౌమ (చూడు 228 పుట) అనుదైవసందేశము (వహీ) వలన పైగంబరులవారు ఇహలోకములోని యుద్యమము నెఱవేర్చిరి అనియు ఇఁక పరలోకమునకు పోవలసియున్నదిఅనియు తెలియనాయెను. అందుచే పైగంబరులవారు తమ కాబాయాత్రలోని యుపన్యాసములలో "నేను రాఁబోవు సంవత్సరము కాబాయాత్రకు రానేమో" అని యుపదేశించిరి. అప్పటి నుండి పైగంబరులవారు దైవసన్నిధికి పోవుటకై సిద్ధపడియుండి దేవుని ధ్యానించుచుండిరి.

—: ఒహుదు గోరీలను దర్శించుట. :—

పైగంబరులవారు ఒహుదుయుద్ధములో స్వర్గలోకము పొందినవారి కొఱకు దువా (ప్రార్థన) చేయుటకై ఒహుదు ప్రదేశమునకుం బోయి యచట గోరీలను దర్శించి ఇట్లు ఉపన్యసించిరి. నేను మీకు ముందుగా "హౌజు" నొద్దకు పోవుచున్నాను దాని వైశాల్యము "ఏలా" నుండి హుజఫా మధ్య నుండు వైశాల్యమంత యున్నది. నాకు లోకములో నున్న ఖజానాల కొయ్యచీకులు ఒసంగబడినవి (అనఁగా నా శిష్యులు. లోకమును జయింతురు) ఇఁక మీరు నాపిదప విగ్రహారాధన చేయుదు రను భీతి నాకులేదు గాని లోక వ్యవహారములో మునిఁగి దానికొఱకు పరస్పర హత్యలు గావించుకొని పూర్వీకులు నశించినట్లు మీరు కూడ నశింతురేమో అని భీతిల్లుచున్నాను.

—: ఉసామా గారి సైన్యము. :—

ముతాయుద్ధములో హజ్రత్ జైదుబిన్ హారిసుగారు వధింపఁ బడియుండిరి. వారిని వధించినవారికి ప్రత్యపకారము చేయవలసియుండెను. దానికొఱకు పైగంబరులవారు హిజ్రీ 11-వ సం॥ సఫరు నెల 26-వ తేదిన జైదుగారి కుమారుఁడగు ఉసామాను సేనాధిపతిగా నియమించి సైన్యమునకు సిద్ధమగుటకై యాజ్ఞనిచ్చిరి. ఉసామాగారు సైన్యమును దీసికొని మదీనాపురమునకు బయట ముఖాము చేసిరి. అపుడు వారివయస్సు 17 సంవత్సరములు. అందుచే కొందఱు వారి సేనాధిపత్యమును గూర్చి సందేహించిరి. ఆవిషయము పైగంబరులవారికిఁ దెలిసి అతని తండ్రి యెట్లు సేనాధిపత్యమునకు

సహాయ్యార్తై యుండెను. అయితే ఉతుండు (ఉసామా) కూడా శ్రేష్ఠుడు. అని ప్రజలను మందలించి సైన్యమును సాగనంపిరి. దానికి మఱునాడే పైగంబరులవారు జబ్బుపడుటచే ఉసామాగారి దండయాత్ర నిలిచి పోయెను. తుదకు పైగంబరులవారి పిదప హజ్రత్ అబూబకరుగారు ఉసామాగారి సైన్యమును పంపిరి. ఆ సైన్యము పోయి హత్యగావించి యున్న వారిని వధించెను.

—: పైగంబరులవారి జబ్బుపడుట. :—

పైగంబరులవారు సఫరు నెల 28-వ తేది బుధవారమున బీబీమైమూనాగారి గృహములో నుండినప్పుడు వారికాకస్మికముగ తలనొప్పి గలిగెను. ఆనొప్పి వృద్ధిపొందుచు జ్వరము గలిగెను. దినదినము జ్వరము హెచ్చుచుండెను. జ్వరముతో నున్నను పైగంబరులవారు వంతుల ప్రకారము స్త్రీల గృహములకుఁ బోవుచుండిరి. అట్లు గృహములకుఁ బోవుటలో కష్టమగుచుండెను. దినదినము జ్వరముచే బలము తగ్గుచుండెను. అందుచే స్త్రీలందఱును గలిసి పైగంబరులవారు కోరిన గృహములోనే యుండవచ్చును. అని విన్నవింపంగా పైగంబరులవారు బీబీఆయిషాగారి గృహము నందుండుటకు సమ్మతించి యచటనే యుండసాగిరి. నడచుటకు సత్తువయున్న దినములలో పైగంబరువారే మసీదునకుఁ బోయి నమాజుచేయుచుండిరి. పైగంబరులవారు ఒకరాత్రి యిషా నమాజు కొఱకు మసీదునకు వచ్చుటకై స్నానముచేసి లేచిరి కాని సొమ్మసిల్లిరి. తిరిగి తెలివి నొందిన పిదప స్నానము చేసి లేచిరి కాని మరల సొమ్మసిల్లిరి. తిరిగి తెలివి నొందిరి. అట్లు

మూఁడుసార్లు సంభవించిన పిదప పైగంబరులవారు నమాజు చేయించుటకై హజ్రత్ అబూబకరుగారిని నియమించిరి. దాని పిదప హజ్రత్ అబూబకరుగారు 17 పూఁటల నమాజు జరిపించిరి. పైగంబరులవారు బలహీనతచే మసీదునకు రాలేకపోయిరి. అందుచే అన్సారులు పైగంబరులవారి దర్శనము లభించుట లేదే యని దుఃఖించుచుండిరి. అది పైగంబరులవారికిఁ దెలిసి హజ్రత్ అలీ హజ్రత్ ఫజల్ బిన్ అబ్బాసుగారి సహాయమున మహాకష్టముతో మసీదునకు వచ్చిరి. అప్పుడు హజ్రత్ అబూబకరుగారు జొహరు నమాజు చేయించుచుండిరి. పైగంబరులవారు హజ్రత్ అబూబకరుగారి ప్రక్కన గూర్చుండి నమాజుచేయించిరి. దానిపిదప నిట్లు తమశిష్యులకు బోధించిరి. దేవుఁడు ఒకసేవకునకు ఇహలోక సౌఖ్యమో పరలోక సౌఖ్యమో యొకదాని నెన్నుకొనుటకై అనుజ్ఞనిచ్చియున్నాఁడు. ఆసేవకుఁడు దేవుని సన్నిధిని పరలోక సౌఖ్యమును సమ్మతించెను. (అది విని హజ్రత్ అబూబకరుగారు దానిభావము గ్రహించి పైగంబరులవారే పరలోకమున కేగు నట్టి సేవకులు అని తలఁచి దుఃఖముచే నేడ్చిరి.) అందఱికంటె హెచ్చుగ అబూబకరు యొక్క ధనమును సేవయును నాకు లభించినవి. నేను ఇహలోకములో నాశిష్యులలో నెవనినైన స్నేహితునిగాఁ జేయదలఁచినచో అబూబకరును స్నేహితునిగాఁ జేసికొనియుందును. కాని ఇస్లాము వలన గలుగు సోదరత్వమే చాలును. దేవుఁడే నాస్నేహితుఁడు. మసీదువైపున నున్న కిటికీలన్నియు మూసివేయుఁడు. కాని అబూబకరు గృహము యొక్క కిటికీని మాత్రము మూయకుఁడు. వినుఁడు మీకు పూర్వము

ప్రజలు ప్రవక్తలవెనుకనేయు భక్తులవెనుకనేయు సమాధులను పూజించిరి. మీరట్లు చేయకూడదు సుమీ యని పైగంబరులవారు అన్సారుల విషయమిట్లు తమ శిష్యులకు బోధించిరి. ఓ ప్రజలారా! నేను మీకు అన్సారుల విషయము బోధించుచున్నాను. అన్సారులు దినదినమునకు తగ్గుదురు. ఇతర ముసల్మానులు వృద్ధిపొందుదురు. అన్సారులు తమ ద్యముము నెఱవేర్చిరి. ఇప్పుడు మీరు వారిని గూర్చి శ్రేష్ఠపుచ్చుకొనవలెను. అన్సారులు నా దేహములోని అన్నకోశము వంటివారు. మీలో నెవరు అధికారము పొందుదురో వారు అన్సారులు చేసిన సత్కార్యమును సన్మానించవలెను. వారి వలనఁ గలుగు పొరపాటులను మన్నింపవలెను అని పసపడి యిట్లు బోధించిరి. హలాల్ (చేయవలసిన) ధర్మము హరామ్ (చేయరానిది) గూర్చిన నియమములు దేవుఁడు నిర్మించినది. నేను స్వయముగా నెద్దియును నిర్మించలేదు. కావున వాని విషయమున జాగ్రత్తగ నుండుఁడు. పాపపుణ్యములు మనుష్యుని కర్మలను బట్టి గలుగును. కావున నాకుమార్తెయగు బీబీ ఫాతిమాయును నామేనత్తయగు బీబీసఫియ్యాయును దేవుని ప్రీతి కొఱకు సత్కార్యములు చేయవలెను. నేను వారిని దేవుని శిక్ష నుండి తప్పింపఁ జాలను అనివచించి పైగంబరులవారు గృహమునకు వచ్చిరి. పైగంబరులవారు బీబీఫాతిమాగారిని పిలిచి రహస్యముగా నొకమాట చెప్పఁగా నామె యేడ్వసాగెను. మరల రహస్యముగా నొకమాట పలుకఁగా నవ్వసాగెను. బీబీఆయిషాగారు దానిగూర్చి అడుగఁగా మొదటి తూరి "నేను దేవుని సన్నిధికి పోవుచున్నాను" అని చెప్పిరి.

కావున నాయనగారు పరలోకమునకేగుదురను దుఃఖముతో
నేడ్చితిని. రెండవతూరి "నాపిదప శీఘ్రముగా నందఱికన్న ముం
దుగా నాయొద్దకు నీవు వత్తువు" అని పలికినందున నాయనగారి
యొద్దకు శీఘ్రముగా పోఁ గలను అనుసంతసముతో నవ్వితిని
అని బీబీఫాతిమాగారు బదులు చెప్పిరి. పైగంబరులవారికి దిన
దినముజ్వరము తీవ్రముగా హెచ్చుచుండెను. అట్టిస్థితిలోఁగూడ
నింటిలోకొన్ని దీనారములుండఁగ వానిని దానము చేయుటకై
బీబీఆయిషాగారికి సెలవిచ్చిరి. తత్క్షణమే దీనారములు దానము
చేయఁబడెను. ఆజ్వరములో నొకతూరి "యూదులను క్రైస్తవు
లను దేవుఁడు శపించుగాత! వారు తమప్రవక్తల సమాధులను
పూజింపసాగిరి. (అదియే విగ్రహారాధనకు మూలకారణము.
ప్రజలు తమపెద్దలు చనిపోయినపిదప వారి విగ్రహములు కల్పిం
చి వాని నారాధింపసాగిరి. అట్లుచేయువారు దేవుని కోపమునకు
పాత్రులగుదురు) అని పైగంబరులవారు ఉపదేశించిరి. పైగం
బరులవారు పరలోకము చేరుటకొకదినము ముందు (ఆదివా
రమునాఁడు) కొందఱు బంధువులు మందు త్రాగించుటకు సిద్ధ
మైరి. అది పైగంబరులవారికి సమ్మతి లేకుండెను. కావున వ
లదుఅని పలికి సొమ్మసిల్లిరి. ఆసమయమున బంధువులు పై
గంబరులవారి నోరు తెఱచి మందుత్రాపిరి. పైగంబరులవారు
తెలివి నొంది నాకెవరెవరు మందు త్రాపిరో వారుకూడ
మందు త్రాగవలసినదిఅని పలికిరి. అచట పైగంబరులవారి పి
నతండ్రి హజరత్ అబ్బాసుగారు కూడనుండిరి. వారు మందు
త్రాపుటలో భాగము పుచ్చుకొనలేదు. కావున వారు తప్ప
మిగిలినవారు మందు త్రాగిరి.

జ్వరము హెచ్చుచు తగ్గుచుండెను. రబీఉల్ అవ్వల్ నెల 12వ తేది సోమవారమునాఁడు ప్రాతఃకాలమున కొంచెము నెమ్మది గలిగెను. పైగంబరులవారి గృహము మసీదు ప్రక్కలో నుండెను. ముసల్మానులందఱు ప్రాతఃకాలమున నమాజు చేయుచుండఁగా పైగంబరులవారు తెరనెత్తి ముసల్మానులను చూచి సంతసముతో చిఱునవ్వు నవ్విరి. ముసల్మానులు పైగంబరులవారిని చూచి పరవశులై నమాజు వదలునట్టి స్థితి సంభవించెను. అప్పుడు పైగంబరులవారు తమ చేతితో సైగ చేసి మరల తెర వేసికొనిరి. ఆదర్శనమే ముసల్మానులకులభించిన ఆఖరుదర్శనము. ప్రొద్దు హెచ్చుకొలఁది పైగంబరులవారు సొమ్మసిల్లుచు తెలివి నొందుచుండిరి. ఆసమయమున అల్లాహుమ్మ ఫిర్ రఫీఖిల్ ఆలా" (ఓ దేవా! సర్వాధికుఁడైన దేవుని సన్నిధికి) అని పలుకుచుండిరి. అది విని బీబీఆయిషాగారు "ఇప్పుడు పైగంబరులవారు పరలోకము చేరుకాలము సమీపించినది"యని నిశ్చయించిరి. ఆసమయమున బీబీఆయిషాగారి అన్నగారగు అబ్దుల్ రహ్మానుగారు "మిస్వాక్" (పల్లుతోముపుల్ల) తీసికొని వచ్చి యుండిరి. పైగంబరులవారు దాని వైపుచూచిరి. పైగంబరులవారు పల్లుతోముటకు నుద్దేశించుచున్నారని గ్రహించి బీబీఆయిషాగారు ఆపుల్లను దీసికొని నమలిమెత్తగాఁ జేసి పైగంబరులవారికి నొసఁగిరి. పైగంబరులవారు తమ చేతులార పల్లుతోముకొనిరి.

ప్రొద్దువాలెను. పైగంబరులవారి ప్రాణము క్రిందికి దిగుచు పైకివచ్చుచుండెను. నీళ్లను దీసికొని మాటిమాటికి ముఖముపై తుడుచుకొనుచుండిరి. అట్టి యవసానకాలమున

పెదవులు కదలెను. అప్పుడు నుండిన వారిట్లు వినిరి. అస్సలా
త్-అస్సలాత్ వమామలకత్ ఐమానుకుమ్-(నమాజు -నమా
జు మఱియు బానిసలు. అనగా నమాజును గూర్చి శ్రద్ధపుచ్చు
కొనుడు. స్థిరముగా సలుపుడు. బానిసల విషయము కనికర
ము నిలిపి వారికి సౌఖ్యములు గలుగఁజేయుడు). ఆసమయ
మున పైగంబరులవారు నొప్పటిని ఒకప్పుడు ముఖముపై
నై చిక్కొనుచు నొకప్పుడు ముఖము నుండిదీయుచుండిరి. అం
తలో తమ కుడిచెయ్యి నెత్తి చూపుడు వ్రేలుతో సైగ చేసియూఁ
మతూగుల్లా పలికిరి. బలిర్రఫీఖుల్ ఆలా "(ఇపుడెవరును న
లెను, సర్వశ్రేష్ఠుండైన దేవుఁడే కావలెను) దాని పిదప చేతులు
నేలఁబడెను. కన్నులు స్థిరపడిపోయెను. పైగంబరులవారి
పరిశుద్ధాత్మ పరలోకము చేరెను. ఇన్నాలిల్లాహి-వఇన్నా
ఇలైహిరాజిఊన్ (మేము దేవుని వారలమే. మఱియు నతని
సన్నిధిని చేరువారమే.) పైగంబరులవారు పరలోకము చేరున
ప్పటికి 63 సం॥ లు వయస్సుండెను. సల్ లల్లాహుఅలైహివసల్లమ్.

పైగంబరులవారు పరలోకము చెందినవార్త చే మదీనా
పురమంతయు దుఃఖసముద్రములో మునిఁగి పోయెను. కొందఱు
దుఃఖముచే నేమియు తోఁచక ఆవార్త నిజము కాదని
తలఁచిరి. హజ్రత్ ఉమరుగారు పరవశులై పైగంబరులవారి
మరణమును గూర్చి నిశ్చయింపక ఖడ్గము దూసి" ఎవ్వరు పై
గంబరులవారు పరలోకము చెందిరి అని చెప్పుదురో వారిని
ఖడ్గముతో నఱుకుదు"నని చెప్పుచుండిరి. అట్లు భక్తులందఱు
దుఃఖముచే విహ్వలించుచుండిరి. అంతలో హజ్రత్ అబూ
బకరుగారి కావార్త తెలిసి మహాదుఃఖములో పైగంబరులవా

రున్న గృహాము:నకుఁ బోయి పైగంబరులవారి ముఖమును ము
ద్దిడికొని మనశ్శాంతి గలిగిన పిదప మసీదునకు వచ్చి దుఃఖస
ముద్రములో మునిఁగియున్న ముసల్మానుల నుద్దేశించి యిట్లు
బోధించిరి. "ఓజనులారా! ఎవరు పైగంబరులవారి నారాధించు
చుండిరో వారిప్పుడు పైగంబరులవారు పరలోకము చెందిరని
తెలిసికొనవలెను. మఱియునెవరు దేవునే యారాధించుచుండి
రో వారు దేవుఁడు చావనివాఁడు, అని తెలిసికొనవలెను. అని
పలికి ఖురానెషరీఫులోని వాక్యము నిట్లు పఠించిరి. "ముహమ్మ
దు కూడ దేవుని ప్రవక్తయే. పూర్వముకూడ ననేక
ప్రవక్తలు గడచిరి. ఆయన (ముహమ్మదు) మరణించిన లేక
వధింపఁబడిన మీరు మతభ్రష్టులగుదురా! ఎవరు మతభ్రష్టు
లగుదురో వారు రవంతయు దేవునికి హాని చేయలేరు.
దేవుఁడు కృతజ్ఞత సలుపువారికి పుణ్యము లొసంగును." ఆపలు
కులు విని ముసల్మానులును ఉమరుగారును శాంతివహించిరి.

—: పైగంబరులవారి సమాధి :—

ముసల్మానులు దుఃఖించి శాంతిపొందు నప్పటికి ప్రొద్దు
పోయెను. అందుచే సోమవారమునాఁడు పైగంబరులవారిని
సమాధి గావించుటకు వీలుకాకుండెను. రెండవదినము మంగ
ళవారమునాఁడు చాలరాత్రి యైనపిదప పైగంబరులవారిని
సమాధి గావించిరి. పైగంబరులవారిని స్నానము చేయించున
ప్పుడు హజ్రత్ అబ్బాసుగారి కుమారుఁడగు ఫజలును ఉసా
మాగారును పర్దా పట్టి యుండిరి. హజ్రత్ అలీగారును హజ్
రత్ అబ్బాసుగారును స్నానముచేయించిరి. దానిపిదప పైగంబ
రులవారు ప్రాణము విడిచిన చోటనే గోరీ త్రవ్విరి. సమాధి